# భారతనిరుక్తి

# నన్నయ రుచిరార్థసూక్తి

రచయితలు :

డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి, M. A., Ph. D.

సూరం శ్రీనివాసులు, M. A.

ప్రథమ ముద్రణ : ఏప్రిల్ 1983
ప్రతులు : 1000



ప్రతులకు :
T. V. S. గంగాధరకుమార్
A. 22, విజయపురి సౌత్ 522 439.

వెల : 8-00

(Paper used for the printing of this book is made available by the Government of India at concessional rate.)

రామచంద్రా ప్రింటర్స్, లాలాపేట, గుంటూరు-3. ఫోన్ : 24842

# చిన్న విన్నపము

"ఎంత సముద్రాలమీద ఎగిరినను పక్షి రాత్రికి గూటికి చేరును. ఇది జాతీయత. ఇది సంప్రదాయము" అన్నారు విశ్వనాథ. నిజమే. ఎన్ని మార్గాల్లో పయనించినా, ఎన్ని సముద్రాలు అధిగమించినా, ఎంత విజ్ఞానం ఆపోసన పట్టినా, మానవుడికి చివరికి తన జాతి సంస్కృతిలోనూ, సంప్రదాయంలోనూ, కావలసినంత హాయీ, తృప్తీ ఏర్పడుతాయి. వివిధ జీవనమార్గాల్లో కొంత అనుభవం గడించుకున్నాక వారందరికీ తమ సంస్కృతిమీదా, సంప్రదాయాలమీద, తమ దైన ధార్మిక జీవన విధానంమీదా మనసు మొగ్గుచూపుతూ ఉండటం చూస్తున్నాము. ఇది అంతరమైన ఆకాంక్ష, కుతూహలమూను. అటువంటి భారతీయులకు శ్రీ మహాభారతం "ఇదిగో మన సంస్కృతి ఇది. మన జాతి ధర్మం ఇది" అంటూ హాయినీ, తృప్తినీ పంచే అమృత భావనలను పండిస్తూ ఆహ్వానం పలుకుతుంది.

అయితే ఆ అమృతకలశం దేవవాణిలో వేదవ్యాసునిచేత నిక్షిప్తం అయింది. దాన్ని తెలుగువారికి సన్నిహితంచేసి విందుగ చేశారు కవిత్రయం వారు. ఆ విందు సార్వకాలీనమూ, సార్వజనీనమూను. వివిధ లౌకిక కార్య కలాపాల్లో మునిగి తేలుతున్న ప్రజావాహినికి ఆ విందుకు హాజరయ్యే అవకాశమూ, ఆస్కారమూ లేకపోతోంది. కాగా రాను రాను ఆ విందు జరుగుతున్నట్లే గమనించలేని పరిస్థితి ఏర్పడుతోంది. ఒకటి రెండు భక్ష్యాలను రుచి చూపించి ఆ విందుకు మనసారా ఆహ్వానించడమే మా ఈ ప్రయత్నం.

ఈ ఆహ్వానం సర్వ ప్రజావళికి అందించాలని సంకల్పం. ప్రగతిశీలురయిన సామాన్యులకు అందేటట్లు, ప్రజ్ఞావంతులయిన ధీమాన్యులకు ఆనేటట్లు ఈ ఆహ్వాన పత్రిక తయారుచేస్తున్నాము.

పత్రిక తయారుచేయడంలో పొరపాట్లుంటే సర్దుకుని "కవిత్రయంవారి మహాభారతం విందు"లో మాత్రం తప్పకుండా ఎప్పుడయినాసరే మరిచిపోకుండా పాల్గొని ఆత్మసంతృప్తిని పొందుమని సవినయంగా విన్నవించుకుంటున్నాము.

ఇది సన్నలగ సంవత్సరంగా ప్రజలు జరుపుకుంటున్న తరుణం. ఈ తరుణంలో మా విన్నపాన్ని కూడా వినిపించుకుంటారని ఆశంస. ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహకారాన్ని అందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం అధికారులకు హార్దిక కృతజ్ఞతలు.

— రచయితలు

# అభినందనము

భారత నిరుక్తి - నన్నయ రుచిరార్థ సూక్తి

ఇదియొక వ్యాఖ్యా గ్రంథము. వ్యాఖ్యాతలు డాక్టర్ తిప్పాభట్ల రామకృష్ణ మూర్తిగారు, శ్రీ సూరం శ్రీనివాసులుగారును సంస్కృత భాణ సాహిత్యమును గూర్చి సర్వంకషమైన పరిశోధన గ్రంథమును రచించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి పురస్కారమును పొందియున్న పండితద్వయము.

ప్రధానముగా భారతీయమైన సంప్రదాయమునందు గౌరవముగల వీరిరువురు ఈ వ్యాఖ్యానమును మనోహరముగ సంతరించియున్నారు. కవిత్రయములో ఆద్యులు తెనుగువారికి ప్రాతస్స్మరణీయులైన నన్నయభట్టారకుల భారత భాగములోని నీతి, ధర్మ ప్రబోధకములైన పద్యముల నేటి సులభ సుందరమైన వ్యావహారిక భాషలో తత్పద్యములను వక్కాణించియున్నారు.

నన్నయ భట్టారకులు "సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తి" ఇత్యాది పద్యములో మహాభారత సంహితా రచన బంధురత్వమునుగూర్చి సహృదయులకు సూచనలు చేసియున్నారు. ఆ సూచనత్రయములో భారతము నానా రుచిరార్థ సూక్తులకు నిధి యన్నది యొకటి. ఇతః పూర్వము పండిత పరిశోధకులు తత్తదంశములపై విపులము లయిన విమర్శనములు చేసియున్నారు. వీరిపుడు పరిశ్ర మించి కావించిన ఈ కార్యము తెనుఁగులోని సామాన్య పాఠకులకు సుబోధమగు విధముగా నలరారుచున్నది.

ఆంధ్ర ప్రభుత్వమువారిచే "నన్నయ సంవత్సరము" గా పరిగణింపబడిన ఈ విద్యావత్సరము ఈ రచనకు ప్రేరకమై యుండవచ్చును. ఏమైననేమి ? నన్నయ గారి నీతి ధర్మ ప్రబోధకమైన భారతపద్యములకు వ్యాఖ్యానము చాల అవసరమైనపని. ఎన్నో పద్యములు పద్యగీత పాదములు లోకములో పలువురు ఆయా సందర్భముల యందు ఉదహరించుచునేయుందురు.

"నిండు మనంబు నవ్య నవనీత సమానము పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము"
"తగునిది తగదని యెదలో వగవక సాధులకుఁ బేదవారల కెగ్గుల్
మొగి జేయు దుర్వినీతుల కగు ననిమిత్తాగమంబులైన భయంబుల్
"క్రోధమ తపముం జెఱచును ...
"కామశక్తి నోర్వఁ గలరె జనులు"
"మఱియెఱిగి యెఱుగ నొల్లని
కఱటిం దెలుపంగఁ గమల గర్భుని వశమే!"
"సుతజల పూరితంబులగు నూతులు నూఱిటి కంటె...
సూనృత వాక్యము మేలు సూడఁగన్"
"గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్"
"నలసారము సంసారము"

ఇట్టి వెన్నో తెలుఁగువారి నోళ్ళలో నానుచున్న పద్యములు, పాదములు నన్నయగారివి. పద్యమునకు సందర్భమును వివరించుచు, దానికి అర్థము చెప్పుటయే కాక, పాఠకుని మరికొంత ఆలోచనా పథమునకు తీసుకొని వెళ్ళునట్టి వివరణమిందు హృద్యముగా నున్నది. మూలభారతమునుండియు, మరికొన్ని ప్రసిద్ధ గ్రంథముల నుండియు శ్లోకములు తత్ర తత్ర సందర్భోచితముగా నుదాహృతము లగుటచేఁ బ్రామాణికత్వము ద్యోతక మగుచున్నది. ఆయా పద్యముల వివరణములో కొన్ని గాథలుకూడ చక్కఁగా పేర్కొనబడినవి. ఈ పద్ధతి పఠితకు కౌతుకావాదకము.

మఱల విశేషములు ఎత్తిచూప నక్కఱయుండదు. ఈ వివరణము తెలుగు జిజ్ఞాసువులకు బహూపకారకము. వ్యాఖ్యాతలకు హార్దమయిన అభినందనములు తెల్పుచున్నాను.

(సం.) మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

సర్వభూతదయకు సత్యవాక్యమునకు
నుత్తమంబు ధర్మమొండెఱుంగ
నొరుల నొప్పి కోడ కుపతాపమొనరించు
నదియ కడు నధర్మమనిరి బుధులు

— నన్నయ

# నన్నయ భారత భాగ కథ

విశ్వశ్రేయస్సుకోసం శౌనకుడు నైమిశారణ్యంలో ద్వాదశ వార్షిక యాగం చేస్తున్నాడు— అక్కడికి ఉగ్రశ్రవసుడు వచ్చి వారితో "వ్యాసుని శిష్యుడు రోమహర్షణుడు మాతండ్రి – వారి దయవలన ఎన్నోకథలు తెలుసుకున్నాను. మీకెటువంటి కథ కావలిస్తే అటువంటి కథ చెపుతాను" అన్నాడు. వారు హృద్యమూ, అపూర్వమూ, జ్ఞానప్రదమూ, అఘనిబర్హణమూ అయిన కథ వినాలని ఉంది అన్నారు. అపుడు భారతం చెప్పడం మొదలు పెట్టాడు రౌమహర్షణి –

వ్యాసుడు శ్రీమహాభారతాన్ని వ్రాశాడు. అందులో శ్రీకృష్ణుని మహిమా, పాండవుల గరిమా తెల్పబడుతుంది – ఆ భారతాన్ని నూరు పర్వాలలో (జయమనే పేరుతో) సుమారు లక్ష శ్లోకాల్లో 3 సం॥ ల్లో వ్రాశాడు వ్యాసుడు. భూలోకంలో జనమేజయుడికి చెప్పేందుకు శిష్యుడు వైశంపాయనుణ్ణి ఆదేశించాడు – వాని వల్ల నేను విన్నాను.

కృతయుగాంతంలో దేవాసురయుద్ధం, త్రేతాయుగంలో రామ రావణ యుద్ధం వలెనే ద్వాపరయుగాంతంలో పాండవ కౌరవులకు ఘోర యుద్ధం జరిగింది. పాండవ బలం 7 అక్షౌహిణులు - కౌరవ బలం 11 అక్షౌహిణులు. ఆయుద్ధం వీరిరువురికి శమంత పంచకంలో 18 రోజులు జరిగింది.

అయితే ముందు అక్షౌహిణి అంటే ఏమిటో, శమంత పంచకం ఏమిటో చెప్పండి అని మహర్షులు ప్రశ్నించారు – రౌమహర్షణి చెపుతున్నాడు.

త్రేతా ద్వాపరయుగాల సంధికాలంలో పరశురాముడు తన కుఠారంతో క్షత్రురాజు లందర్ని 21 మారులు చంపివేశాడు వారి రక్తం 5 మడుగులు కట్టింది. ఆ రక్తంతో పితృతర్పణం చేశాడు – అప్పటికి పరశురాముని కోపం శమించింది. ఆ మడుగుల సమీప ప్రదేశం శమంత పంచకం అయింది. ఇక అక్షౌహిణి అంటే 21870 రథాలూ, అన్ని ఏనుగులూ, 65610 గుఱ్ఱాలూ, 109350 కాల్బలమూ కలిగిన సేనను అక్షౌహిణి అంటారు.

శమంత పంచకమే కురుక్షేత్రం - అక్కడ జనమేజయుడు దీర్ఘ సత్రం చేస్తున్నాడు. అక్కడకు సారమేయం వచ్చింది. జనమేజయుని తమ్ముళ్ళు కొట్టి

తరిమివేశారు. తల్లి సరమకు కోపం వచ్చి జనమేజయుణ్ణి అనిమిత్తమయిన భయాలు కలుగుతాయని తిట్టి వెళ్ళిపోయింది.

కొన్నాళ్ళ తరువాత సోమశ్రవసుణ్ణి పురోహితుడుగా చేసుకొని ఎన్నో యాగాదులు చేస్తున్నాడు - జనమేజయుడు. ఇట్లుండగా .

పైల మహర్షి శిష్యుడు ఉదంకుడు గురుదక్షిణ సమర్పించడంకోసం పౌష్య మహారాజు పత్ని నడిగి కుండలాలు తెస్తున్నాడు. ఆ కుండలాల మీద పూర్వంనుంచీ కన్నువేసి ఉన్నాడు తక్షకుడు - సమయం చూసి అపహరించి, తక్షకుడు -పాతాళానికి పారిపోతున్నాడు — వెంట పడ్డాడు ఉదంకుడు - పాతానికి వెళ్ళి తన శక్తితో పాతాళాన్ని వశంచేసుకొని కుండలాలు పుచ్చుకొని సకాలానికి గురుపత్ని కిచ్చాడు - తర్వాత ఈ వైరం దృష్టిలో పెట్టుకొని ఉదంకుడు జనమేజయుణ్ణి సర్పయాగం చెయ్యమని ప్రోత్సహించాడు —

సర్పయాగం ఏమిటి ? అని ఋషులు ప్రశ్నించారు — పూర్వం జనమేజయుని సర్పయాగంలో సర్వభక్షకుడైన అగ్నిలో కద్రువ కొడుకులైన సర్పాలన్ని తల్లిశాపంచేత పడవలసి వచ్చింది — అపుడు జరత్కారుని కొడుకు ఆస్తీకుడు ఆ సర్పయాగాన్ని మాన్పించాడు. రురుడుచేసే సర్పఘాతాన్ని సహస్రపాదుడు మాన్పించినట్లు — అని రౌమహర్షణి — రురుని చరిత్ర ముందు చెపుతానన్నాడు —

భృగునిభార్య పులోమ గర్భవతి. ఆమెను పులోముడనే రాక్షసుడు ఎత్తుకు పోతూఉంటే కుక్షిచ్యుతుడై చ్యవనుడు పుట్టాడు. అతని కొడుకు ప్రమతి. ప్రమతి కొడుకు రురుడు. ఆ రురుడుకి ప్రమద్వరతో వివాహం నిశ్చయం అయింది. ఒక నాడామెను పాము కరచింది. యమధర్మరాజు అనుమతితో ఆయువులో సగం ఇచ్చి ఆమెను బ్రతికించుకున్నాడు రురుడు. అప్పటినుండి పాములపై పగబట్టి వెదకి చంపడం మొదలుపెట్టాడు. ఒకపామును చంపడానికి దండంఎత్తాడు- "హరి హరీ" అంటూ ఆ పాము ఎందుకిట్లా చంపుతున్నావు పాముల్ని ? అని అడిగింది. విషయం చెప్పాడు రురుడు. వెంటనే ఆ పాము సహస్రపాదుడనే మునిగా మారిపోయింది. తన వృత్తాంతంచెప్పి - బ్రాహ్మణుడవైన నీకికోపం తగదని బోధించి సర్పఘాతం నుండి తప్పించాడు సహస్రపాదుడు రురుణ్ణి.

అపుడు శౌనకాదులు "కద్రువ తనకొడుకుల్ని ఎందుకు శపించింది ?" అని అడిగారు—

రౌమహర్షణి ఇట్లా చెప్పాడు.

కశ్యప ప్రజాపతికి కద్రువ, వినత అని ఇద్దరు భార్యలు. కద్రువ వేయి మంది పుత్రులు కావాలని భర్తను కోరింది. వారికంటే బలాధికులయిన వారు ఇద్దరు చాలును అంది వినత. కశ్యపుడట్లే అనుగ్రహించాడు. కద్రువ గర్భాండములు పాము లుగా అయినవి. కాని వినత గర్భాండములు రూపుదాల్చలేదు. ఆగలేక వినత ఒక గ్రుడ్డు చితిపింది. తొడలవరకే శరీరం తయారయిన ఒకపుత్రుడు ఉద్భవించాడు. పూర్ణశరీరం రాకుండా గ్రుడ్డు చితిపినందుకు తల్లిని "సవతికి దాసివగుదువుగాక" అని శపించి సూర్యరథసారథిగా వెళ్ళిపోయాడు అనూరుడు.

ఒకనాడు సముద్రతీరంలో కద్రూ వినతలు విహరిస్తూ ఉచ్చైశ్శ్రవాన్ని చూచారు. కద్రువ "దానితోక నల్లగాఉంది" అంది. కాదంది వినత. కద్రువ పందెం వేసింది. నలుపుఉంటే నీవు నాకు దాసివి కావాలని. దగ్గరకువెళ్ళి చూద్దాంరా అంది వినత. రేపుచూద్దాంలే అంది కద్రువ. ఇంటికివచ్చి కద్రువ కొడుకుల్ని బ్రతిమి లాడింది గుఱ్ఱంతోక నల్లబఱచమని. కొడుకులు ఒప్పుకోలేదు. కోపంతో కద్రువ "జనమేజయుని సర్పయాగంలో మరణింతురు గాక" అని శపించింది. అందులో కర్కోటకుడు మాత్రం ఒప్పుకొని ఆ గుఱ్ఱం తోక పట్టుకొని నల్లగా వ్రేలాడాడు. మర్నాడు కద్రూ వినతలు వెళ్ళిచూచారు. తోక నల్లగావుంది. వినత కద్రువకు దాసి అయింది. కొన్నాళ్ళకు రెండవగ్రుడ్డునుండి గరుత్మంతుడు పుట్టి, నాగులకు అమృతం తెచ్చి యిచ్చి దాస్యం పోగొట్టుకున్నాడు.

కద్రువ కొడుకు వాసుకి బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి తల్లిశాపం తగుల కుండా చేసుకున్నాడు. అయినా సర్పకులం నాశనంకాకుండా ఏంచెయ్యాలా అని ఆలోచించాడు తమ్ముళ్ళతో. ఏలా పుత్రుడివల్ల విషయం తెలుసుకున్నాడు. జరత్కారు డనే మహర్షికి పుట్టిన ఆస్తీకుడు సర్పయాగం నివారిస్తాడని. వెంటనే వెళ్ళి తనచెల్లెలు జరత్కారువును జరత్కారుడనే మహర్షికిచ్చి వివాహంచేశాడు. వారికి ఆస్తీకుడు పుట్టాడు.

ఇదిట్లావుండగా అక్కడ జనమేజయుడు తనతండ్రి పరీక్షిత్తు తక్షకుని చేత ఎట్లా మరణించాడని మంత్రుల్ని అడిగాడు. వారు శమీకువృత్తాంతం చెప్పారు. పరీక్షిత్తు ఒకసారి వేటకువెళ్ళి తన కనుమరుగయిన లేడినిగూర్చి శమీకుణ్ణి అడిగాడు. అతడు మౌనవ్రతుడు. మాట్లాడలేదు. పరీక్షిత్తుకు కోపంవచ్చి శమీకునిమెడలో

చచ్చినపామును పడేసి వెళ్ళిపోయాడు. తరువాత శమీకునికొడుకు శృంగి యిది తెలిసికొని "ఏడురోజుల్లో తక్షక విషంతో మరణించుగాక" అని పరీక్షిత్తును శపించాడు. తండ్రిమెడలో పామును తీసిపారేశాడు వెంటనే తనుయిచ్చిన శాపంవల్ల శమీకుడు కొడుకును మందలిస్తాడు. గౌరముఖుడనే శిష్యుడిచేత మహారాజుకు కబురంపుతాడు. అతడెన్ని రక్షణలు కల్పించుకున్నా తక్షక విషంచేత 7వ రోజున చచ్చిపోయాడు. ఈవిషయం విని జనమేజయుడు సర్పయాగంచేసి నాతండ్రికీ, ఉదంకుడికీ, ప్రీతి చేకూరుస్తా ననుకున్నాడు. సర్పయాగం ప్రారంభించాడు. నాగులంతా వచ్చి హోమ కుండంలో పడుతున్నారు.

అపుడు ఆస్తీకుడు వచ్చి రాజును, యజ్ఞాన్ని స్తుతించాడు ఏం కావాలో కోరుకొమ్మన్నాడు రాజు. ఆస్తీకుడు సర్పయాగాన్ని విరమింపజేయమన్నాడు. రాజు అట్లే చేశాడు.

జనమేజయుడు సర్పయాగం ఉపసంహరించి ఒకనాడు వ్యాసుని భారత యుద్ధం ఎందుకు జరిగింది అని అడిగాడు. వ్యాసుడు వైశంపాయనుణ్ణి చెప్పమన్నాడు. పాండవులకూ కౌరవులకూ వైరానికి కారణం చెప్పినకథ అంతా సంగ్రహంగా చెప్తాడు వైశంపాయనుడు. తరువాత వేదవ్యాసుని జన్మప్రకారం చెప్పాడు. పరాశరునికి, మత్స్యగంధి సత్యవతికి కృష్ణద్వీపంలో పుట్టినవాడు కృష్ణద్వైపాయనుడు అని చెప్పాడు. పాండవ కౌరవ వీరులు దేవదానవుల అంశతో పుట్టారని చెప్పాడు. తరువాత కురువంశంగూర్చి చెపుతూ నహుషుని కొడుకు యయాతికథ చెప్పాడు. యయాతికి ఇద్దరు భార్యలు. ఒకతె దేవయాని. ఈమె శుక్రుని కూతురు. ఈమెకు యదు, తుర్వసులనెడి కొడుకులు. రెండవది శర్మిష్ఠ. ఈమెకు ద్రుహుడు, అనుడు, పూరుడు అను ముగ్గురు కొడుకులు. యయాతికి శుక్రశాపం చేత ముసలి తనం సంక్రమించింది. అప్పుడు యయాతి తనకు విషయ వాంఛలు తీరలేదని తన ముసలితనం తీసుకొని యౌవనం ఇమ్మని కొడుకుల్ని అర్థించాడు. పెద్దవాళ్ళు నలుగురూ తిరస్కరించారు. చివరి పూరుడు సమ్మతించాడు. యయాతి విషయవాంఛలు తీరాక తన ముసలితనం తీసుకొని పూరుడికి రాజ్యం ఇచ్చి తపోవనానికి వెళ్ళిపోయాడు. ఎన్నో యేండ్లు ఘోర తపస్సు చేశాడు. బ్రహ్మలోకం వెళ్లి అక్కడ నుండి దేవలోకం వచ్చాడు. అక్కడ ఇంద్రుడు "నీవు నీ కొడుక్కి పట్టాభిషేక సమయములో ఏ ధర్మాలు చెప్పావు" అని అడిగాడు. యయాతి చెప్పాడు. అప్పుడు ఇంద్రుడు "నీ తపస్సు చాలా గొప్పది" అన్నాడు.

"నిజమే నా తపస్సుతో మహర్షుల తపస్సుకూడ సమానం కా"దన్నాడు. "నీ గర్వానికి పుణ్యం సమాప్తం అయింది, భూలోకానికి వెళ్ళు" అన్నాడు ఇంద్రుడు. "మనుష్య లోకానికి వెళ్ళేను సజ్జనులతో ఉండునట్లు అనుగ్రహించవ"న్నాడు యయాతి. "సరే" అన్నాడు ఇంద్రుడు. అక్కడ యయాతి దౌహిత్రులయిన అష్టకాదులను చూశాడు. వారడిగిన ధర్మ సందేహాలన్నీ తీర్చాడు. వారి సాంగత్యంతో మళ్ళీ ఊర్ధ్వలోకానికి వెళ్ళాడు

యయాతి చివరి కొడుకు పూరుడు వంశకర్త అయ్యాడు. కావున తరువాతి వంశాన్ని పూరు వంశం అన్నారు. తర్వాత వాని వంశంలో ఇలినుడికి దుష్యంతుడు పుట్టాడు. ఆ దుష్యంతుడు ఒకసారి వేటకోసం అడవికి కణ్వాశ్రమానికి వెళ్ళి అక్కడ పెరుగుతున్న మేనకా విశ్వామిత్రుల కూతురు శకుంతలను గాంధర్వ వివాహం చేసుకొని రాజధానికి వచ్చాడు. కొన్నాళ్ళకు శకుంతల భరతుణ్ని కన్నది. అతనికి యౌవరాజ్యాభిషేక వయస్సు వచ్చినా దుష్యంతుడు తీసుకువెళ్ళలేదు శకుంతలను. ఆమె తన కొడుకుని తీసుకుని దుష్యంతుని సభలోకి వచ్చింది నేరుగా. అన్నీ గుర్తుచేసి చెప్పుకొన్నది. "నీవెవరో నాకు తెలియ"దన్నాడు దుష్యంతుడు. ఆమె ఎన్నో రీతుల చెప్పింది. అయినా కాదన్నాడు. చివరకు విసిగి కన్నీటితో వెనుతిరిగింది శకుంతల. అంతలో ఆకాశవాణి యదార్థం చెప్పింది. అప్పుడు స్వీకరించాడు శకుంతలను దుష్యంతుడు. లోకులు అపవాదు వేస్తారని యింతకు ముందు తెలిసినా స్వీకరించలేదని ప్రజలకు చెప్పాడు. ఆ తరువాత వాని వంశంలో 'హస్తి' పుట్టాడు. అతని పేరుమీదనే హస్తిపురం ఏర్పడింది. తరువాత కొంత కాలానికి కురుడు పుట్టాడు. అతని పేరుమీద కురుక్షేత్రం ఏర్పడింది. ఆ వంశంలో ప్రతీపుడికి దేవాపి, శంతనుడు, బాహ్లికుడు పుట్టారు. అందులో దేవాపి చిన్నతనంలోనే తపోవనానికి వెళ్ళాడు. శంతనుడు రాజయ్యాడు. అతని భార్య గంగాదేవి తనకు పుట్టిన కొడుకుల్ని గంగలో పారవేస్తూ వుండేది. ఎనిమిదవ కొడుకును పారవేస్తుంటే శంతనుడు వారించాడు. (తమ నియమాన్ని అనుసరించి) తనకు అప్రియం పలికినందుకుగాను గంగాదేవి శంతనుని విడచివెళ్ళిపోయింది. కొడుకుని తీసుకొని. కొంత కాలానికి అతణ్ణి సకల శాస్త్ర విదుణ్ణిచేసి తీసుకువచ్చి అప్పజెప్పింది తండ్రికి. అతడే భీష్ముడు. ఒక రోజున యమునా తీరంలో శంతనుడు సత్యవతినిచూచి మోహించాడు. విషయం తెలిసికొని కొడుకు భీష్ముడు దాశరాజును సమీపించి అతనికి కావలసిన రెండు ప్రతిజ్ఞలుచేసి (తనకు రాజ్యం లేకుండా సత్యవతి కొడుకులే రాజ్యం ఏలుతాలని. 2) తాను వివాహం చేసుకోనని)

తండ్రికి వివాహం చేశాడు ఆ సత్యవతీ శంతనులకు చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడూ పుట్టారు. చిత్రాంగదుడు చిన్నతనంలోనే చిత్రాంగదుడనే గంధర్వుని చేతిలో చచ్చిపోయాడు. తరువాత విచిత్ర వీర్యుడికి కాశీరాజు కూతుళ్ళు అంబిక, అంబాలిక లను వివాహం చేశాడు భీష్ముడు. వారియందు సంతానం పొందకుండానే మర ణించాడు విచిత్రవీర్యుడు. రాజ్యం అరాజకమయిపోతుందనే భయంతో భీష్మణ్ణి వివాహం చేసుకుని సంతానం కనమంది సత్యవతి. భీష్ముడుప్రతిజ్ఞా భంగం చేయ నన్నాడు. అప్పుడు వ్యాసుణ్ణి తలంచింది. అతని వలన దేవర న్యాయంతో అంబిక యందు ధృతరాష్ట్రుడు (గ్రుడ్డివాడుగా), అంబాలికయందు పాండురాజు (పాండు శరీరంతో), దాసియందు మహా మేధావి, ధర్మవిదుడు విదురుడు పుట్టారు.

భీష్ముని పెంపకంలో ధృతరాష్ట్రి పాండురాజులు చక్కగా పెరిగారు. ధృతరాష్ట్రుడికి గాంధారినీ, పాండురాజుకు కుంతీ, మాద్రులనూ ఇచ్చి వివాహం చేశారు. పాండురాజు దిగ్విజయంచేసి ప్రజల్ని సంతోషపరిచాడు. ఒకనాడు పాండురాజు కుంతీ మాద్రులతో సహా హిమవత్పర్వత సమీపానికి వేటకు వెళ్ళాడు. అక్కడ కామ మోహితమయిన మృగ దంపతుల్ని కొట్టాడు. ప్రాణావశిష్టమయిన ఆ మృగం తాను కిందముడననే మునిననీ ప్రియాసంగమం అయినప్పుడే నీవూ మరణిస్తావనీ శపించి చనిపోయింది. ఎంతో విచారించాడు పాండురాజు. శత శృంగంలోనే ముని వృత్తినవలంబించాడు. కుంతీ మాద్రులు సేవిస్తున్నారు. ఒక నాడు స్వర్గానికి వెళ్ళే మునులను చూచి వారి వెనుక తానూ బయలుదేరాడు. కొంత ధూరం వెళ్లాక "అనపత్యులు స్వర్గానికి రాలేరు." అని పాండురాజును రావద్దన్నారు. అప్పుడు పుత్రులపై కోరిక కలిగింది పాండురాజుకు. కుంతీదేవి తనకు దుర్వాసు డిచ్చిన వరప్రభావాన్ని చెప్పింది. తరువాత భర్త అనుమతితో కుంతి యమధర్మ రాజువల్ల దర్మరాజును కన్నది. ఇది విని గర్భవతియైన గాంధారి, ఇంకా తనకు పుత్రుడు కలగలేదనే అసూయతో ఉదర తాడనం చేసుకుంది. ఒక పెద్ద మాంస పిండం పుట్టింది. వ్యాసుడువచ్చి దాన్ని 101 భాగాలుగా చేసి రక్షించమన్నాడు. వానిలో మొదట దుర్యోధనుడు పుట్టాడు. సరిగా అదేరోజున వాయువరంవల్ల కుంతికి భీముడు పుట్టాడు. ఆ తర్వాత ధృతరాష్ట్రుడికి ఒక వైశ్య స్త్రీవల్ల యుయు త్సుడుపుట్టాడు. తర్వాత గాంధారికి రోజుకొక్కరుగా దుశ్శాసనాదులు, చివర దుశ్శల అనే కూతురూ పుట్టారు. ఒక సంవత్సరం తర్వాత ఇంద్ర ప్రసాదంతో కుంతి అర్జునుణ్ణి కన్నది. కుంతివరం చేతనే మాద్రికూడా అశ్వినీ దేవతల్ల

ప్రసాదంలో నకుల సహదేవుల్ని కన్నది. సుఖంగా కాలం గడుస్తోంది. వసంతం విజృంభించింది. పాండురాజు మనసిజరాగాయత్తుడయి మాద్రిని కలిశాడు. వెంటనే మరణించాడు. మాద్రి సహగమనం చేసింది. అక్కడి మునులు కుంతినీ అయిదుగురు పుత్రుల్నీ హస్తినకు చేర్చారు. వారందరినీ ఓదార్చి వ్యాసమహర్షి తన తల్లి సత్యవతినీ, అంబికా అంబాలికలనూ తపోవనానికి తీసుకువెళ్లాడు. అక్కడ వారు ముగ్గురూ ఘోర తపస్సు చేసి శరీరం విడిచారు.

కురు కుమారులు అంతా కలిసి పెరుగుతున్నారు. భీముని బలానికి అసూయ పడ్డారు దుర్యోధనాదులు. నిద్రపోతున్న భీముణ్ణి కట్టివేసి గంగలోకి త్రోయించారు. ఒకనాడు కాలసర్పాలచేత కరిపించారు. విషాన్నం పెట్టించారు. అయినా భీముడు చెక్కు చెదరలేదు. కృపాచార్యుల దగ్గర అంతా కలసి విద్య అభ్యసిస్తున్నారు.

ఇది ఇట్లావుండగా ద్రోణుడు తన సహాధ్యాయిఅయిన ద్రుపదుడిచేత అవమానింపబడి హస్తినాపురానికివచ్చి కురుకుమారులకు గురువయ్యాడు. విద్యాభ్యాసంలో అర్జునుని నేర్పుచూసి మురిసిపోయాడు. అర్జునుని మించిన విలుకాడులేడనేటట్లు విద్య నేర్పుతానన్నాడు. ఈప్రతిజ్ఞా నిర్వహణకోసమే ఏకలవ్యుని బొటనవ్రేలు తీసుకున్నాడు గురుదక్షిణగా. ఒకనాడు ఒకమొసలి ద్రోణుని తొడపట్టుకుంది. దాన్ని విలువిద్యానైపుణ్యంతో అర్జునుడు సంహరించాడు. దానితో ద్రోణుడికి చాలాసంతోషం కలిగి ఎన్నో అస్త్రాలుపదేశించాడు అర్జునుడికి. ఈ అర్జునుడు ద్రుపదుణ్ణిగెల్చి తీసుకు రాగలడనే ధీమాఏర్పడింది ద్రోణుడికి.

కుమారాస్త్ర విద్యాప్రదర్శనం ఏర్పాటుచేశాడు ద్రోణుడు. కురుకుమారులంతా తమతమ విద్యల్ని ప్రదర్శిస్తున్నారు. అర్జునుడు ప్రదర్శించిన విద్యల్ని ప్రశంసించాడు ద్రోణుడు. తానూ ఆవిద్యలు ప్రదర్శిస్తానని కర్ణుడు ముందుకు వచ్చాడు. నీవు రాజకుమారుడవా అనే ప్రశ్న ఉత్పన్నంఅయింది. వెంటనే దుర్యోధనుడు కర్ణుణ్ణి అంగరాజ్యాభిషిక్తుణ్ణిచేసి కర్ణుని గౌరవం కాపాడాడు. తర్వాత గురుదక్షిణగా అర్జునుడు ద్రుపదుణ్ణి కట్టితెచ్చి ద్రోణునిముందు పెట్టాడు. ద్రోణుడు ద్రుపదుణ్ణి పరాభవించాడు. అర్జునునికి ద్రోణుడు బ్రహ్మశిరోనామకాస్త్రం ఇచ్చాడు. తర్వాత ధృతరాష్ట్రుడు ధర్మరాజును యౌవరాజ్యాభిషిక్తుణ్ణి చేశాడు. ఇది సహించలేక దుర్యోధనుడు శకునితోనూ, అతనిమంత్రి కణికునితోనూ ఆలోచించాడు. కణికుడు దుర్యో

ధనుని కనుకూలంగా ఎన్నోనీతులు చెప్పాడు. దుర్యోధనుడు తనదుఃఖాన్నీ, అసహానాన్నీ తండ్రితో చెప్పాడు. పాండవులను వారణావతం పంపమన్నాడు. ధృతరాష్ట్రు డక్షరాలా ఆదేశించాడు పాండవుల్ని.

ముందుగానే వారణావతంలో లక్కయిల్లు నిర్మించమని దుర్యోధనుడు పురోచనుణ్ణి పంపాడు. వారణావతానికి బయలుదేరారు పాండవులు. విదురుడు వ్యంగ్యంగా హితోపదేశంచేస్తాడు. ధర్మరాజు గ్రహిస్తాడు. కుంతితోసహా పాండవులు వారణావతంచేరారు. లక్కయింట్లో ప్రవేశించారు. విదురుడు పంపిన ఖనకుడు లక్కయింట్లోంచి సొరంగం త్రవ్వాడు. కృష్ణచతుర్దశినాడు కుంతి దేవపూజచేసి అన్నదానం చేసింది. ఒక బోయవనిత ఆరోజునవచ్చి వీరిపంచనే పడుకున్నది. పురోచనుడు ఆదేరోజు రాత్రి లక్కయింటికి నిప్పుపెడతాడు. విషయంతెలిసింది పాండవులకు. సోదరుల్నీ తల్లిని బిలంలోకి చేర్చాడు భీముడు. పురోచనుడికంటె ముందుగానే భీముడు పురోచనుడు నిద్రిస్తున్న గదికి నలువైపులా నిప్పుపెట్టి బిలంలోకి చేరాడు. బిలంనుండి ఎక్కడో అడవిలో బయటపడ్డారు పాండవులు. పాండవులంతా కుంతితో సహా దగ్ధమయిపోయారనుకున్నారు ప్రజలంతా. ఈ విషయంతెలిసి ధృతరాష్ట్రుడు ఆవరించినట్లు ఏడ్చాడు. వానితో విదురుడూ ఎడ్చినట్లు నటించాడు

పాండవులక్కడ గంగానది దాటారు. అందరికీ దాహంవేసింది. అందరినీ ఒక మర్రిచెట్టు నీడనుదింపి భీముడు దగ్గరలోఉన్న కొలనుకో తానుత్రాగి సోదరులకు తామరదొప్పల్లో నీళ్ళుతెచ్చాడు. భీముడు వచ్చేటప్పటికి అంతా అలసిపోయి నిద్ర పోతున్నారు. ఇంతలో అక్కడికి హిడింబ వచ్చింది. భీముణ్ణిచూచి మోహించింది. తన అన్నవిషయం చెప్పింది ఇంతలో హిడింబుడు రానేవచ్చాడు. హిడింబుణ్ణి దూరంగా తీసుకుపోయి చంపివేశాడు భీముడు. తర్వాత భీముడు కుంతిమాటమేరకు హిడింబను చేపట్టాడు. ఘటోత్కచుణ్ణి కన్నది హిడింబ సద్యోగర్భంలో. పాండవులు తలచినప్పుడు వస్తానని ఘటోత్కచుడు వెళ్ళిపోయాడు.

పాండవులు ఏకచక్రపురం చేరారు. ఒక బ్రాహ్మణుని యింట్లో బ్రాహ్మణ వేషంలో కాలక్షేపం చేస్తున్నారు. ఆ వూళ్ళో బకుడనే రాక్షసుడున్నాడు. వాడికి రోజుకు ఒక బండెడు అన్నమూ, రెండు దున్నపోతులూ, ఒక మనిషి ఆహారంగా పంపుతూ ఉంటారు. ఆ వూరి వాళ్ళు వంతులు వేసుకొని. ఒక రోజు వంతు పాండవులున్న యింటి బ్రాహ్మణునికి వచ్చింది ఇంటి వారంతా గోలు గోలున

విలపిస్తున్నారు. విషయం తెలిసి భీముని సంప్రదించి కుంతి బ్రాహ్మణుణ్ణి ఓదార్చి తన కొడుకును పంపుతానంది. ఆ బ్రాహ్మణుడు కాదన్నా బలవంతాన ఒప్పించింది. భీముడువెళ్ళి బకాసురుణ్ణి సంహరించాడు. ఊరివారి బాధ మాన్పాడు. ఊరి ప్రజలంతా ఎంతో సంతోషించారు.

ఒకరోజున పాండవులున్న విప్రునియింటికి ఒక బ్రాహ్మణుడు వచ్చాడు. పాంచాలదేశపురాజు ద్రుపదుణ్ణి గూర్చి చెప్పాడు. "ద్రోణునిచేత మరల పరాభవింప బడ్డ ద్రుపదుడు ద్రోణుణ్ణి సంహరింపగల కొడుకునూ, అర్జునుణ్ణి చేపట్టగల కూతుర్ని కన్నాడు. ఆమెపేరు కృష్ణ. ఆమెకు ఇపుడు స్వయంవరం జరుగుతోంది — నేను వెడుతున్నాను" అని చెప్పాడు — కుతూహలులైన పాండవులూ బయలుదేరారు ద్రౌపదీ స్వయంవరానికి — మధ్యలో వ్యాసమహర్షి కనబడ్డాడు. ద్రౌపది పూర్వజన్మను చెప్పి, ఆమెకు అయిదుగురు భర్తలు అవుతారని, పాండవులను ద్రుపదపురానికి వెళ్ళమని "శుభంభూయాత్" అని వెళ్ళాడు. పాండవులు గంగానదీ తీరాన అంగార పర్ణుని చూచారు. అర్జునుడు అంగారపర్ణునితో యుద్ధంచేసి జయించాడు. తర్వాత అంగారపర్ణుడు అర్జునునితో స్నేహంచేశాడు. తపతీసంవరణోపాఖ్యానం చెప్పి వసిష్ఠుని మహిమ ఎటువంటిదో విశ్వామిత్ర చరిత్రతో సహా చెప్పాడు. అంగారపర్ణుని సలహా ననుసరించి ధౌమ్యుని పురోహితుని గావించారు పాండవులు-ద్రుపదపురానికి వెళ్లే పాండవులకు మళ్ళీ కనపడ్డాడు వ్యాసుడు. జరుగబోయే శుభాన్ని సూచించి వెళ్ళాడు—బ్రాహ్మణవేషంలో ద్రౌపదీస్వయంవరసభకు వెళ్ళారు పాండవులు- సభలో ధృష్టద్యుమ్నుడు మత్స్యయంత్రాన్ని కొట్టిన వారికి ద్రౌపదినిచ్చి వివాహం చేస్తామని చెప్పాడు — కృష్ణుడు బ్రాహ్మణవేషంలోని పాండవులను గుర్తుపట్టాడు. రాజకుమారులు మత్స్యయంత్రాన్ని కొట్టలేక భంగపడ్డారు - బ్రాహ్మణవేషంలో అర్జునుడు అవలీలగా కొట్టి ద్రౌపదిని గ్రహించాడు — ద్రౌపదిని తీసుకువచ్చి తల్లికి — భిక్షతెచ్చామని - నివేదించాడు. "అయిదుగురూ ఉపయోగించండి" అంది కుంతి. రామకృష్ణులు పాండవులను చూడవచ్చారు - పాండవులంతా ద్రుపదమందిరానికి వెళ్ళారు -"మేము అయిదుగురమూ చేసుకుంటాము కృష్ణను" అన్నాడు ధర్మరాజు - ద్రుపదునికి ధర్మ సందేహం ఏర్పడింది - సమయానికి వ్యాసుడు వచ్చాడు - ద్రౌపది యొక్క పూర్వ జన్మ వృత్తాంతం చెప్పి ద్రుపదుణ్ణి ఒప్పించాడు - పాండవులందరూ ద్రౌపదిని వివాహం చేసుకున్నారు —

పాండవులు ద్రౌపదిని వివాహంచేసుకుని ద్రుపదపురంలో ఒక సంవత్సరం పాటు ఉన్నారు. ఈవిషయం చారులవల్ల దుర్యోధనుడికి తెలిసింది. దుర్యోధనుడు పాండవుల అభ్యుదయానికి అసూయ చెందాడు ధృతరాష్ట్రుని దగ్గరకుచేరి కర్ణ దుర్యోధనులు పాండవులకూ, పాంచాలురకూ భేదం పెట్టాలని ఆలోచించారు. ధృత రాష్ట్రుడుకూడ మనసు విప్పిచెప్పి వంతపాడాడు - అయినా భీష్మాదులతో ఆలోచించు దాం అని వాళ్ళను పిలిపించాడు - భీష్ముడు "నాకు మీరన్నా వారన్నా సమానమే" అన్నాడు — ద్రోణుడూ అంతే అన్నాడు - విదురుడు"లాక్షాగృహ దహన కళంకం" పోవాలంటే పాండవులను వెంటనే యిక్కడకు రప్పించి ఆదరించమన్నాడు - సరే అని ధృతరాష్ట్రుడు పాండవులకు అర్ధరాజ్యం ఇస్తానని అందరి ఎదుటా నిశ్చయించి విదురుణ్ణి ద్రుపదుపురానికి పంపి పాండవులను రప్పించాడు. సమయానికి అక్కడే ఉన్న కృష్ణుడుకూడ వచ్చాడు పాండవులతో హస్తినకు - అందరి ఎదుట ధృత రాష్ట్రుడు ధర్మరాజుకు అర్ధ రాజ్యం యిచ్చి అభిషిక్తుణ్ణి చేశాడు. ఖాండవ ప్రస్థానికి వెళ్ళి అక్కడ ఉండండి అని పంపించాడు పాండవులను. కృష్ణుని ఆదేశంతో అక్కడ విశ్వకర్మ యింద్రప్రస్థపురాన్ని నిర్మించాడు. ఒక శుభముహూర్తంలో పాండవులు నగర ప్రవేశం చేసి సుఖంగా పరిపాలిస్తున్నారు. ఒకనాడు నారదుడు వచ్చి సుందోప సుందుల కథచెప్పి - స్త్రీ విషయంలో ఒక నియమం పాటించాలని హితవు చెప్పాడు- అతని హితవు ప్రకారం ద్రౌపది ఒక్కొక్కరి యింట ఒక్కొక్క ఏడు ఉండేటట్లు నియమం చేసుకున్నారు - ఆమె ఉన్న యింటికి యితరులు వెళ్ళరాదనీ అట్లా ఎవరు వెడితే వారు ఒక సంవత్సరం తీర్థసేవ చెయ్యాలనీ ప్రతిజ్ఞ పూనారు.

ఇట్లా ఉండగా ఒకసారి ఒకవిప్రుని హోమధేనువును రక్షించడంకోసం తన ధనుస్సు తీసుకునేందుకు అర్జునుడు ధర్మరాజు ఆయుధాగారాన్ని ప్రవేశించాడు - ధనుస్సు తీసుకుని విప్రుని హోమధేనువును రక్షించి తిరిగి వచ్చి సమయం తప్పి నందుకు తీర్థయాత్రలకై బయలుదేరాడు - ధర్మరాజు వారించినా కాదని బలవంతాన అతని అనుమతి పొందాడు అర్జునుడు. అనుచరులతో కదిలాడు. ముందుగా గంగలో మునిగాడు - ఒక నాగకన్య అర్జునుని మోహించి నాగలోకానికి తీసుకుపోయింది. తన కోరిక తీర్చమని అర్థించింది - శరణాగత రక్షకుడు అర్జునుడు ఆమె మనోరథాన్ని తీర్చాడు. సద్యోగర్భంలో ఇరావంతుడు పుట్టాడు - మర్నాడుదయానికి మళ్ళీ గంగలో తేలాడు అర్జునుడు - ఎన్నో యాత్రలుచేసి సంవత్సరం గడిపాడు - పద మూడో నెలలో మణిపూర పురానికి వెళ్ళి చిత్రాంగదను వివాహమాడాడు - బభ్రు

వాహనుణ్ణి కన్నాడు - చిత్రాంగద తండ్రి మలయధ్వజునికి కుమారునిగా సమర్పించాడు - తర్వాత ప్రభాస తీర్థానికి వెళ్ళాడు - అక్కడికి ద్వారక దగ్గర అని విని ఒక్కసారి కృష్ణుణ్ణి తలుచుకున్నాడు అర్జునుడు - ఎదురుగాసింహ్హా నిలిచాడు కృష్ణుడు - యతి వేషం వేయించి రైవతక పర్వతంమీద ఉంచాడు అర్జునుణ్ణి - కృష్ణుడు. రాత్రి తాను కూడా అక్కడే ఉండి అర్జునునితో సరదాగా కాలక్షేపం చేశాడు. మాదవులంతా ఉదయమే రైవతకాద్రికి ఉత్సవానికి చేరారు. అక్కడున్న యతికి పరిచర్య చేసేందుకు సుభద్రను వియోగించాడు బలరాముడు - సుభద్ర పరిచర్య చేస్తోంది అర్జునునకు - ఒకరి నొకరు తెలుసుకున్నారు - కృష్ణుని అనుమతితో అర్జునుడు సుభద్రను పరిగ్రహించి ఇంద్రప్రస్థపురానికి తీసుకు వచ్చాడు - అక్కడికి బలరామకృష్ణులు ఎన్నో కానుకలు పట్టుకువచ్చారు - కొన్నాళ్ళకు సుభద్రకు అభిమన్యుడు ఉద్భవించాడు - తర్వాత ద్రౌపదికి క్రమంగా అయిదుగురు ఉపపాండవులు పుట్టారు - (వారిపేర్లు : ప్రతివింధ్యుడు - శ్రుతసోముడు శ్రుతకీర్తి - శతానీకుడు - శ్రుతసేనుడు)

ఇట్లా ఉండగా ఒకవేసవిలో యమునానదీ సమీపంలో విహరిస్తున్న కృష్ణార్జునుల దగ్గరకు అగ్నిహోత్రుడు వచ్చాడు. శ్వేతకి అనే రాజర్షి చేసిన శత వార్షిక సత్రయాగంలో నిరంతరంగా పడ్డ ఆజ్యధారవల్ల తనకు అగ్నిమాంద్యం ఏర్పడిందనీ, అందుచేత దివ్యౌషధ యుక్తంఅయిన ఖాండవవనాన్ని దహించాలి అని అన్నాడు అగ్ని. మీరు చేయవలసిందల్లా దాన్ని యింద్రుడినుండి రక్షించాలి. నేను దాన్ని దహిస్తుంటే అన్నాడు అగ్ని. సరే అన్నారు కృష్ణార్జునులు. అప్పుడే అగ్నిహోత్రుడు అర్జునుడికి గాండీవమూ, అక్షయ తూణీరమూ ఇచ్చాడు కృష్ణుడికి సుదర్శనచక్రమూ కౌమోదకి అనే గదనూ ఇచ్చాడు కృష్ణార్జునులు ఇంద్రునికూడ జయించి అగ్నికోరిక తీర్చారు.

ఖాండవవనంలో రక్షింపబడ్డ మయుడు కృష్ణార్జునులతో ఇంద్రప్రస్థానికి వచ్చాడు. ఆ విశ్వకర్మచేత ఒక చిత్రమయిన సభ నిర్మింపజేశాడు కృష్ణుడు. అతని వల్లనే భీమునికి గద, అర్జునునకు దేవదత్తం అనేశంఖం లభించాయి. ఒకమంచి ముహూర్తంలో ధర్మరాజు సభాప్రవేశం జేశాడు. అదే మయసభ- ఒకనాడు నారదుడు వచ్చి ధర్మరాజునకు కుశలప్రశ్నపూర్వకంగా ఎన్నో రాజనీతులు చెప్పాడు. ఈ మయసభ చాలా గొప్పదనీ- ఇంద్ర, యమ, వరుణ, కుబేర, బ్రహ్మల సభలకంటె గొప్పదనీ- వాటిని వర్ణించి చెప్పాడు. తాను స్వర్గాన్నుంచి వస్తున్నాననీ పాండురాజు తనతో ఒకవిషయం చెప్పాడనీ- రాజసూయం చెయ్యమని ధర్మరాజును ప్రబోధించ

మన్నట్లుగా చెప్పాడనీ- అందుచేత పితృతృప్తికోసం రాజసూయం చెయ్యమని ధర్మరాజును ప్రోత్సహించి వెళ్లాడు నారదుడు. వెంటనే కృష్ణుణ్ణి రావించి ధర్మరాజు రాజసూయంగురించి అడిగాడు- కృష్ణుడుకూడ ప్రోత్సహించాడు- కాని జరాసంధుని ముందుగా వధించాలన్నాడు. కృష్ణుడు జరాసంధుని చరిత్ర చెప్పాడు. బృహద్రథుని కొడుకు జరాసంధుడు. అతడు జరఅనే రాక్షసిచేత కలుపబడ్డాడు. అందుచేత జరాసంధుడయ్యాడనీ- అతడు రాజులందరినీ చెఱలోపెట్టి బలియివ్వనున్నాడనీ చెప్పాడు. భీమార్జునులను తీసుకుని కృష్ణుడు జరాసంధుని నగరానికి వెళ్ళాడు. తమలోఎవరితోనైనా యుద్ధం చేయమన్నాడు కృష్ణుడు జరాసంధునితో- జరాసంధుడు భీముణ్ణి కోరుకున్నాడు. కృష్ణుని సలహాతో భీముడు జరాసంధుణ్ణి ఎడమొగం పెడమొగంగా చీల్చి పారవేసి సంహరించాడు. తర్వాత ఆ రాజ్యానికి జరాసంధుని కొడుకును సహదేవుణ్ణి పట్టాభిషిక్తుణ్ణిచేసి వచ్చారు. వచ్చాక భీముడు తూర్పుదిక్కూ, అర్జునుడు ఉత్తరదిక్కూ, నకులుడు పశ్చిమదిక్కూ, సహదేవుడు దక్షిణదిక్కూ వెళ్ళి జయించి, ధన, కనక, రత్నరాసులు తెచ్చి ధర్మరాజుకిచ్చారు. సర్వదిక్కుల రాజులూ పాండవులకు పాదాక్రాంతులయ్యారు. రాజసూయం ప్రారంభంకాబోతుంది. భీష్మ, ద్రోణ, ధృతరాష్ట్ర, దుర్యోధనాదులంతా వచ్చారు. వారందరి అనుమతితో ధర్మజుడు యజ్ఞగృహం ప్రవేశించాడు, వ్యాసాదిమహర్షి పురస్సరంగా—

ధర్మరాజు రాజసూయం యథావిధిగా చేస్తున్నాడు. చివరలో సద్గుణుడయిన వానిని పూజించాలి. కృష్ణుణ్ణి పూజించు అని ఆదేశించాడు భీష్ముడు. కృష్ణుని పూజించడానికి సిద్ధపడుతున్న ధర్మరాజును శిశుపాలుడు అధిక్షేపించాడు. కృష్ణుణ్ణీ, భీష్ముణ్ణీ నిందించాడు. పైగా సభలోంచి లేచి వెళ్ళిపోయాడు. అతణ్ణి బ్రతిమాలటానికి ధర్మరాజు బయలుదేరాడు. భీష్ముడు ధర్మరాజును వారించాడు. శిశుపాలుడు రాజుల్ని ప్రోగుచేసి దండెత్తమన్నాడు. యజ్ఞానికి విఘ్నంకలుగుతుందేమో అని ధర్మరాజునకు భయంవేసింది. ఆ భయంలేదు నీకు కృష్ణుడుండగా అన్నారు భీష్ముడు. శిశుపాలుని పూర్వచరిత్ర చెప్పాడు. శిశుపాలుని పారుష్యవచనాలకు కోపించి కృష్ణుడు అతణ్ణి చక్రంతో సంహరించాడు.

రాజసూయం అయ్యాక అంతా తమతమ దేశాలకు వెళ్ళిపోయారు. కాని శకునీ, దుర్యోధనుడూ మయసభావిశేషాలు చూడాలని కొన్నాళ్లు ఉన్నారు. దుర్యోధనుడు మయసభచూస్తూ సమస్థలం అనుకుని సరస్సులోపడ్డాడు. పాంచాలీ,పాండవులూ నవ్వారు. భీముడిచేత ధర్మరాజు దుర్యోధనుడికి నూతనవస్త్రాలూ, అలంకారాలూ

పంపాడు. దుర్యోధనుడు చాలా అభిమానపడ్డాడు. ధర్మరాజు వైభవానికి అసూయ పడ్డాడు.

హస్తినకు వెళ్లి పాండవలక్ష్మిని అపహరించేందుకు ఆలోచనచేశాడు శకునితో. శకుని దుర్యోధనుడితో ధృతరాష్ట్రుడి దగ్గరకువెళ్లి విషయం నివేదించాడు. సపత్నులయిన పాండవుల లక్ష్మిని చూచి నేను సహించలేకున్నా నన్నాడు దుర్యోధనుడు. అపుడు శకుని మాయాజూదంతో ధర్మరాజు సిరిఅంతా అపహరించి నీకిస్తా నన్నాడు. విదురుడితో ఆలోచిద్దాం అన్నాడు ధృతరాష్ట్రుడు. విదురుడు జూదం మంచిదికాదు పనికిరాదు అన్నాడు. "పన్నాకేమ— నీవువెళ్లి ధర్మరాజునూ తమ్ముళ్ళనూ పిల్చుకురా — మనంకట్టిన నూతనమయిన మణిమయసభకూడా చూస్తారు పాండవులు—అన్నాడు ధృతరాష్ట్రుడు - విదురుడు వెళ్ళి ధర్మరాజునూ తమ్ముళ్ళనూ ద్రౌపదినీ తోడ్కొనివచ్చాడు. మర్నాడు దుర్యోధనుడు ధర్మరాజునకు మణిమయసభ చూపించాడు. ధర్మరాజు చాలా సంతోషించాడు. ఆ సభలో ఆసీనుడయిన ధర్మరాజుతో కాలక్షేపంకోసం సరదాగ సుహృద్ద్యూతం ఆడదాం అన్నాడు దుర్యోధనుడు. బలవంతాన సరే అన్నాడు ధర్మరాజు. నాబదులు మా మామ శకుని ఆడతాడు నీతో అన్నాడు దుర్యోధనుడు. జూదం మొదలయింది. ధర్మరాజు ఒక్కొక్కటీ ఓడిపోతున్నాడు. జూదం ఆపమని విదురుడు ధృతరాష్ట్రుడితో ఎంతగానో చెప్పాడు. పుత్రస్నేహంతో ధృతరాష్ట్రుడు వినిపించుకోలేదు. అప్పుడు విదురుడే దుర్యోధనుడితో "జూదం ఆడవద్దనీ, నిన్ను ప్రజలు 'ఛీ' అంటారనీ" అన్నాడు. "నీవు నాకు బుద్ధిచెప్ప నవసరంలేదు. నోరుమూసుకో" అన్నాడు దుర్యోధనుడు. ఇంతలో శకుని "ధర్మరాజా నీసంపద అంతా ఓడిపోయావు" అన్నాడు. క్రమంగా తన్నూ, తమ్ముళ్ళనూ, ద్రౌపదినీ ఓడిపోయాడు ధర్మరాజు. సభలో కలకలం ఏర్పడింది. "ఏమిటీ సంక్షోభం" అని అడిగాడు ధృతరాష్ట్రుడు— విషయం చెప్పాడు విదురుడు. దుర్యోధనుడు ప్రాతికామిని పంపి ద్రౌపదిని సభకు తీసుకురమ్మన్నాడు. వాడువెళ్ళి ద్రౌపదితో చెప్పాడు. ఆమె "ధర్మరాజు నన్నోడి తన్నోడెనా ? లేక తన్నోడి నన్నోడెనా" అని అడిగింది. ఆమాట పట్టుకు సభకు వచ్చాడు ప్రాతికామి. ధర్మరాజు మాట్లాడలేదు— ఆమెనిక్కడకు తీసుకురా— ఇక్కడే తీరుతుంది ఆమె సందేహం" అన్నాడు దుర్యోధనుడు— ప్రాతికామివెళ్ళి మీ సందేహం తీర్చేందుకు సభ్యులు సభకు రమన్నాడన్నాడు. ద్రౌపది విలపిస్తూ వచ్చి ధృతరాష్ట్రుడి దగ్గర నిలబడింది. దుర్యోధనుడు దుశ్శాసనుణ్ణిపిలిచి ద్రౌపదిని సభామధ్యానికి తీసుకురా అన్నాడు. భయపడి ద్రౌపది గాంధారిప్రక్కకు చేరింది, దుశ్శాసనుడు వెంటబడ్డాడు. 'నన్ను

ముట్టకు నేను ఏకవస్త్రను అంది ద్రౌపది. నువ్వు ఏకవస్త్రవయినాసరే విగతవస్త్ర వయినా సరేఅని కేశపాశంపట్టి సభామధ్యానికి లాగుకొనివచ్చాడు దుశ్శాసనుడు— జరుగుతున్న అన్యాయాన్ని సహింపలేకపోయాడు వికర్ణుడు. (దుర్యోధనుని తమ్ముడు) ఆమె అధర్మవిజితఅని ఖండితంగా చెప్పాడు. కర్ణుడు కల్పించుకొని "నీకేం తెలుసు కుర్రవాడవు—ఈమె ఏకవస్త్రఅయినా విగతవస్త్రఅయినా దోషంలేదు. "ఆమెదాసి" అన్నాడు. దుర్యోధనుడు వెంటనే ద్రౌపది వలువ ఒలవమని ఆదేశించాడు దుశ్శాసనుణ్ణి— పాండవులు పరాజితులు కావడంచేత ఊరుకోక తప్పలేదు — దుశ్శాసనుడు దుష్కృత్యానికి పాల్పడ్డాడు. ద్రౌపది కృష్ణుణ్ణి తలచింది—ఒలిచినకొలదీ వలువలు వస్తున్నాయి ద్రౌపది శరీరంమీదకి—భీముడు రౌద్రాకారంతో దుశ్శాసనుడి రక్తం త్రాగుతానని దారుణ ప్రతిజ్ఞచేశాడు—ద్రౌపది "నేను దాసినా ?" అని అడిగింది— ఎవరూ సమాధానం చెప్పలేకపోయారు సభలో—భీష్ముడు "దీని సమాధానం ధర్మరాజుకే తెలియాలి. అతడే మౌనంవహిస్తే ఇంకెవరికీ తెలియ"దన్నాడు. అప్పుడు దుర్యోధనుడు ద్రౌపదిని తనతొడమీద కూర్చోమని సైగచేశాడు—"సంగ్రామంలో ఆతొడలే విరుగగొట్టి దుర్యోధనుణ్ణి చంపుతాను" అని భీముడు ప్రతిజ్ఞచేశాడు. భీష్మాదులు భీముని శాంతింపజేశారు.

అపుడు ధృతరాష్ట్రుడు దుర్యోధనుణ్ణి నిందించి ద్రౌపదిని రావించి నీకేం కావాలో కోరుకొమ్మన్నాడు - ఆమె ధర్మరాజును దాస్యంనుండి విడిపించమంది - ఇంకోవరం కోరుకొమ్మన్నాడు మామ - ధర్మరాజు తమ్ముళ్ళు నలుగురూ దాస్యం నుండి విముక్తి పొందాలంది. మరొకవరం కోరుకొమ్మన్నాడు మామ - నేనుక్షత్రియ వనితను - నాకు అర్హతలేదు రెండువరాలు మించికోరడానికి - నేను కోరను" అంది ద్రౌపది - ఆమె ధర్మజ్ఞతకు సంతసించి, ధర్మరాజుకు యథాపూర్వంగా రాజ్యం తిరిగి యిచ్చి ఇంద్రప్రస్థానికి పంపాడు ధృతరాష్ట్రుడు -

"ఈనగాచి నక్కలపాలు చేశావని" తండ్రిని మళ్ళీ నిర్బంధించాడు దుర్యోధనుడు- పుత్రవ్యామోహంతో అనుద్యూతానికి అంగీకరించాడు ధృతరాష్ట్రుడు- ప్రాతికామిని పంపి ధర్మజాదులను మళ్ళీ అనుద్యూతానికి రప్పించాడు. ఈ సారి పందెం మార్చారు - ఓడిపోయిన వారు 12 ఏండ్లు అరణ్యవాసం; ఒక ఏడు అజ్ఞాతవాసం చెయ్యాలి — అని — పాండవులు ఓడి పోయారు — అరణ్యాల పాలయ్యారు-

అరణ్యవాసానికి వెడుతున్న పాండవులతో కొంతమంది ప్రజలూ, విప్రులూ వస్తామన్నారు — వీరినెట్లా ఆదరించదగ్గమా అని ధర్మరాజు దుఃఖంతో

మూర్ఛితు డయ్యాడు. అతణ్ణి ఆశ్వాసించి శౌనకుడనే బ్రహ్మర్షి యుధిష్ఠిరుడికి జనక గీతలు చెప్పాడు — తరువాత ధౌమ్యుని సలహా మేరకు సూర్యుణ్ణి ఆరాధించి ధర్మరాజు (తామ్రస్థాలి) అక్షయపాత్ర పొందాడు. అందరినీ షడ్రసోపేత భోజనంతో అలరిస్తు న్నాడు. అక్కడ విదురుడు ధృతరాష్ట్రుడి దగ్గర చేరి దుర్యోధనుని దుశ్చేష్టలన్నీ చెప్పి నిందిస్తున్నాడు. దాన్ని సహించలేక ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పాండవుల దగ్గ రకు పొమ్మన్నాడు. "బాగుంది" అనుకుని విదురుడు పాండవుల దగ్గరకు వచ్చేశాడు. కాని మళ్ళీ అక్కడ ధృతరాష్ట్రుడికి తోచలేదు విదురుడు లేకపోతే — సంజయుణ్ణి పంపి విదురుణ్ణి రప్పించుకున్నాడు — ఇట్లుండగా ఒకసారి దుర్యోధనుడు అరణ్య వాసంతో బలహీనులయ్యారనుకొని పాండవులమీదికి దండెత్తటానికి సన్నద్ధు డయ్యాడు. వ్యాసుడువచ్చి ఆప్రయత్నంనుండి వారించి ధృతరాష్ట్రుడికి కూడ బుద్ధి చెప్పాడు. ధర్మరాజుదగ్గర ఉండేటట్లు దుర్యోధనుణ్ణిపంపు కాస్త బాగుపడతాడు" అన్నాడు వ్యాసుడు — "నామాటలు నాకొడుకు వినడు" అన్నాడు ధృతరాష్ట్రుడు — మైత్రేయుణ్ణి ధర్మానుశాసనానికి నియోగించి వ్యాసుడు వెళ్ళిపోయాడు — మైత్రేయుడు చెప్పే ధర్మాలు సరిగా వినక అవినయంతో ప్రవర్తించాడు దుర్యోధనుడు — తొడలు విరిగి చస్తావని దుర్యోధనుణ్ణి శపించి వెళ్ళాడు మైత్రేయుడు -

అక్కడ భీముడు కిమ్మీరుణ్ణి వధించాడు - పాండవులు కామ్యకవనంలో ఉన్నారు - అక్కడకు యాదవులూ పాంచాలురూ వచ్చారు - ద్రౌపదీదేవి తన పరా భవాన్ని కృష్ణుడితో చెప్పుకుంది - కృష్ణుడామెను ఓదార్చాడు. ద్రౌపదీ పరాభవసమ యంలో తాను సౌంభకునితో యుద్ధంలో ఉన్నానని ఆ విశేషాలు చెప్పాడు - తర్వాత సుభద్రాభిమన్యుల్ని ద్వారకకు తీసుకువెళ్ళాడు - ధృష్టద్యుమ్నుడు ఉపపాండవుల్ని తీసుకుని ద్రుపదపురానికి వెళ్ళాడు - పాండవులు ద్వైతవనం చేరారు. అక్కడకు మార్కండేయమహర్షి వచ్చి పాండవులను ఆశీర్వదించి వెళ్ళాడు. ఎల్లప్పుడూ క్షమ పనికిరాదని ద్రౌపదీ, భీముడూ ధర్మరాజుతో వాదిస్తారు - ధర్మరాజు తగిన సమా ధానం చెపుతాడు. ఒకనాడు వ్యాసుడు వచ్చి ధర్మరాజుకు ప్రతి స్మృతి అనే విద్య ఉపదేశించి అర్జునుని పాశుపతాస్త్ర సంపాదనకు ప్రేరేపించి వెడతాడు - అర్జునుడు ధర్మరాజుదగ్గర ప్రతి స్మృతి గ్రహించి దీక్షవహించి ఈశ్వరుని గురితచి తపస్సు చేయటానికి వెళ్ళాడు - ఘోరతపస్సు చేస్తున్నాడు అర్జునుడు - శివుడు అర్జునుని పరీక్షించాలనుకున్నాడు — మూకాసురుని నిమిత్తంగా కిరాతవేషంలో వచ్చి అర్జును డితో యుద్ధంచేశాడు ఈశ్వరుడు — తన మహిమతో ఈశ్వరుడు అర్జునుని అక్షయ

తూణీరాన్ని ఖాళీ చేశాడు - గాండీవంకూడా అపహరించాడు — అయినా జంకలేదు నరుడు — వృక్షాలతో రాళ్ళతో కొట్టాడు నరుడు — తర్వాత మల్లయుద్ధంలో ఈశ్వరుని పీడించాడు. అర్జునుడు ఈశ్వరుణ్ణి స్తుతించాడు — ఈశ్వరుడు పాశుపతాస్త్రాన్ని ప్రసాదించాడు — తర్వాత యింద్రుడు వచ్చి అర్జునుడికి దివ్యదృష్టి యిచ్చి పూర్వం అతడు నరుడనే ఋషి అని చూపిస్తాడు — కర్ణాదులను సంహరిస్తావని చెబుతాడు. యమ, వరుణ, కుబేరాదులు దివ్యాస్త్రాలు ఇచ్చారు — ఇంద్రుడు అర్జునుణ్ణి అమరావతికి రమ్మని ఆహ్వానించాడు — అక్కడ ఇంద్రుడు అర్జునుడికి అర్ధాసనం ఇచ్చి గౌరవించి ఎన్నో దివ్యాస్త్రాలు ఇచ్చాడు—అర్జునుని అందం చూసి ఊర్వశి మోహించింది. అర్జునుడు 'తల్లివని' తిరస్కరించాడు —ఆమె అర్జునుణ్ణి నపుంసకుడుగా శపించింది — ఇంద్రుడు వచ్చి "అది వరమే — రాబోయే అజ్ఞాతవాసంలో ఉపయోగపడుతుం"దని చెప్పాడు.

ఒకరోజు ధర్మరాజు దగ్గరకు బృహదశ్వుడనే మహర్షి వచ్చాడు — ధర్మరాజు అతణ్ణి పూజించి "మావలె కష్టాలు పడినవారు పూర్వం ఎవరైనా ఉన్నారా?" అని అడిగాడు అతడు నలోపాఖ్యానం చెప్పాడు.

విదర్భరాజు భీమునికూతురు దమయంతి- ఆమె దేవతల్నికూడా కాదని నలుణ్ణి వివాహమాడింది స్వయంవరంలో— నలుడు కర్మవశాత్తు పుష్కరునితో జూదంఆడి రాజ్యఅంతా పోగొట్టుకున్నాడు — అడవులపాలయ్యాడు భార్యతో — ఒకచోట నిద్రిస్తున్నభార్యను విడిచి వెళ్ళిపోయాడు నలుడు. నలుని వెతుకుతూ దమయంతి అడవిలో తిరుగుతూ ఒక అజగరానికి పట్టుబడింది. ఒకబోయవాడు అజగరాన్నిచంపి ఆమెను విడిపించాడు. కాని దమయంతినిచూచి కామమోహితుడయ్యాడు. ఆమె అలిగి చూసింది. వెంటనే వాడు బూడిదయ్యాడు. ఆమె నలునికోసం వెదకివెదకి చివరకు చేదిదేశాధీశుడయిన సుబాహుని అంతఃపురంచేరింది.

నలుడు దమయంతిని విడిచి అడవిలో తిరుగుతూ కర్కోటకునిచేత కరవబడ్డాడు. దానితో నలునిరూపంకూడ మారిపోయింది. కర్కోటకుని సలహాతో నలుడు ఋతుపర్ణుణ్ణి చేరాడు. అక్కడ అశ్వాధ్యక్షుడయ్యాడు.

అక్కడ సుదేవుడనే బ్రాహ్మణుడు సుబాహుని అంతఃపురంలో దమయంతిని గుర్తుపట్టాడు. దమయంతి విదర్భకు చేరింది. నలుణ్ణి వెతికించింది. నలుడు ఋతుపర్ణుడి దగ్గర ఉన్నట్లు అనుమానించింది. దమయంతి ద్వితీయ స్వయంవరం

ప్రకటించినట్లు - నలుడికి తెలిసేటట్లుగా, మర్నాడే విదర్భలో స్వయంవరం అన్నట్లు- ఋతుపర్ణుడికి వార్త చేరింది. ఋతుపర్ణుడు నలుణ్ణి తీసుకు బయలుదేరాడు ఋతుపర్ణుడిదగ్గర నలుడు అక్షహృదయం గ్రహించాడు. వచ్చాక నలుణ్ణి గుర్తుపట్టింది దమయంతి - నలుడు ఋతుపర్ణునిదగ్గర గ్రహించిన అక్షహృదయ ప్రభావంతో పుష్కరుని గెలిచి రాజ్యం పొందాడు మళ్ళీ-

ఈ విధంగా నలోపాఖ్యానంచెప్పి వెళ్ళాడు బృహదశ్వుడు. నారదుడు వచ్చాడు. తీర్థసేవాఫలాన్ని గూర్చి అడిగాడు ధర్మరాజు నారదుణ్ణి - ఎన్నో తీర్థమాహాత్మ్యాలు చెప్పాడు-పులస్త్యమహర్షి భీష్మునికి చెప్పినట్లుగా - పుష్కరవిశేషాలు చెప్పాడు. రోమశుడు అనే దేవర్షి వస్తాడనీ వానితో తీర్థాలు సేవించమనీ చెప్పి వెళ్ళిపోయాడు నారదుడు. రోమశుడు రానేవచ్చాడు దేవలోకంనుంచి - అర్జునునివిశేషాలు చెప్పాడు - రోమశునితోసహా ధర్మరాజు తీర్థసేవకు బయలుదేరాడు - త్రోవలో అగస్త్యచరిత్ర చెప్పాడు. అతడు వాతాపిని చంపడం - లోపాముద్రను వివాహమాడటం చెప్పాడు.

అగస్త్యుడు వింధ్యపర్వత విజృంభణాన్ని అణచడం, సముద్రోదకాన్ని త్రాగివేయడం చెప్పాడు. ఆ సముద్రం మళ్ళీ భగీరథుడు నింపాడని భగీరథుని - సగరుని - చరిత్రచెప్పాడు. తరువాత రోమశుడు ధర్మరాజుకు ఋశ్యశృంగుని చరిత్ర, పరశురామునిచరిత్ర, చెప్పాడు. సుకన్యాచ్యవనుల వృత్తాంతం చెప్పాడు. మాంధాతృచరిత్ర - అట్లాగే సోమకుడనే రాజర్షిచరిత్ర, శిబిచక్రవర్తి చరిత్ర, అష్టావక్రునిచరిత్ర, యవక్రీతుని చరిత్ర మొ॥ చెప్పాడు. తర్వాత పాండవులు గంధమాదనమనే పర్వతందగ్గరకు చేరారు. అక్కడ ద్రౌపది నడవలేకపోయింది. భీముడు ఘటోత్కచుణ్ణి తలచాడు - వచ్చివాలాడు అతడు. ద్రౌపదినీ, పాండవులందరినీ మోసుకుని ఆకాశంలో ఎగిరాడు — నరనారాయణాశ్రమందగ్గర దిగారు. ఒకరోజున అక్కడ విహరిస్తున్న ద్రౌపదీ భీముల దగ్గర సౌగంధిక కమలం వచ్చిపడింది. దాన్ని చూచి ద్రౌపది ఆశ్చర్యచకితురాలయింది. దగ్గరలో ఇటువంటివి చాలా ఉండిఉంటాయి. తెచ్చియిమ్మంది భీముణ్ణి - భీముడు సౌగంధికకమలం కోసం బయలుదేరాడు. మధ్యలో హనుమంతుడు కనపడ్డాడు. దేవతలు భక్తిసాధ్యాలుకాని సాహససాధ్యాలు కారని బోధించాడు. హనుమంతుని ఆశీర్వాదంతో బయలుదేరి భీముడు యక్షులసరోవరాన్నుండి సౌగంధికాలు గ్రహించాడు — ఒకవనంలో విహరిస్తున్నాడు.

ఇక ఇక్కడ ధర్మరాజున్నచోట చాల అపశకునాలు కనపడుతున్నాయి. భీముడేడి ? 'అని ధర్మరాజు ద్రౌపదినడిగాడు. విషయం చెప్పింది ఆమె - రాక్షసుడయిన ఘటోత్కచుని సహాయంతో అందరూ భీముడు వెళ్లిన దిక్కుగా వెళ్లారు - భీముణ్ణి చూచారు. సమీపంలో నివాసం ఏర్పరచుకొన్నారు. ఘటోత్కచుణ్ణి "ఇక నీవు వెళ్లవచ్చు" అన్నారు. అతడు వెళ్ళిపోయాడు. తర్వాత పాండవులను జటాసురుడు బ్రాహ్మణవేషంలో చేరాడు. పాండవులకు సేవచేయడం మొదలుపెట్టాడు. ఒకరోజున భీముడులేని సమయంచూచి ధర్మరాజునూ, ద్రౌపదినీ, నకులుణ్ణీ ఎత్తుకుపోయాడు. సహదేవుడు అడ్డగించాడు అతణ్ణి - ఈలోగా విషయంతెలుసుకుని భీముడు వచ్చాడు. జటాసురుణ్ణి అవలీలగా సంహరించివేశాడు-

ధర్మరాజు తమ్ముళ్ళతో అర్జునుడికోసం ఎదురుచూస్తున్నాడు. ఇక్కడే ఎక్కడో ఉంటాడనుకొని మాల్యవంతంచేరారు అంతా - అక్కడ భీముడు కుబేర సఖుడయిన మణిమంతుణ్ణి సంహరించాడు· కుబేరుడు ప్రత్యక్షమయ్యాడు - మణిమంతుని వృత్తాంతం చెప్పాడు. పాండవులకు పరిచర్యచేసేందుకు తనపరిచారికలను నియమించాడు. ఆ సమయంలో అర్జునుడు వచ్చాడు. ఆ మర్నాడు ఇంద్రుడువచ్చాడు. ధర్మరాజాదులతో ఇంద్రుడు అర్జునుని పరాక్రమంచెప్పాడు. ఇంద్రుడువెళ్ళాక అర్జునుడు తాను నివాత కవచుణ్ణి, పౌలోమకాలకేయుల్ని చంపినరీతిని ధర్మరాజుకు చెప్పాడు-తనకు లభించిన దివ్యాస్త్రాలు సోదరులకు చూపాడు· అక్కడనుండి పాండవులు అంచెలంచెలుగా హిమవత్పర్వతం చేరారు — ఒకనాడు భీముణ్ణి ఒక అజగరం పట్టుకుంది. భీముణ్ణి వెతుక్కుంటూ ధర్మరాజు వచ్చాడక్కడికి - నీవెవరవు అని అడిగాడు. తాను నహుషుడనని పూర్వచరిత్ర చెప్పింది. తానువేసిన ప్రశ్నలకు సమాధానంచెపితే తమ్ముణ్ణి విడిచిపెడతానంది. ధర్మరాజు సముచితమైన సమాధానాలు చెప్పాడు. నహుషుడు ఎంతో ప్రీతిచెందాడు. నహుషునికి శాపవిముక్తి కలిగింది. తర్వాత నహుషుడివల్ల అధ్యాత్మ విద్యారహస్యాలు తెలుసుకున్నాడు ధర్మరాజు. వృకోదరుణ్ణి తీసుకొని తన ఆశ్రమానికి వచ్చాడు.

ఇంతలో వర్షాకాలంవచ్చింది. తరువాత శరదృతువు వచ్చింది.

ఆరణ్య — 4 వ ఆశ్వా — 142 ప.

ఇది నన్నయ భారత భాగకథ

విశ్వవ్యాప్త మయిన దీప్తినీ, తృప్తినీ పంచిన వ్యాసుని వాణి భారతీయు లకు వేదవాక్యమయి వెలసింది. వ్యాసుని ఇతరవాక్కులు వేదములాగే అయ్యాయి కాని భారతం మాత్రం వేదమే అయి నిలిచింది - పంచమవేదం అనే ప్రశస్తినీ, ప్రాచుర్యాన్నీ సంతరించుకుంది - లక్షశ్లోకాలలో మహాప్రపంచంలోనూ ఉద్గ్రంథం గానూ, బృహద్గ్రంథంగానూ వ్యాపించింది - భారతంలో లేని విషయం లేదు ఇందులో లేని విషయం మరెక్కడా ఉండదు (యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న కుత్రచిత్) అన్నంత ప్రసిద్ధి పొందింది భారతం సంస్కృతంలో.

వ్యాసుడు సమాహితమనస్కుడయి సమాజహితాన్ని అభిలషించి శ్రీమహా భారతం వ్రాశాడు - మానవుని సుఖజీవనానికీ, ఉత్తమగతికీ అవసర మయిన నీతు లనూ, ధర్మాలనూ భారతకథారూపంలో అందించాడు —

ఆ భారతాన్ని తెలుగువారికి విందులు చేశారు కవిత్రయం వారు- నన్నయ తిక్కన ఎఱ్ఱనలు - వీరు ముగ్గురూ తెలుగువారికి ప్రాతఃస్మరణీయులు - ఎన్నో భారతీయభాషల్లోకి శ్రీమహాభారతం అనువదింపబడింది - కాని కవిత్రయంవారి తెలుగుభారతానికి చేకూరిన ఘనత మరి దేనికీ దక్కలేదు - మూలానికి సమీపంగా ఉండి వ్యాసుని హృదయాన్ని పుణికిపుచ్చుకున్నట్లు ఉంది తెలుగుభారతం - వ్యాసుని భావాలను స్పష్టంగానూ, సమగ్రంగానూ, సుందరంగానూ వెలువరించిన ఖ్యాతీ, ప్రీతీ కవిత్రయంవారికే దక్కాయి,

ఆ కవిత్రయంలో తెలుగుభారతానికి శ్రీకారం చుట్టినవాడు నన్నయ. అవిరళజపహోమతత్పరు డయిన నన్నయ వ్యాసుని హృదయపు లోతులను దర్శించి తెలుగువారికి కనబరచాడు.

వ్యాసుడు సూరిచేతోరుచిరాబ్జబోధనరతు డని నన్నయచే కీర్తింపబడ్డాడు— పండితుని హృదయకమలాన్ని వికసింపజేసే సూర్యు డని అర్థం - ఇక్కడ పండితు డనగా మరెవరో కాదు. నన్నయ యే - ముఖ్యంగా - నన్నయ హృదయకమలం రుచిర మయింది - ఉజ్జ్వల మయింది - ఆ కమలానికి వికాసం ఇచ్చాడు వ్యాసుడు— అనగా జపహోమతత్పర మయి అంతర్ముఖ మయిన ఆ నన్నయ చేతోరుచిరాబ్జానికి వికాసం కల్పించి - బహిర్ముఖంచేసి తెలుగునేల సుకృతాన్ని పండించాడు వ్యాసుడు— కృత మెఱిగిన పుణ్యుడు నన్నయ - అగ్గలంగా సత్కృతి చేశాడు. వ్యాసుని అమృతవాక్కు లయిన సూక్తులకు రుచిర మయిన అర్థాన్ని జోడించాడు - రుచిరార్థ

సూక్తులు చేసి సదా ఆదరణీయాలుగా చేశాడు — కావుననే నన్నయ "నానారుచిరార్థ సూక్తినిధి" కాగలిగాడు —

సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తి నిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్ —

ఆంధ్రమహాభారతం అవతారికలో ఆదికవి నన్నయ తన కావ్యంలోని విశేషాల్నిగూర్చి తనలోని లక్షణాల్ని గూర్చి, కావ్యంయొక్క ప్రధానోద్దేశాన్ని గూర్చి తెల్పిన పద్యం ఇది. తన రచనలోని ప్రసన్నతనూ, కథాకవితనూ, అర్థ సంయోజనాన్ని కవీంద్రులు మెచ్చుకుంటారు - ఇతరులు అక్షరరమ్యతను ఆదరిస్తారు - ఈ రెండులక్షణాలతో కావ్యరచన చేస్తూన్న నన్నయ నానారుచిరార్థసూక్తి నిధి - భారతసంహితారచనలోని ప్రధానోద్దేశం జగద్ధితం —

ఇట్లా నన్నయ తన రచనాలక్షణాన్నీ, తనలక్షణాన్నీ, తన రచనాప్రయోజనాన్నీ మూడింటినీ పై పద్యంలో పేర్కొన్నారు- తన రచనలోని లక్షణాలు రెండు- తనలోని లక్షణం మాత్రం ఒకటే - రచనలోని రెండు లక్షణాలకూ మూలభూతమయింది తనలోని లక్షణం - తనలోని లక్షణం రచనలో రెండుపాయలై రెండు వర్గాల ప్రజల్ని సంతృప్తి పరుస్తోంది. ఈ ప్రజ లెవరనే విషయంలో కొద్ది వివేచన అవసరం కవీంద్రు లయిన వారు ప్రసన్నకథాకవితార్థయుక్తి ని లోనారసి 'శభాష్' అని మెచ్చుకుంటారట - ఇతరులు అక్షరరమ్యతను ఆదరిస్తారట - ఇక్కడ 'ఇతరు' లంటే ఎవరు ? కవీంద్రులు కాని వారు అని సామాన్య మయిన అర్థం. కవీంద్రులు కాని వారంటే ? సామాన్యులా ? కవితాదృష్టి లేనివారా ? కావ్యవిషయాసక్తి లేనివారా ? సాహిత్యవివేచనాశక్తి లేనివారా ? అనే సందేహాలు కలుగుతాయి. ఇటువంటి సామాన్యులు అక్షరరమ్యతను మాత్రం ఎట్లా గ్రహిస్తారు ? ఎట్లా ఆదరిస్తారు, ఇక్కడ మరోసందేహం - అక్షరరమ్యత అంటే ఏమిటి ? అక్షరాల యొక్క రమ్యత అనీ అక్షరాల కూర్పు, పోహళింపు- అనీ అర్థమా ? ఈ సందేహాలన్నీ తీరాలంటే "ఇతరు" లనే శబ్దానికీ 'అక్షరరమ్యత' అనే సమాసానికీ సముచిత మయిన అర్థవివేచనం చెయ్యాలి - ముందు అక్షరరమ్యత అంటే ఏమిటో వివేచించుదాం .

అక్షరాలయొక్క రమ్యత అని వ్యాఖ్యాకాలంగా తెలుగువిమర్శకులు అర్థం చెప్తూ వస్తున్నారు — రసానుగుణ మయిన అక్షరాల కూర్పు అని చెప్తున్నారు — ఇట్లా చెప్పడమంటె ఈ క్రింది రీతిగా చెప్పడం నన్నయ మహాకవి భావానికి సమీప తరం అవుతుందేమో! అక్షరాలయొక్క రమ్యత అనడం కంటె అక్షర మయిన రమ్యత అనడం సముచితం - అక్షర మయిన రమ్యత అంటే క్షరం కాని - నశిం పని - రమ్యత అని అర్థం. పదికాలాలపాటు నిలిచే రామణీయకం - నిత్యనూత నంగా భాసించే రమ్యత. మహాకావ్యాన్ని నాటకాన్ని పునఃపునఃపఠిస్తే అందులో రమ్యత పెరుగుతుందే కాని తరగదు. ఎన్ని శతాబ్దాలయినా అందులోని రమ్యత క్షరం కాకుండా నిలుస్తుంది. అంటే సార్వకాలిక మయిన రమ్యత అన్నమాట - సార్వకాలికమే కాదు సార్వదేశికమూనూ - ఆ రమ్యత దేశకాలాబాధ్యం. ఇటువంటి అక్షరరమ్యతను గ్రహించేవారు ఇతరులు - ఇతరులంటే పనానికి కవులు కాని సామా న్యులు అని మాత్రమే అర్థం చెపితే ఆ ఇతరుల పట్ల నన్నయ చిన్నచూపు చూసి నట్లవుతుంది - నన్నయ సత్యవ్రతాధిపాచార్యుడూ లోకజ్ఞుడూ కదా. అన్నిటికీ మించి సుజనుడు కదా - అటువంటి నన్నయ ఇటువంటి చులకన భావాన్ని ప్రదర్శి స్తాడా ? ఎన్నడూ ప్రదర్శించడు - కాబట్టి నన్నయదృష్టిలో ఇతరులనే శబ్దానికి మరేదో మహార్థం ఉండి ఉంటాలి - అది ఆనాడు ప్రసిద్ధ మయినదై ఉండిఉంటాలి- అది కూడా ఇపుడు వివేచించాలి —

సారస్వతం అంటే ఒకరచయిత - ఒకపాఠకుడు వీరి సమాహారతత్త్వం- కవి తన మనోభావాన్ని సరసంగా తనరచనలో వ్యక్తంచేస్తాడు. వాటిని పాఠకుడు (సహృదయుడు) ఆస్వాదించి సంతోషిస్తాడు. కవి ప్రయోగంలోనూ సహృదయుని ఆస్వాదనలోనూ సరస్వతీ తత్త్వం ఇమిడిఉంది. సారస్వతస్వభావం ఇందులో గోచ రిస్తుంది. రచనలోని సొగసులను పరిశీలించే దృక్పథంలో కవి సహృదయులిరువురూ భిన్నమార్గాల్ని అనుసరిస్తారు · రచనలో కవి ప్రసన్నతను ఎట్లా సాధించాడు? కవితాలక్షణాల్ని అర్థసంయోజనాన్నీ ఎట్లా తీర్చిదిద్దాడు అనే విషయాలమీద దృష్టి సారిస్తాడు కవి అయినవాడు - మరి సహృదయుని దృష్టివేరు - మళ్ళీమళ్ళీ పఠించినా క్షరంకాని రమ్యత అందులో నిలుస్తుందా? అనేది అతనిచూపు — అందుకే వీరిరువురి చూపులూ భిన్నమార్గాల్లో ప్రసరిస్తాయి — అయినా కవితాతత్త్వంలో సరస్వతీ తత్త్వంలో వీరిరువురే ప్రధానస్థానం ఆక్రమిస్తారు. ఈభావం నన్నయ నాటికి ఆలంకారికుల పరిభాషలో పేర్కొ పాతుకుపోయింది. స్థిరంగా నిలిచింది. నన్నయకు

కొద్దిపూర్వుడయిన అభినవగుప్తుడు. "సరస్వత్యాస్తత్వం కవి సహృదయాఖ్యం విజయతే" సరస్వతీ తత్త్వం అంటే కవి సహృదయులే అన్నాడు - అంతటి ప్రాధాన్యమూ సాన్నిహిత్యమూ వాళ్ళిద్దరికీఉంది సాహిత్య తత్వవిషయంలో - ఒకరిని గూర్చిచెప్పి, మరొకర్ని గూర్చి చెపుతున్నపుడు వాళ్ళపేరు చెప్పకపోయినా ఇతరులు అన్నా రెండవవారు గోచరిస్తారన్నమాట. వారిది అవినాభావ సంబంధం అన్నమాట. ఇది ఆనాటి సాహితీ సమీక్షకుల్లో పరివ్యాప్తమయి ప్రసిద్ధిపొంది ఉంది. కావుననే నన్నయ 'ఇతరులు' అనేశబ్దంతో సహృదయుల్ని సూచించాడు. ఆ కవి సహృదయుల దృక్పథాలకు అనువయినలక్షణాలు ధర్మాలు తనరచనలో ఉన్నాయి - ఆ ధర్మాలు కలవాడు నన్నయ - అనగా ధర్మి - ధర్మికి ధర్మానికి అవినాభావం — అవిభాజ్యం - అందుచేత ఆ లక్షణాల సమాహారస్వరూపమే నన్నయ - ఆయన నానారుచిరార్ధ సూక్తినిధి - అనగా నానారుచిరార్ధ సూక్తినిధిత్వమే రెండుపాయలై ప్రసన్నకథా కవితార్థయుక్తి - రమ్యతలుగా రచనలో ప్రవహించింది.

ఇక 'నానారుచిరార్థ సూక్తినిధి' అంటే ఏమిటో పరిశీలిద్దాం. రుచిరార్థాలకూ, సూక్తులకూ నిధి అని కొంతమందిచెపుతారు. కాని రుచిరార్థాలతో కూడిన సూక్తులకు నిధిఅంటే ఇంకా సముంజసంగా ఉంటుంది. రుచిరశబ్దాన్ని నన్నయ చాలా చోట్ల ప్రయోగించాడు - "అరుచిరాగతుండయిన" 1—4 సూరిచేతో రుచిరాబ్జబోధనరతుండు" 1—1—22 ఇట్లా చాలాచోట్ల ప్రయోగించాడు. తిక్కనకూడా "రుచిరోన్నతాసనములు — రుచిరాననుడు — రుచిరాంబరములు" — ఇట్లా వాడాడు. వీటన్నిటినీబట్టి చూస్తే రుచిరశబ్దానికి ఉజ్జ్వలమూ, రమణీయమూ, కాంతివంతమూ అని అర్థం చెప్పవచ్చు. సారస్వత విషయకంగా రమణీయంఅనే అర్థం సమంజసంగా కన్పిస్తుంది. రుచిరార్థం అంటే రమణీయార్థం — సూక్తులు నీతి ధర్మప్రబోధకాలు — ఇవి ఉపదేశాత్మకాలు. పై రుచిరార్థాలు రమణీయార్థాలు ఆనందప్రదాలు — కావ్యప్రయోజనాల్లో ముఖ్యమైనవి ఆనందోపదేశాలు — ఈ రెంటినీ సమకూర్చేలక్షణం నానారుచిరార్థసూక్తి నిధిత్వంలో ఉంది

భారతంలో నీతిధర్మ ప్రబోధకాలయిన సూక్తులు ఎన్నోఉన్నాయి. అవి సార్వకాలికాలూ విశ్వజనీనాలున్నూ — అవి అక్షరమయిన రమ్యతతో విలసిల్లుతూ ఉంటాయి. కావ్యంలోఉండి స్వయంప్రకాశమానములయి కావ్యాన్ని ఉజ్జ్వలంగా భాసింపజేస్తాయి — కావ్యంలో కథలో అంతర్భాగంగాఉండి కథకు రుచిరార్థాన్ని ప్రసాదిస్తాయి. ఆ రుచిరత్వంకూడ అనేకవిధాలు— పాఠకుడి దృష్టిననుసరించి గోచరిస్తుంది.

అందుకే నానారుచిరార్థ సూక్తు లయినాయి. అంటే మహాభారతంలో ఉపదేశాత్మకాలయిన సూక్తులకు రమణీయ మయిన అర్థసంయోజనంచేసి ఆనందప్రదాయకత్వాన్ని సమకూర్చి పాఠకులకు రసగుళికల్లాగా అందించే లక్షణం నన్నయలో ఉంది. నన్నయలోని ఈ లక్షణమే రచనలో లక్షణద్వయంగా ప్రతిఫలించింది. రుచిరార్థంనుంచి ప్రసన్న కథాకవితార్థయుక్తి ఏర్పడి ఆనందప్రదం అయింది. సూక్తి నిధిత్వంనుంచి అక్షర రమ్యత ఏర్పడి ఉపదేశాత్మక మయింది. పదికాలాలపాటు సహృదయుల హృదయాల్లో నిలిచే శాశ్వతముద్రవేసింది.

భారతంలో ప్రసక్తానుప్రసక్తంగా కథలో కలసిపోయి ఎన్నోసూక్తులు వస్తాయి. వాటిని తెలుగులో నన్నయ వింగడించి ప్రత్యేకంగా మలిచి నిలుపుతాడు. తనదైన రుచిరార్థాన్ని సంయోజనంచేస్తాడు. ఆ సూక్తుల విశేషాలనూ రుచిరార్థ సంయోజనాన్నీ పరిశీలిద్దాం.

ఏ మహాకావ్యంలో అయినా మంచిమాటలు చాలా వుంటాయి, చాలారకాలుగా వుంటాయి. కొన్ని ఆయా పాత్రలకో, సన్నివేశాలకో, సమయాలకో సరిపోయి వుంటాయి. కానీ వాటిని ఆ కావ్యం నుండి వేరుచేసి చూచినప్పుడు ఒక్కొక్కమారు అంత గొప్పగా వుండకపోగా జాతిగుణక్రియా విరుద్ధంగా కూడా కనిపిస్తాయి. అయితే కొన్ని కావ్యంలో కూర్చి చూచినా, విడదీసి విడిపూలుగా చూచినా సౌందర్యాన్ని కోల్పోక, వ్యక్తిత్వాన్ని వదలక హృదయరంజకంగా కనిపిస్తాయి. అవే సార్వకాలికాలూ, సార్వజనీనాలూ. ఒక విధంగా ప్రాణుల మౌలిక ప్రవృత్తులలోని గుణదోషాలను ఆధారంచేసి వ్రాసిన సూక్తులన్నీ సార్వజనీనతను, సార్వకాలికతను సంతరించుకుంటాయి. నైమిత్తికాలైన సూక్తులు నిమిత్తంతోబాటు నశిస్తాయి. లేదా విలువను తగ్గించుకుంటాయి.

నన్నయ భారతభాగంలోని అటువంటి సార్వకాలిక సార్వజనీన సూక్తులను ఇక ఆస్వాదిద్దాం —

మానవుని మనస్సుకు కొండంత ధైర్యం ఇచ్చేది దైవభావన - ఈ దైవభావనయే లేకపోతే మనిషి ఎంతమందిలో మెలగినా మానసికంగా ఏకాకిగానే మిగిలిపోతాడు. అందుకే పూర్వులంతా దైవభావన చేశారు - దైవాన్ని నమ్మారు - శ్రేయస్సును పొందారు - తమ జీవన విధానంలో దాన్ని ఒక భాగంగా మలచుకున్నారు - భారతీయుల జీవనవిధానంలో ఈ దైవభావనకు ఎంతో ప్రాధాన్యం ఉంది. అది శత

రులకు ఆదర్శప్రాయమైంది కూడా — ఈ విధానాన్ననుసరించి తాము చేయబోయే ప్రతీ పనికీ ముందు ఇష్టదైవాన్ని స్తుతిస్తారు భారతీయులు — మహాభారతాన్ని ఉపక్రమిస్తూ నన్నయ అదే పని చేశాడు —

శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షో ముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయ మూర్తయ స్త్రిపురుషాః సంపూజితా వస్సురైః
భూయాసుః పురుషోత్తమాంబుజ భవ శ్రీకన్ధరా శ్శ్రేయసే.

ఈ సృష్టి స్త్రీ పురుషుల సంయోగం వల్ల ఏర్పడింది. ఇది అప్రతి హతమయినది. నిరంతరమూ సాగేది - ఈ సృష్టికీ, స్థితికీ, లయానికీ కారకులు త్రిమూర్తులు — వారు తమ భార్యల్ని వేర్వేరు శరీర భాగాల్లో ధరిస్తున్నారు — లక్ష్మీదేవిని విష్ణుమూర్తి హృదయంలో పెట్టుకొంటే, సరస్వతిని బ్రహ్మ ముఖంలోనే దాచుకున్నాడు — ఇక పార్వతిని శివుడు తన శరీర - అర్ధభాగంలోనే ఇముడ్చుకున్నాడు— వారు ముగ్గురూ వేదత్రయ మూర్తులు. దేవతల చేత కూడా పూజింపబడేవారు — అటువంటి త్రిమూర్తులు మీకు శ్రేయస్సును కల్గింతురు గాక ?

సంస్కృతంలో వ్యాసుడు వ్రాసిన శ్రీమహాభారతాన్ని తెలుగులో వ్రాస్తున్నాడు నన్నయ. కావ్యారంభం శుభప్రదంగా ఉండాలి. అందుకే "మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథన్తే" అనే సూక్తి ఏర్పడింది. ఆది, మధ్య, అంతాలలో కావ్యం శుభప్రదంగా ఉండాలి. అందుచేత కాబోలు సృష్టి స్థితి లయాలకు కారకులయిన త్రిమూర్తుల్ని స్తుతించాడు నన్నయ —

కావ్యారంభానికి నన్నయ తెలుగులో ఒక కొత్త ఒరవడి చూపాడు. 'శ్రీ' కారంతో కావ్యం ప్రారంభించాడు — ఇదే మార్గాన్ని తెలుగు కవులంతా అనుసరించారు — ఇది సంస్కృతంలో లేనిది — ఎక్కడైనా యాదృచ్ఛికంగా ఉంటే ఉండవచ్చునుగాని నియమంగా లేదు — తెలుగులో ఆదికవి పెట్టిన కనిపెట్టిన సంప్రదాయం ఇది — ఇది తెలుగుభాషలో బాగా స్థిరపడిపోయింది. లోకవ్యవహారంలో కూడా "శ్రీకారం చుట్టడం" అంటే ప్రారంభించడం అనే అర్థం రూఢి అయిపోయింది.

శ్రీకారం మాత్రమే కాదు. తరువాత 'వ' కారం వాడి అమృత బీజాన్ని నిక్షేపించాడు నన్నయ—ఈ విధంగా బీజాక్షరం నిక్షేపం చెయ్యడం పూర్వ సంస్కృత

కావ్యాల్లో కనిపిస్తుంది - కాళిదాసు "వాగర్థావివ" అంటూ రఘువంశం అమృత బీజంతో ప్రారంభించాడు — దానివల్ల గ్రంథానికి తేజస్సు ఆయుస్సు కలుగుతుందని విశ్వాసం. పాఠకులకు పవిత్రమూ ఉదాత్తమూ అయిన అమృతభావనకూడా కల్గుతుంది.

బ్రహ్మ విష్ణు మహేశ్వరుల్ని త్రిమూర్తులు అంటారు - ఈ ముగ్గురి లోనూ మూడు గుణాలు ప్రాధాన్యం వహిస్తాయి. బ్రహ్మ - రజోగుణము; విష్ణువు - సత్త్వగుణం; మహేశ్వరుడు - తమోగుణం; సామాన్యంగా పై ముగ్గుర్నీ బ్రహ్మ విష్ణు మహేశ్వరులనే క్రమంలో చెప్తారు - కాని ఇక్కడ నన్నయ ఆ క్రమాన్ని మార్చాడు — దానికి కారణం గమనీయము. త్రిగుణాల్లో సత్త్వగుణం ఉత్తమ మయింది. అందువల్ల సత్త్వగుణ ప్రధానుడయిన విష్ణుమూర్తిని ముందు పేర్కొన్నాడు. (సత్త్వగుణ ప్రధానుడు పురుషోత్తము డని కీర్తింపబడతాడని సూచన) తర్వాత రజోగుణం - దానికంటె తక్కువయిన తమోగుణం ఆతర్వాతనూ పేర్కొబడింది - (రూప) మూర్తులలో క్రమం కాకుండా గుణాలలో క్రమం ప్రాధాన్యం వహించింది.

ఈ సృష్టి స్త్రీ పురుషుల కలయిక వల్ల ఏర్పడింది. దీన్ని రక్షించే వ్యక్తి విష్ణువు - ఈ రక్షణకు మూలం ధర్మం - "ధర్మో రక్షతి రక్షితః" అని కదా! ఈ దృష్టితో విష్ణుమూర్తిని మొదట స్తుతించా డనవచ్చు - ఈ ధర్మానికి మూలం వేదం - "వేదోఖిలో ధర్మమూలమ్" అని మనువు చెప్తున్నాడు - త్రిమూర్తులు వేదత్రయ మూర్తులు - ప్రతీ మానవుడికీ విహితమైన ధర్మా లున్నాయి - అవి ఆచరిస్తే సుఖ జీవనం కలుగుతుంది. ధర్మరక్షకుడూ, ధర్మానికి ప్రభువూ, (1) సుఖజీవన ప్రదాతా అయిన విష్ణుమూర్తిని ముందుగా కీర్తించడంలో నన్నయ లోకజ్ఞత, జగద్ధితకాంక్ష ఇమిడి ఉన్నాయి.

త్రిమూర్తులు తమ తమ సహధర్మచారిణులతో కలిసి తమ ధర్మాలను నిర్వర్తిస్తున్నారు - ధర్మపూర్వకమైన అనురాగాన్ని ప్రకటిస్తున్నారు - ఇది ప్రజలకు ఒక సూచన చేస్తున్నట్లు ధర్మబద్ధమైన అనురాగం అపవర్గప్రాయ మవుతుందనీ - దైవాంశ కలవారయి సురలచేతకూడ కీర్తింపబడతారని సూచన —

(1) ధర్మస్యప్రభు రచ్యుతః అని విష్ణు సహస్రనామము.

4]

ఈ ముగ్గురు స్త్రీలూ శ క్తి స్వరూపాలు — ప్రకృతి శ క్తి స్వరూపిణి - పురుషుని ఆశ్రయించి ఉంటుంది ప్రకృతి - ఈ ఆశ్రయం కూడా మూడు అవయవా లను ఆధారం చేసుకుని ఉంటుంది - 1. మనస్సు - 2. వాక్కు (మాట) 3. కాయము (శరీరము) - ఇవే త్రికరణాలు - ఈ మూడూ ఏకీకృతము లయితే త్రికరణ శుద్ధి ఏర్పడి నట్లు - వారికి సర్వశ క్తులూ స్వాధీన మయినట్లే - శ క్తులు కూడా మూడు — 1. ఇచ్ఛాశ క్తి 2. జ్ఞానశ క్తి 3. క్రియాశ క్తి — ఈ మూడు శ క్తులకూ కూడ త్రికరణలే ఆశ్రయాలు — త్రికరణాలతోనూ త్రిమూర్తులు ధర్మా చరణం చేస్తున్నారు — వారు మానవులకు ఆదర్శప్రాయులు కావాలి — త్రికరణ శుద్ధిగా మానవులు ధర్మాచరణం చేయాలని నన్నయ వ్యంగ్య మర్యాదతో చెపు తున్నాడు — * * *

తగునిది తగదని యెదలో
వగవక సాధులకుఁ బేదవారల కెగ్గుల్
మొగి జేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగ మంబు లయిన భయంబుల్ 1-1-85

ఈపని తగునా తగదా అని ఆలోచించకుండా సజ్జనులకూ, పేదవారికీ అప కారం చేసే దుష్టులకు నిష్కారణమైన భయాలు కల్గుతాయి.

జనమేజయుడు దీర్ఘసత్రయాగం చేస్తున్నాడు - అతని తమ్ముళ్ళు శ్రుత సేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడు ఆ యాగాన్ని పర్యవేక్షిస్తున్నారు. ఒకనాడు సరమ యొక్క పిల్ల సారమేయం (సరమ దేవశుని - దానికొడుకంటే దేవతల కుక్కపిల్ల సారమేయం) ఆ ప్రదేశానికి వచ్చి తిరుగాడుతోంది - జనమేజయుని తమ్ములు దాన్ని కొట్టి తరిమేశారు - అది అరుస్తూ వెళ్ళి తల్లికి చెప్పింది - తల్లి సరమ కోపించి జనమేజయుని దగ్గరకు వచ్చి "మహారాజా! అవివేకు లయిన నీ తమ్ములు నిరపరాధి యయిన నాపుత్రుని కొట్టి తరిమేశారు - మంచి చెడ్డలు ఆలోచించకుండా సాధువులకూ పేదవారికీ కీడు కల్గించే దుర్వినీతులకు నిష్కారణ భయాలు కలుగు తాయి" అంది.

మహాభారత రత్నాకరంలో మొట్టమొదట లభించే సూ క్తిరత్నం యిది. సామాన్య రత్నంకాదు - జాతి రత్నం - మహాభారతం నీతిధర్మ ప్రబోధక మయిన

గ్రంథం. మానవుడు ఇతరులతో కలిసి మెలిసి సుఖజీవనం సాగించేందుకు స్ఫూర్తి నిచ్చే సూక్తిరత్నం యిది. బలవంతమయిన ప్రాణి బలహీనమయిన ప్రాణిని హింసించడం పశు లక్షణం - తానెంత బలవంతుడయినా బలహీనులను కూడ గలుపుకొని కలిసి మెలిసి జీవించటం వివేకంగల మానవుని లక్షణం. పశులక్షణం వినాశానికి దారితీస్తుంది — బలిష్ఠుడయిన వాడు బలహీనుణ్ణి, బలిష్ఠమైన జాతి బలహీనమయిన జాతినీ, బలిష్ఠమయినదేశం బలహీనమయిన దేశాన్నీ హింసిస్తూ, సంహరిస్తూ పోతే చివరికి మానవజాతి మనుగడకే ముప్పు కలుగుతుంది. "సర్వేజనా స్సుఖినో భవన్తు" అనే ఆర్ష భావానికి ఈ ప్రవృత్తి విఘాతం కల్గిస్తుంది. పైగా ఈ పశు ప్రవృత్తిలో మరో విశేషం ఉంది - తనశక్తి పట్ల అహంభావం, గర్వం, ఇతరుల శక్తిపట్ల ద్వేషం, చులకన యిందులో తొంగి చూస్తాయి - ఈ భావం వినాశ హేతువు - ఈ వినాశం కల్గకుండా మానవులను ప్రబోధించాలి - నియమ బద్ధుల్ని చేయాలి —

ఏ నియమం అయినా ఇతరులు అమలు చేస్తూంటే మానవుడు తప్పించుకొనేందుకే ఎన్నో విధాల ప్రయత్నిస్తాడు. అదే తనకు తానుగా ఏర్పరచుకొన్న నియమాలయితే సర్వవిధాలా ఆచరించేందుకు ప్రయత్నిస్తాడు. అనగా నియమం ఆత్మప్రేరితం కావాలి - స్వభావ సిద్ధం కావాలి.

ప్రవక్తయైన మహాత్ముడు మానవునిలోని యీ స్వభావాన్ని గుర్తెరిగినవాడు - మానవునకు స్వభావ సిద్ధమయిన గుణాల్లో భయం ఒకటి - ఎంత నిర్భీతిగా చరించే వాని కయినా ప్రాణభీతి ఉండకపోదు - అందుచేత మానవునికి స్వభావసిద్ధ మయిన గుణం భయం - ఆ భయభావాన్ని ఉద్బుద్ధంచేసి మహాకవి లోకకల్యాణాన్ని సాధిస్తున్నాడు - దీనితో తనలోని అహంభావాన్ని ఇతరులపట్ల చులకన భావాన్నీ మానవుడు విసర్జించి ఇతరులతో సామరస్యంతో ప్రవర్తిస్తాడు —

ఈ ఉద్దేశంతో అనిమిత్తాగమ మయిన భయం కలుగుతుందని సూచించాడు నన్నయ దానిని - ఒక సూక్తి రత్నంగా సానబెట్టి స్ఫూర్తి నిచ్చాడు - అయితే ఇక్కడ పాఠకులకు ఒక సందేహం కలుగ వచ్చు - "ఇదంతా సంస్కృతంలో వ్యాసుని ఉపజ్ఞ కాని నన్నయదేముంది కేవలం తెనుగు చేశాడు. అంతే కదా" అని - నిజమే; రత్నం వ్యాసునిదే - నన్నయ దాన్ని సానబెట్టి జాతిరత్నంగా తయారు చేశాడు.

దేవశుని జనమేజయుణ్ణి ఇట్లా శపించినట్లు మాత్రమే వ్యాసుడు సంస్కృతంలో వ్రాసి ముందుకు సాగిపోయాడు - సంస్కృతంలో

సా తా నువాచ - యస్మాదయ మభిహతోఽనపకారీ తస్మాదదృష్టం త్వాం భయమాగమిష్యతీతి.

అని మాత్రమే ఉంది - సంస్కృతంలో కథా భాగంతో కలిసి పోయినట్లుంది. దాన్ని నన్నయ వేరుచేసి ఒక సూక్తి రత్నంగా మలిచాడు — ఇది నన్నయ లోకజ్ఞతకు నిదర్శనం - సర్వ మానవాళికి సుఖప్రదమయిన జీవన మార్గాన్ని సూచించే వెలుగులు విరజిమ్మే సూక్తిరత్నం యిది -

ఈ సూక్తిని ఒక కుక్కచే మానవులకు చెప్పించడంలో కూడా కొంత ఔచిత్యం లేకపోలేదు. భారతం ప్రారంభంలో కుక్క కన్పిస్తుంది - మళ్ళీ చిట్టచివర కన్పిస్తుంది - ధర్మదేవత శునకరూపంలో ధర్మరాజుతో స్వర్గానికి వెడుతుంది — ఇక్కడ మొదట్లో దేవశుని అని మాత్రం చెప్పాడు - నిజరూపం గ్రంథాంతంలో చూపించాడు - ధర్మ స్వరూప మయిన ఆ దేవశునిచేత ధర్మోప దేశానికి ప్రారంభోత్సవం చేయించడం ఔచితీ సంపాదకం —

నన్నయ ఈ సూక్తి రత్నాన్ని కందంలో పొదిగాడు - తెలుగు ఛందస్సులో కందానికి ఓ విశిష్టత ఉంది. పద్యం చిన్నదే కాని అందులో మహార్థం ఇముడ్చు కుంటుంది - కందాన్ని అట్లా తీర్చి దిద్దాడు నన్నయ - కందం చూపునకు చిన్నదే - కాని రుచి విషయంలో రసవన్మాకందం వంటిది - ఆస్వాదయోగ్యమైన చిన్నరసాల మామిడిపండ్లు లాగా ఉంటాయి నన్నయ కందాలు — * * *

నిండుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము జగన్నుత ! విప్రులయందు నిక్కమీ
రెండును రాజులందు విపరీతముగావున విప్రుఁడోపు నో
పం డతిశాంతుఁడయ్యు నృపాలుఁడు శాపము గ్రమ్మఱింపగన్.

1-1-100

నిండయిన మనస్సు వెన్నపూసలా ఉంటుంది. మాటమాత్రం వజ్రాయుధంతో సమానంగా ఉంటుంది. ఇది బ్రాహ్మణస్వభావం - రాజులలో ఈరెండూ

తారుమారవుతాయి - అంటే మాట వెన్నలా మృదువుగా ఉంటుంది - మనస్సు వజ్రంలా కర్కశంగా, కఠినంగా ఉంటుంది. అందుచేత శాపాన్ని ఉపసంహరించుకోటానికి బ్రాహ్మణుడే తగును. ఎంత చెంపదలచినా క్షత్రియుడు శాపం ఉపసంహరించలేడు. అతని హృదయానికి అంత మార్దవం ఉండదు.

గురువుగారి ఆజ్ఞతో ఉదంకుడు పౌష్యమహారాజు దగ్గరకు వెళ్ళి కుండలాలు అర్థించాడు. అతడు ఇచ్చాడు - దగ్గరికి అర్హుడయిన అతిథి వచ్చినాడు కదా అని భోజనంచేసి వెళ్ళమన్నాడు [illegible]. ఉదంకుడు సరే అన్నాడు - భోజనం చేస్తున్నాడు. అన్నంలో వెంట్రుక వచ్చింది. ఉదంకుడికి కోపం వచ్చింది. ముందు పరిశీలించకుండా అపరీక్షితమయిన అన్నంపెట్టావు కనుక "నీవు అంధుడవై పోదువుగాక" అని శపించాడు. ఈ మాత్రానికే నన్ను ఇట్లా శపించాడు అని పౌష్యుడికి కోపంవచ్చింది. అకారణంగా నన్నుశపించావు. నీవు అనపత్యుడవు (పిల్లలులేనివాడు) వగుదువుగాక అని తిరిగి శపించాడు పౌష్యుడు. అప్పుడు ఉదంకుడు "నేను అనపత్యుణ్ణి కాలేను నీశాపం ఉపసంహరించుకో". అన్నాడు రాజుతో - దానికి సమాధానంగా రాజు పౌష్యుడు ఈవిధంగా చెప్పాడు

ఇందులో బ్రాహ్మణలక్షణాన్నీ క్షత్రియ లక్షణాన్నీ వివరించాడు. ఇది స్థూలంగా పైకికన్పడే సామాన్యార్థం - నన్నయ దానివెనుక మరో రుచిరార్థాన్ని పొదిగాడు. వెనుకనుండి ముందుకు తొంగిచూస్తోంది ఆ అర్థం. అది ధీమాన్యమయిన అర్థం.

మానవుడికి త్రికరణా లున్నాయి. మనస్సు - మాట - చేతలు - వీటినే మనో, వాక్, కాయము లంటున్నాము. వీటిలో మనస్సు ప్రథమం మాత్రమే కాదు ప్రధానంకూడా - హృదయ స్పర్శలేకుండా మాట్లాడినమాటకు జీవంలేదు. విలువ లేదు - నిజంకాదు నిర్మలంకాదు - అట్లాగే హృదయస్పర్శలేని చేష్టకూడా అంతే - హృదయంలో కాలుష్యం లేకుండా చేసిన చేష్టకూడ నిర్మలమే అవుతుంది. దీనికో ఉదాహరణం చెప్పారు. ఏ శరీరంతో భార్యను ఆలింగనం చేసుకుంటున్నాడో ఆ శరీరంతోనే కూతురునూ ఆలింగనం చేసుకుంటున్నాడు మానవుడు. కానీ హృదయం, భావం మాత్రం వేరు.

మనసైవ కృతం పాపం నశరీర కృతం కృతమ్
యేనైవా లింగితా కాన్తా తేనైవా లింగితా సుతా

మంచికైనా చెడ్డకైనా మనస్సు ప్రధానం- కాని శరీరం కాదు - అందుకే శివలింగాన్ని చెప్పుకాలితో తొక్కినా శివలింగంమీద నీళ్ళు ఉమ్మివేసినా తిన్నడికి దోషంఅంటలేదు - మనస్సులో కాలుష్యంలేదు - కేవలం భక్తిమాత్రమే ఉంది కాబట్టి - అందుచేత త్రికరణాల్లోనూ హృదయం ప్రధానం - అది మృదువుగా ఉండటం చాలా అవసరం - అది మృదువుగాఉండి మాట కఠినంగాఉన్నా ఫర్వా లేదు. మాటవెలువడిన మరుక్షణంలో వెన్నపూసలాంటి ఆ హృదయం కరిగి బయ టకు ప్రవహించకమానదు. ఇందులో మొదటగా పైపైన అహంభావం(అహంకారం) కనపడుతుంది. తర్వాత వెంటనే దాని నిరాసం కన్పిస్తుంది. అది ఉత్తమగతి సూచ కమూ - విశ్వకల్యాణప్రదమూను -

ఇది తిరగబడితేప్రమాదం - మాటమాత్రం మృదువుగాఉండి హృదయం కర్కశంగాఉంటే ఎదుటివాళ్ళు మోసపోయే ప్రమాదంకూడాఉంది - నాలుకతీపుకు లోబడిపోయి - ఇందులో అహంకారం పైకి కన్పడదుకానీ అంతర్లీనంగా ఉండి హృదయాన్ని వేధిస్తుంది.

అందుచేత హృదయం ప్రధానమైనది - అది నిర్మలంగానూ మృదువు గానూ ఉండటం సత్త్వలక్షణం - ధార్మికలక్షణం- అసలు ధర్మా లన్నిటిలోకీ ఉత్తమ మైంది భూతదయ ఒకటే అని భారతం ఘోషిస్తుంది. దానికి కావలసింది హృదయ మార్దవం.

మాట మృదువుగాఉండి హృదయం కఠినంగా ఉన్నవాడిలో కనికరం ఉండదు. భూతదయఉండదు. అది పతనహేతువు - రజోలక్షణం - రాజసం కలవాడికి అహంభావం ఎక్కువగాఉంటుంది. అది కఠినతకూ క్రూరతకూ, తద్ద్వారా వినాశనానికీ దారితీస్తుంది.

రజోగుణం కల వ్యక్తి శాపాన్ని ఉపసంహరించుకోలేడట - హృదయ మార్దవం లేకపోవడంవల్ల - ఇక్కడ ఈ కథాభాగంలో చివరకు అదే జరిగింది - ఉదంకుడు సాత్త్వికుడు. మృదు హృదయుడు. పౌష్యుడు కఠినాత్ముడు. రాజసికుడు. వీళ్ళిద్దరిలో చివరికి ఉదంకుడే శాపాన్ని ఉపసంహరించుకున్నాడు - పౌష్యుడు ఉప సంహరించలేదు — ఉదంకుడు "త్వరలోనే నీకు అంధత్వం పోతుంది" అనిపౌష్యుణ్ణి అనుగ్రహించాడు.

ఇక్కడ ఉదంకుడు మొదట్లో తీవ్రంగా శపించాడు పౌష్యుణ్ణి — అయినా అతనిమనస్సు వెన్నలాంటిది కావడంవల్ల, సత్వ గుణప్రధానం కావటంవల్లనూ మళ్ళీ శాపం ఉపసంహరించుకున్నాడు. పౌష్యుడిమనస్సు కఠినంగా వజ్రసదృశంగా ఉండటంవల్ల తాను శాపం ఉపసంహరించుకోలేకపోయాడు — తెలివిగా మృదువుగా మాట్లాడి శాపాన్ని తొలగింపజేసుకున్నాడు.

నన్నయ విశేషణాలు వేయడంలో సంయమనం వహిస్తారు. ఉచితమైన ఒకేఒక విశేషణంతో పరిమళాలు వెదచల్లుతాడు. మృదువైన మనస్సుకు "నిండు" అని విశేషణంవేశాడు. కర్కశమయిన వాక్కు వజ్రసమానం అనిచెపుతూ దానికి 'దారుణ' అని విశేషణంవేశాడు. ఇవి యిక్కడ రుచిరార్థాన్ని సంతరించాయి. అసలీ వజ్రాయుధ ఉపమానం నన్నయఉపజ్ఞం. కాఠిన్యానికి ఱాయినో, ఇనుపముద్దనో ఉదాహరణగా చెపుతారు సామాన్యంగా — సంస్కృతంలో కత్తిని ఉదాహరణగా చెప్పారు. కాని నన్నయ దాన్ని వజ్రాయుధంగా మార్చాడు. దానిలో కార్కశ్యం అధికం. ఇంద్రుడి ఆయుధం వజ్రాయుధం — అదిపుడుతూనే దధీచిమహర్షి ప్రాణాలు తీసింది. అది అంతకర్కశ మయింది. (దధీచిమహర్షి వెన్నెముక వజ్రంఅయింది. తాను ప్రాణాలువదలి దధీచి తనవెన్నెముకను ఇంద్రుడికి ఆయుధంగా త్యాగంచేశాడు.)

పై పద్యంలో రెండు భిన్నప్రకృతులు కల మానవస్వభావాల్ని ప్రతిఫలింపజేయడం సామాన్యార్థం — రజోగుణంకంటె సత్వగుణం ప్రధానమైనదనీ సూచించడం నన్నయ ఇందులో నిక్షేపించిన ధీమాన్యార్థం.

తన యెఱిఁగిన యర్థం బొరుఁ
డనఘా! యిది యెట్లు చెప్పుమని యడిగినఁ జె
ప్పని వాఁడును సత్యముఁ జె
ప్పని వాఁడును ఘోర నరక పంకమునఁ బడున్ 1-1-136

తెలిసిన విషయాన్ని ఇతరులడిగితే చెప్పక పోయినా; సత్యం చెప్పక పోయినా అతడు దారుణ నరకం పాలవుతాడు.

భృగుమహర్షి భార్య పులోమ - ఆమె గర్భవతి - అగ్నిహోత్ర గృహంలో అగ్నులు విహరించమని భార్యకు చెప్పి భృగుడు స్నానానికి నదికి వెళ్ళాడు - తరువాత పులోముడనే రాక్షసుడు అక్కడకు వచ్చాడు - ఆమెనుచూచి

ఉన్మత్తుడయ్యాడు. ఆమె ఎవరు ? అని అగ్నిహోత్రుణ్ణి అడిగాడు - వాడి మనస్సులోని భావాన్ని ఊహించాడు అగ్నిహోత్రుడు - ఒకప్రక్క అసత్యమాడటానికీ మరోప్రక్క విప్రశాపానికీ భయపడ్డాడు - విప్రశాపం ఎట్లాగో తీర్చుకోవచ్చు. అసత్యంవల్ల వచ్చేపాపం తీర్చుకోలేము అనుకొని ఆమె భృగుపత్ని అని ఉన్న విషయం (నిజం) చెప్పాడు అగ్ని - ఆ రాక్షసుడు "ఈమెను నేను పూర్వం వరించాను - తర్వాత భృగువు పెళ్ళి చేసుకున్నాడు" అని ఆమెను వరాహరూపంలో ఎత్తుకుపోయాడు - ఆవేగంతో, కోపంతో గర్భంలోని పుత్రుడు కుక్షిచ్యుతుడై వెలుపలికి వచ్చాడు - వాడు కళ్ళు తెరిచి చూచాడు - రాక్షసుడు బూడిదైపోయాడు - పులోమ కొడుకు నెత్తుకొని ఆశ్రమానికి వచ్చింది - ఇంతలో స్నానంచేసి భృగుడూ వచ్చాడు - రాక్షసుడు చేసిన అపకారం తెలుసుకున్నాడు - నువ్వు ఫలానా అని రాక్షసుడికి ఎవరు చెప్పారు ? అని అడిగాడు - అగ్ని అని సమాధానం వచ్చింది - మునీంద్రుడికి కోపం వచ్చింది - "నీవు సర్వభక్షకుడివై పోదువుగాక" అని అగ్నిహోత్రుణ్ణి శపించాడు - అప్పుడు అగ్నిహోత్రు డిట్లా అన్నాడు –

"సాక్ష్యం అడిగితే మౌనం వహించకూడదు - అసత్యం చెప్పకూడదు" ఈ భావం మాత్రమే సంస్కృతంలో ఉంది. (1) దాన్ని నన్నయ విస్తృత పరిచి విపులార్థవంతం గావించాడు - కథాభాగం నుంచి విడదీసి చదువుకొనేందుకు వీలుగా రచించాడు నన్నయ - సాక్ష్యం విషయమైన అర్థమే కాకుండా మరో రుచిరార్థం కూడ యిందులో గోచరిస్తుంది.

ఒక విషయాన్ని ఎవరైనా వినయ అడిగితే తెలిసిన విద్వాంసుడు స్వార్థంతో కాని లోభంతో కాని చెప్పకుండా ఊరుకోరాదు- తనకు తెలిసిన జ్ఞానాన్ని ఇతరులకు ఉపదేశింపకపోతే లోకంలో జ్ఞానం విస్తృతి చెందదు - అపుడతడు జ్ఞానాన్ని నిరోధించినవాడవుతాడు - అది నేరం కూడ - పైగా జిజ్ఞాసతో అడిగిన వానికి చెప్పడం అధిక ఫలప్రదం -

(1) కూట సాక్ష్యం చెప్పరాదని రామాయణంకూడ శాసిస్తోంది - కూట సాక్ష్యం చెప్పినవాడు పరలోకంలో తన మాంసాన్ని తానే తినవలసి వస్తుందట —

దుస్సాక్షీవ పరేలోకే స్వాని మాంసాని భక్షయేత్ అరణ్య–29–12

విషయం చెప్పకపోయినా దోషమే. అబద్ధంచెప్పినా దోషమే. కొంత మంది ఈ విషయంలో తమతెలివితో తప్పించుకొంటారు - ఎదుటివానికి తెలియకుండా చెప్పి తప్పించుకుంటారు. ఇదికూడా ఒకవిధంగా అసత్యమాడినట్లే- అసత్యం ఏ రూపంలోఉన్నా అది దోషమే అవుతుంది - అందుకే "నానృతా త్పాతకం పరమ్" అని "సత్యాన్నాస్తి పరమ్ పదమ్" అనీ సూక్తు లేర్పడ్డాయి.

సత్యం చెప్పేవాడికి మొదట్లో కష్టాలు ఎదురౌతాయి - కాని అవి పర్యంతంలో సుఖప్రదాలే అవుతాయి. ఈ విషయం ఈ కథాభాగమే సూచిస్తుంది. భృగు శాపం పొందాడు అగ్నిహోత్రుడు. అగ్ని సమర్థుడైనా ప్రతిశాపం ఇవ్వలేదు. తన జ్వాలలు ఉపసంహరించాడు. అపుడు బ్రహ్మ కల్పించుకొని ఒకవరం ప్రసాదించాడు. అగ్ని ముట్టుకొన్న ప్రతివస్తువూ పవిత్ర మవుతుందనీ, అపుడు సర్వభక్షకత్వం వరంగానే పరిణమిస్తుందనీ చెపుతాడు. ఈ విధంగా సత్యపాలనంవల్ల మొదట్లో కష్టం వచ్చినట్లు అనిపించినా చివరకు సుఖప్రదమే అవుతుంది. * * *

తగియెడు పుత్రులం బడసి ధర్మువు దప్పక తమ్ము సత్తముల్
పొగడఁగ మహాత్ములు పొందు గతుల్ తమఘోర నిష్ఠతోఁ
దగిలి తపంబుసేసియును దక్షిణలిమ్ముగ నిచ్చి యజ్ఞముల్
నెగడఁగఁజేసియుం బడయనేర రపుత్రకులైన మర్త్యులు.

1-2-148

సముచిత సంతానాన్ని పొంది, ధర్మం తప్పకుండా సంచరిస్తూ, ఉత్తములు కూడ స్తుతింపదగ్గ జీవనంగడిపే మహాత్ములు పొందే ఉత్తమగతులు మర్త్యులైన అపుత్రకులు ఎంతనిష్ఠతో తపస్సుచేసినా పొందలేరు. వారి దక్షిణలిచ్చి యజ్ఞాలుచేసినా పొందలేరు.

జరత్కారు మహర్షియొక్క పితరులు జరత్కారుడితో అన్నమాటలివి. జరత్కారుడు గృహస్థాశ్రమం స్వీకరించకపోతే పితరులకు ఉత్తమలోకాలు లేవు. వాళ్ళందరూ అధోగతిపాలుకాకుండా ఉండాలంటే జరత్కారుడు వివాహంచేసుకొని పుత్రసంతానాన్ని పొందాలి. దానికి తగినప్రేరణనిస్తున్నారు. అతని పితరులు.

అన్ని ఆశ్రమాల్లోనూ గృహస్థాశ్రమానికి ఓ విశిష్టతఉంది. ఇతరమైన ఆశ్రమాల్లో ఉన్నవారిని ఆదరించి సేవించేభాగ్యం గృహస్థులకే ఉంది. అందుచేత

గార్హస్థ్యానికి ఇతరఆశ్రమాలు సరికావంటారు అల్లసానివారు - అటువంటి గృహస్థాశ్రమం స్వీకరించి తగిన పుత్రుల్నిపొంది ధార్మికంగా ప్రవర్తించడం మానవుని ప్రధానకర్తవ్యం అని ప్రబోధిస్తున్నాడు - అటువంటి మహాత్ములతో సోమయాజులు కాని సమానులు కారట. ఇక్కడ సంస్కృతంలో

తపో వా ప్యథవా యజ్ఞో యచ్చాన్య త్పావనం మహత్
తస్సర్వ మవరం తాత నసంతత్యా సమం మతమ్

అనిమాత్రమే ఉంది. తపస్సుకాని యజ్ఞంకాని ఏ పవిత్రమైన కృత్యమైనా సంతానానికి తక్కువే - సమంకావు - అని తమపనికి అనుకూలంగా పితరులు జరత్కారునితో చెప్పినట్లుఉంది. ఇది ఒకదృష్టితో మాత్రమే సత్యం. అనగా పాక్షికంగా సత్యం.

నన్నయ దీనికి సమగ్రతను చేకూర్చి చూపించాడు. సంతానం పొందడం మాత్రమే చాలదు. ధార్మికంగా జనస్తుత్యమయిన గృహస్థజీవనం గడపాలన్నాడు. ఈ నియమంతో సంతానలాభానికి సమగ్రతను సంపాదించాడు. అట్లాగే తపోనిష్ఠనూ, యజ్ఞయాగాదులనూ కించపరచకుండా "దుర్మతుల్" అనే విశేషణంతో సామంజస్యాన్ని సంతరించాడు- ఇట్లా వ్యాసుని ఉక్తులను సూక్తులుచేసి రుచిరార్థయుక్తాలుగా చేయడంలో నన్నయ దిట్ట—నిధి.

మానవుడు మూడుఋణాలతో పుడతాడని వేదాలు చెపుతున్నాయి. 1. ఋషిఋణము 2. దేవఋణము 3. పితృఋణము - ఈ ఋణాలను తీర్చుకొనే మార్గాలు లేకపోలేదు - ఋషిఋణాన్ని బ్రహ్మచర్యం అవలంబించి వేదాధ్యయనం చేసి తీర్చుకోవాలి. గృహస్థాశ్రమం స్వీకరించి సత్సంతానాన్ని పొంది పితృఋణాన్ని తీర్చుకోవాలి.(2) గృహస్థాశ్రమం స్వీకరించకపోతే మోక్షంరాదంటాడు మనువు. అందుచేత గృహస్థాశ్రమం సర్వశ్రేష్ఠ మయింది.

---

(1) జాయమానో వై బ్రాహ్మణః త్రిభిర్ ఋణవాన్ జాయతే, బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః ఏషవా అనృణంయః పుత్రీ యజ్వా, బ్రహ్మచారివాసీ- (తైత్తిరీయ సంహిత)

(2) భారతం మనుష్యఋణాన్ని అదనంగా చెపుతుంది. దాన్ని ఆనృశంస్యంతో తీర్చుకోవాలంటుంది. ఆనృశంస్యం అంటే స్థూలంగా భూతదయ - "సంఘంశరణం గచ్ఛామి"అన్న బౌద్ధధర్మంలోని ఆంతర్యంకూడా యిదే.

క్రోధము తపముం జెఱచును
గ్రోధము యణిమాదు లయిన గుణములఁ బాపుం
గ్రోధము ధర్మక్రియలకు
బాధ యగుం గ్రోధిగాఁ దపస్వికిఁ జన్నే! 1-2-172

క్షమలేని తపసి తపమును
బ్రమత్తు సంపదయు ధర్మ బాహ్యు ప్రభు రా
జ్యము భిన్న కుంభమునఁ దో
యము లట్టుల యధ్రువంబులగు నివి యెల్లన్ 1-2-273

క్రోధం తపస్సును నశింపజేస్తుంది - అణిమాది సిద్ధుల్ని పోగొడుతుంది - ధర్మక్రియలకు క్రోధమే హానికల్గిస్తుంది - అందువేత క్రోధి కావడం తపస్వులకు తగునా ?

ఓర్పులేని తపస్వి తపస్సూ, మదించినవాని సంపదా, అధర్మవర్తి రాజ్యమూ పగిలిన కుండలో నీళ్ళలాగా పటాపంచ లయి పోతాయి.

పరీక్షిత్తు శమీకుని మెడలో సర్పం వేసి వెళ్ళిపోయాడు. ఈ దృశ్యం శమీకుని కొడుకు శృంగి చూచి క్రోధంతో పరీక్షిత్తును శపిస్తాడు. "వారం రోజుల్లో తక్షక విషాగ్ని దగ్ధుడయి పోవుగాక" అని - కొంతసేపయ్యాక ధ్యానం నుండి లేచిన శమీకునికి ఈ విషయం తెలిసింది. జరగరాని అపచారం రాజుకు జరిగిపోయిందని ఎంతగానో విచారిస్తాడు — కొడుకు శృంగిని మందలిస్తాడు అంత కోపం పనికిరా దంటూ - ఆ సందర్భంలోనివి ఈ రెండు పద్యాలున్నూ —

మానవుని మనస్సును వేధించే అంతశ్శత్రువులు ఆరు — వాటినే అరిషడ్వర్గాలు అంటారు. అవి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు. వీటిలో క్రోధానిది ద్వితీయస్థానమైనా దాని విస్తృతి పరిధిని బట్టి చూస్తే అగ్రస్థానమే పొందుతుంది - కామం నుండే క్రోధం పుట్టినా దీని విస్తరణ కార్యక్రమం చాల పటిష్ఠమైంది - క్రోధం లేని మానవుడు లేడనడంలో ఆశ్చర్యమేమీలేదు - ప్ర మానవుడికీ ఎపుడో అపుడు క్రోధం ఆవేశిస్తుంది - దాన్ని అదుపులో పెట్టుకోక పోతే పశులక్షణానికి దగ్గరగా పోతున్నాడని యర్థం.

క్రోధం తపస్సును నశింపజేస్తుంది - క్రోధం అల్పమైనది - తపస్సు అనల్పమైనది - అల్పమైన దానితో అధికమయిన దాన్ని చెడగొట్టుకోవడం వివేచన కల మానవుని లక్షణం కాదు - "నా సుకృతం చెడిపోతుందని నిన్ను శపించటం లేదు" అంటుంది సీత తన్ను అపహరించుకుపోతున్న రావణాసురునితో -

క్రోధం అణిమాది మహాగుణాలను పోగొడుతుంది - అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము. ఈ ఎనిమిదీ మహా చ్ఛక్తులు - క్రోధంవల్ల పోగొట్టుకుంటారు వీటిని తత్సిద్ధులైనవారు కూడ -

క్రోధం వల్ల ధర్మక్రియలకు లోపం కల్గుతుంది - క్రోధా విష్టుడైన వాడికి ఉచితానుచిత జ్ఞానం నశిస్తుంది - దానితో ధర్మభంగం ఏర్పడుతుంది - ధర్మభంగం ఎవరికీ కూడని పని - అందులో తపస్వికి అసలే కూడదు - క్రోధం మనస్సును ఉడికించి వేస్తుంది. క్రోధం వల్ల శారీరకంగా కూడ రక్తపుపోటు పెరుగుతుంది - శరీరం అట్టుడికినట్లు ఉడుకుతుంది - ఆరోగ్యభంగం ఏర్పడుతుంది -

అందుచే తపస్వికి క్షమ (సహనం) చాలా అవసరం. ఉత్తమరూపం కోరే వారు సహనం వహిస్తారు. క్షమలేనివాని తపస్సు పగిలినకుండలో నీళ్ళలాగా పటాపంచలయి పోతుంది - అట్లాగే మదించిన వాని సంపదా, అధర్మ వర్తి అయిన రాజు రాజ్యమూ నశిస్తాయి.

మొదటి పద్యం భావం మాత్రమే సంస్కృతంలో గోచరిస్తుంది - రెండవ పద్యానికి ఈ సందర్భంలో మూలం గోచరించదు - భారతంలోనే మరెచ్చట నయినా ఉండవచ్చు - నన్నయ ఆ భావాన్ని ఇక్కడ కూర్చడం కూడ సూక్తికి రుచిరార్థాన్ని సంతరించే ఉద్యమంలో ఒక భాగం - ఒక నీతిని పొడి పొడి మాటలతో చెప్పడం కంటె రసజ్ఞ మనోజ్ఞమైన పోలికను కూర్చి చెప్పితే మనస్సుకు హత్తుకుంటుంది - నన్నయ లోకజ్ఞతకు ఇదొక తార్కాణం.

కోపానికి సంబంధించే మరో ప్రసంగం నన్నయభారతంలో కన్పడుతుంది. శర్మిష్ఠ దేవయానిని నూతిలోకి త్రోసివేసి వెళ్ళిపోతుంది - దేవయాని యయాతివల్ల నూతిలోంచి వెలుపలకు వచ్చింది - తన్ను వెతుక్కుంటూ వచ్చిన ఘూర్ణికతో చెప్పి పంపింది - తాను వృషపర్వుని పురంలోకి రానని తండ్రికో చెప్పమంది - శుక్రుడు దేవయానిని ఓదార్చటానికి వచ్చాడు - దేవయాని కోపఘూర్ణిత అయిపోయింది -

అపుడు శుక్రుడు దేవయానిని ఓదారుస్తూ, కోపం మంచిది కాదంటాడు - ఈ రెండు పద్యాలూ చూడండి.

అనుపమ నియమాన్వితుఁడై
యనూన సమిధలఁ గ్రతుసహస్రంబులు సే
సినవానికంటె నక్రో
ధనుఁడు గరం బధికుఁ డండ్రు తత్త్వనిధిజ్ఞుల్ 1-3-146

అలిగిన వలుగక యెగ్గులు
పలికిన మఱి వినని యట్లు ప్రతివచనంబుల్
వలుకక సన్నెపు వసియెడఁ
కలఁగక యున్నతఁడ చూవె ధర్మజ్ఞుఁ డిలన్ 1-3-147

అధికనిష్ఠతో, భూరిదక్షిణతో వేలకొద్దీ యజ్ఞాలుచేసిన వారికంటె క్రోధంలేనివాడు అధికుడని తాత్త్వికులు చెప్తారు.

ఎదుటివాడు కోపపడినా తాను కోప్పడకుండా నిందించినా విననట్లు తిరిగి సమాధానం చెప్పకుండా, అవమానపడ్డా మనసులో పట్టించుకోకుండా ఉండేవాడే ధర్మజ్ఞుడు

క్రోధం ఉంటే యజ్ఞఫలాలు అన్నీ వశిస్తాయి- అందుచేత అక్రోధనుడు అధికుడని చెపుతున్నాడు మొదటిపద్యంలో -

సామాన్యంగా కోపం అంటురోగంవంటిది. ఎదుటివాడు తనమీద కోప్పడితే, అది అసంగతంగా తనకు అనిపిస్తే తనకుకూడ కోపంవస్తుంది. ఆ కోపాన్ని అదేసమయంలో అదుపుచేసుకోవాలి. అందుకే అలిగినా అలుగకూడదనడం - మౌనంవహించి తాపీగా ఆలోచిస్తే మంచిది. ఆ ఆలోచనకు తావివ్వాలంటే మళ్ళీ తాను ఎదుటివాడిని నిందింపకూడదు. స్తిమితంగా ఆలోచించాలి. అప్పటికి తాను అవమానాన్ని భరించే ఉంటాడుకదా! ఆ ఆలోచనలో దీనికి ప్రతీకారం ఆలోచించవద్దంటాడు - మరచిపోయేందుకే ప్రయత్నించాలి అంటాడు. అపుడే ఎదుటి వానికి పశ్చాత్తాపం కలిగేందుకు అవకాశం యిచ్చినవా డవుతాడు - ఎదుటివానికి పశ్చాత్తాపం కలిగితే ఒకవ్యక్తికి పునఃపరివర్తనం కలిగించగలిగాననే ఆత్మ సంతృప్తి

ఏర్పడుతుంది తనకు. ఆవేశం అణచుకొని స్తిమితపడినందువల్ల తనకు తృప్తి ఎదుటివానికి మనఃపరివర్తనం కలిగి ఉభయతారకం అవుతుంది. కావుననే అతడు ధర్మజ్ఞుడు. ఎదుటివాడు చేసినది తప్పనితెలిసి తాను మళ్ళీ అదే తప్పును గానీ అటు వంటి మరో తప్పునుగానీ చెయ్యడం వివేకుల లక్షణంకాదు. ఇతరులుచేసిన పని తనకు అప్రియంగాఉంటే ఆపనిని ఇతరులకు మళ్ళీ ఎన్నడూ చేయవద్దంటుంది భారతం.

ఒరులేయవి యొనరించిన
నరవర ! యప్రియము తన మనంబునకగుఁ దా
నొరుల కవి సేయకునికి యె
పరాయణము పరమధర్మ పథముల కెల్లన్

నేటికాలంలో మహాత్ముని మనస్తత్వానికి స్ఫూర్తినిచ్చిన యిటువంటి ఘట్టాలు భారతంలో ఎన్నో గోచరిస్తాయి.

ధర్మపూర్వకమయిన స్వభావాన్ని అలవరచుకోవాలంటే జ్ఞానం ఆవశ్యకం. జ్ఞానం కలవ్యక్తికి ఎన్నడూ కోపంరాదు. తేజస్సు సంక్రమిస్తుంది — ఇదే విషయాన్ని ఆరణ్యపర్వంలో ఒక ఎత్తుగీతిలో ఇట్లాచెపుతాడు నన్నయ.

ఎఱుక గల మహాత్ముఁడెఱుక యన్జలముల
నార్చుఁ గ్రోధమను మహానలంబుఁ
గ్రోధ వర్జితుండు గుఱుకొని తేజంబు
దాల్చు దేశకాల తత్త్వమెఱిఁగి 3-1-: 22

జ్ఞానియైన మహాత్ముడు జ్ఞానంఅనే నీటితో క్రోధంఅనే అగ్నిని ఆర్పివేస్తాడు - అక్రోధనుడు దేశకాల స్వభావాలు తెలిసికొని తేజోవంతుడవుతాడు.

క్రోధాన్ని క్షమతోకూడ తొలగించుకోవచ్చునుట. పాము కుబుసంవిడచి నట్లుగా క్రోధాన్ని విడవాలిట - అలాటే పురుష డనిపించుకుంటా డని సుందరకాండ చెపుతోంది. (55-7)

యస్సముత్పతితం క్రోధం క్షమ యైవ నిరస్యతి
య ో ర ర స్వచం జీర్ణాం స వై పురుష ఉచ్యతే సుందర 55-7

అందుకే అనుభవసారాన్ని కందంలో పిండిన సుమతి "తనకోపమె తన శత్రువు" అని రెండుముక్కల్లో తేల్చిచెప్పాడు. * * *

ఎంత శాంతులయ్యు నెంత జితేంద్రియు
లయ్యుఁగడు వివిక్త మయిన చోట
సతుల గోష్ఠిఁ జిత్త చలన మొందుదు రెందుఁ
గాము శక్తి నోర్వ గలరె జనులు. 1-3-38

ఎంత శాంతులయినా ఎంత జితేంద్రియులయినా ఏకాంత ప్రదేశంలో స్త్రీలతో సంభాషిస్తే వారికి మనస్సు చలిస్తుంది - ఎక్కడైనా మన్మథుని శక్తికి తట్టుకోలేరు జనులు -

తపస్వీ .తేజస్వీ అయిన పరాశర మహర్షి ఓడ నడుపుతున్న సత్యవతిని చూచి మదన పరవశుడయ్యాడు - ఓడ యెక్కి బయలుదేరాడు - వెడుతూ "ఆమె చూపుల సొగసు మెచ్చుకుంటున్నాడు - ఆమె చనుగవ స్పృశించాలను కుంటాడు - నడుము సోయగాన్ని ఊహించుకుంటున్నాడు - ఘన జఘనంమీద చూపునిలుపుతాడు తన అభిలాష తెలిసేటట్లు పలుకుతాడు - తిరిగి ఏమి వినిపిస్తుందో అని ఉవ్విళ్ళూరుతాడు - ఆమెపై పడి సిగ్గంతా పోగొట్టాలనుకుంటాడు- (ఇది సీసం లోని నాల్గు పాదాల సారాంశం ఎత్తుగీతి పైనుంది).

అపుడు కవి కల్పించుకొని వారికి పాఠకులకు మధ్యకు వచ్చి పాఠకులకు నీతి బోధిస్తున్నాడు - ఎన్నో అనుభవాలు కాచి వడబోసిన సారాంశం - కాముశక్తి అమోఘమైనదే - దీనివల్లనే లోకంలో ఎన్నో అనర్థాలు కలుగుతున్నాయి- గంధర్వ కాంత ఏకాంతంలో వలచివచ్చి పైబడి కౌగలించుకొని అధరమాసిస్తే "హాశ్రీహరీ" అని ఓరమోముతో బొమ్మని త్రోసివేసే ధైర్యంగల ప్రవరులు నూటికి కోటికి ఒక రుంటారో వుండరో అనుమానమే, కాముశక్తికి ఆధారభూతం వెలది. కావుననే సప్తవ్యసనాల్లో వెలది ప్రథమస్థానం పొందింది.

అయితే కథాసంబంధిగా ఇక్కడ ఒకటి గమనించాలి. భారతీయసంస్కృతి అంతా వ్యాసునిభిక్ష. వ్యాసుడే లేకపోతే భారతమే లేదు. మనసంస్కృతికి దర్పణమే లేదు - అటువంటివ్యాసుడు తన జననాన్నిగూర్చి చెప్పుకొన్న సంఘటన యిది. అయితే తల్లిదండ్రుల శృంగారాన్ని ఇంతగా వ్యాసుడు వర్ణించవచ్చునా అనవచ్చు.

నిజం - అందుకే ఇంతవివరంగా సంస్కృతభారతంలో వ్యాసుడు వ్రాయలేదు - అసలుచెప్పాలి - అసత్యం చెప్పరాదు - కనుక వాస్తవాన్ని ముక్తసరిగా చెప్పాడు. దాన్ని నన్నయ ఇంతగాపెంచాడు. కొంతమంది దీన్నిప్రక్షిప్తంఅన్నారుకూడ-నన్నయ వర్ణనకు ప్రాణమయిన సంయమనం ఇందులోలేదనీ, ఇది అనౌచిత్య స్ఫోరకమనీ, అందుచే ఇది నన్నయకృతంకాదనీ తరువాత వారి హస్తలాఘవంఅనీ వారివాదం.

ఏది ఏమయినా కామశక్తి బలవత్తరం - బలవత్తరంకాదు బలవత్తమం అనడం సత్యం. ఎంతనేర్చినా ఎంతజూచినా ఎంతవారలయినా కాంతదాసులే అన్న త్యాగరాజులవారిమాట అక్షరాలా నిజం అనిపిస్తుంది. అందుకే మనువు "బలవానింద్రియగ్రామో విద్వాంస మపికర్షతి" అని ఎలుగెత్తి చాటుతున్నాడు.

ఇక్కడ మరొకటిగూడా తెలియాలి. మహాత్ముల జన్మలు చిత్రరీతుల్లో సంభవిస్తాయి- ఎవరోఒకరు వారిజన్మలకు నిమిత్తమాత్రులుగ వ్యవహరిస్తారు. తాను నిమిత్తమాత్రుడ నని పరాశరమహర్షికి తెలియకపోదు. తెలిసి కావాలనే కామశక్తికి లోనయ్యాడనిపిస్తుంది. * * *

మొదలి పెక్కు జన్మములఁ బుణ్య కర్మముల్
పరగఁ బెక్కుసేసి పడయఁ బడిన
యట్టి యెఱుక జనుల కాక్షణ మాత్రన
చెఱుచు మద్యసేవ సేయనగునె 1-3-20

ఎన్నో పూర్వ జన్మల్లో చేసుకున్న పుణ్యకర్మల ఫలితమే జ్ఞానం - ఆ జ్ఞానాన్ని క్షణంలో నశింపజేస్తుంది మద్యం - అందుచేత మద్యసేవ చేయకూడదు.

దేవతల గురువు బృహస్పతి - అతడి కొడుకు కచుడు - అతడు రాక్షసుల గురువైన శుక్రాచార్యుని దగ్గర విద్యాభ్యాసం చేస్తున్నాడు-మృతసంజీవనికోసం-అందుచేత రాక్షసులు కోపించి కచుణ్ణి చంపివేశారు - శుక్రుడు కచుణ్ణి మృతసంజీవనీ విద్యతో బ్రతికించాడు - రాక్షసులు తెలుసుకున్నారు - ఈసారి ఇట్లాకాదని రాక్షసులు కచుణ్ణి చంపి బూడిద చేసి మద్యంలో కలిపి శుక్రుడికిచ్చి త్రాగించారు- కచుడు కన్పింపక పోవడంచేత దేవయాని పరితపించి తండ్రితో చెప్పింది - కచుణ్ణి బ్రతికించ మని బ్రతిమలాడింది - శుక్రుడు దివ్యదృష్టితో చూచాడు - బయట ప్రపంచంలో

ఎక్కడా కచుడు కన్పించలేదు. చివరకు తనకడుపులో బూడిదై ఉన్న కచుణ్ణి చూచాడు. కచుణ్ణి బ్రతికించి కచుడికి మృతసంజీవని ఉపదేశించాడు - ఉదరంచీల్చుకొని వచ్చి తన్ను మరల బ్రతికించమన్నాడు శుక్రుడు కచుడితో - కచుడు అట్లాగే చేశాడు.

మద్యం వల్ల ఈదోషం ఏర్పడింది అని తెలుసుకున్నాడు శుక్రుడు - మానవులెవరూ మద్యపానం చేయరాదని శాసించాడు - మద్యపాననష్టాలు చాలా ఉన్నాయి. అందులో జ్ఞాననాశనం ప్రధానమయింది. పశువునుండి మానవుణ్ణి వేరు చేసేది జ్ఞానం - ఆ జ్ఞానం నశిస్తే మనిషి పశుతుల్యు డవుతాడని వేరుగా చెప్ప నక్కరలేదు- * * *

కడు నను రక్తియు నేర్పును
గడఁకయుఁ గలవారి నుడిక కడవఁగ నెగ్గుల్
నొడివెడు వివేక శూన్యుల
కడ నుండెడు నంతకంటెఁ గష్టము కలదే 1-3-149

తమమీద అనురాగం ఉండి, నేర్పూ, ఉత్సాహమూ కలవాళ్ళకు కష్టం కలిగేటట్లు మాట్లాడే అవివేకుల దగ్గర ఉండటంకంటె కష్టమైన పని ఏదీలేదు.

క్రోధం మంచిది కాదని దేవయానిని శుక్రుడు సాంత్వనవచనాలు పల్కి- ఇంటికి వెడదాం రమ్మంటాడు. వృషపర్వుని పురంలోకి నేను రానంటూ దేవయాని పైవిధంగా చెపుతుంది. దేవయాని పరాభవాన్ని పొందింది. మనస్సు పరాభవాగ్నితో దహించుకు పోతోంది. అయినా ఒక సత్యాన్ని ప్రపంచించింది.

వృషపర్వుడు అవివేకి అనీ, అతని కొలువుచెయ్యడం చాలా కష్టమనీ దేవయాని అభిప్రాయం నిజమే. అవివేకులూ, అవినీతులూ, అసమర్థులూ అయిన అధికారుల్ని నేడూ చూడవచ్చు. తమను గౌరవించి ప్రేమతోచూచే వారిపైనే వాళ్ళు విరుచుకు పడతారు- అది వారి అవివేకానికి చిహ్నం- దానికి కారణం ఆత్మప్రత్యయం లేకపోవడం. ఆత్మప్రత్యయం లేనివాని మనస్సు అవ్యవస్థితంగా ఉంటుంది. అవినీతీ, అసమర్థతా దానికి తోడైతే ఇక చెప్పనక్కరలేదు. "అవ్యవస్థిత చిత్తానాం ప్రసాదోఽపి భయంకరః" అవ్యవస్థితమైన మనస్సుకలవారి అనుగ్రహంకూడా భయంకరమే. నిగ్రహం ఇంక వేరే చెప్పాలా? అటువంటివారితో కాలక్షేపం చెయ్యడం

అసిధారావ్రతమే. యౌవనం, ధనాధిక్యం, అధికారం, అవివేకం వీటిలో ఏ ఒక్కటి అయినా అనర్థాలను కల్గించగలవని పెద్దలు చెప్పనేచెప్పారు. * * *

తగిలి జరయు రుజయు దైవవశంబున
నయ్యెనేని వాని ననుభవింత్రు
గాక? యెఱిఁగి యెఱిఁగి కడఁగి యారెంటిఁజే
కొందురయ్య! యెట్టి కుమతులయిన ? 1-3-193

నరలు గల కాముఁనైనను
దరుణులు రోయుదురు డాయ; ధనపతి యయ్యుం
బురుషుఁడు దుర్వార జరా
పరభూతి నభీష్ట భోగ బాహ్యుఁడ కాఁడే !

ముసలితనం కానీ, రోగంకానీ దైవవశాత్తు వస్తే మనుష్యులు అనుభవిస్తారుకానీ, కావాలని బుద్ధిపూర్వకంగా స్వీకరిస్తారా! ఎంత తెలివి తక్కువ వాళ్ళయినా ?

జుట్టునెరిస్తే వాడు మన్మథుడయినా యువతులు దగ్గరకు చేరేందుకు కూడా అసహ్యించుకుంటారు - ఎంతడబ్బున్న కుబేరుడయినా వార్థకంలో ఇష్టమయిన భోగాలు అనుభవించలేడు కదా !

తన ముసలితనం పుచ్చుకొని వాళ్ళయౌవనం ఇమ్మని కొడుకుల్ని యయాతి అడుగుతాడు - అపుడు పెద్దవాళ్ళ యదుడు, తుర్వసుడు, ద్రుహ్యుడు, అనుడు అనేనల్గురూ ఈవిషయం చెపుతారు.

ముసలితనం మానవుడికి శాపంవంటిది. దీన్నిఎవరూ తప్పించుకోలేరు - అయినా ఇది ఎప్పుడో జీవిత చరమదశలో అనుభవించవలసినది. దాన్ని జీవితం మొదటిదశలోనే అనుభవించాలనుకోవడం తెలివితక్కువ అంటారు ఈనలుగురునూ -

తనయుండు తల్లిదండ్రులు
పనిచిన పని సేయఁడేని పలుకెడలోఁజే
కొనఁడేని వాఁడు తనయుం
డనఁబడునే పితృధనమున కర్హుండగునే 1-3-199

తల్లిదండ్రులు చెప్పినపని కొడుకు చేయకపోయినా, వారిమాట మనసులో పట్టించు కోకపోయినా వాడు కొడుకు అనిపించుకోడు. తండ్రి ఆస్తికి అర్హుడు కాడు.

యయాతికి అయిదుగురు కొడుకులు. యదుడు, తుర్వసుడు, ద్రుహ్యుడు, అనుడు, పూరుడు. యయాతికి శుక్రశాపంవల్ల ముసలితనం వచ్చింది. అతనికింకా విషయవాంఛలు తీరలేదు. అందుచేత తన ముసలితనాన్ని పుచ్చుకొని వారియౌవనం ఇమ్మని యయాతి కొడుకుల్ని అడిగాడు. పైవారందరూ తిరస్కరించారు. చిన్నవాడు పూరుడు ఒప్పుకున్నాడు. వానియౌవనం పుచ్చుకొని యయాతి విషయతృప్తి చెందాడు. మళ్ళీ వానియౌవనం వానికిచ్చి తన ముసలితనం తాను తీసుకున్నాడు యయాతి. అంచేత యయాతి పూరునికి రాజ్యాభిషేకంచేశాడు. "పెద్దవాడుండగా చిన్న వాడికి పట్టాభిషేకం చెయ్యడం ధర్మమా ?" అనిప్రజలు యయాతిని అడుగుతారు. దానికిది సమాధానం.

మానవుడికి మాతాపితృసేవ అవశ్యాచరణీయం - ఉపనిషత్తులు సయితం "మాతృదేవోభవ, పితృదేవోభవ" అని ఉపదేశిస్తున్నాయి. ఒకసారిపోతే మళ్ళీ కూడ దీసుకోలేనివి మూడు. కాలం—తల్లి—తండ్రి. అందుచేత వీరిపట్ల మానవుడు భక్తి శ్రద్ధా సమన్వితుడు కావాలి - కాలాన్ని వృథాచేయ రాదు. తల్లిదండ్రుల వాక్యాన్ని ఆదరించి ఆచరించాలి. పితృవాక్య పరిపాలనం తనయునిధర్మం - ఆ ధర్మాన్ని ఆచ రించే పరశురాముడు, రాముడూ, భీష్ముడూ ఉత్తమమైన కీర్తిప్రతిష్ఠలు సంపాదించు కొన్నారు. మానవజాతికి ఆదర్శప్రాయులుగా నిలిచారు. పితృవాక్య పరిపాలనం వల్లనే పుత్రుడు పుత్రత్వాన్ని పొందుతాడట.

జీవతో వాక్యకరణాత్ ప్రత్యబ్దం భూరి భోజనా త్
గయాయాం పిండదానాచ్చ తస్మాత్పుత్రస్య పుత్రతా.

తల్లిదండ్రులు జీవించిఉన్నపుడు వారిమాటలు అమలుపరచడం వల్లనూ, చనిపోయిన తర్వాత ప్రతిసంవత్సరము ఆబ్దికరూపంలో మృష్టాన్నం పెట్టడంవల్లనూ, గయలో పిండప్రదానం చేయడంవల్లనూ పుత్రునికి పుత్రత్వం సంక్రమిస్తుంది. ఈ విధమైన ప్రవర్తనవల్ల అదృష్టపూర్వమయిన శుభాలు చేకూరుతాయి.

లోకంలో నిర్వ్యాజమైన హితులు ముగ్గురు. తల్లి తండ్రి స్నేహితుడు మిగిలినవారంతా ప్రయోజనాన్నపేక్షించి హితులవుతారు. అందుచేత తల్లిదండ్రుల

మాట జవదాటరానిది. అది ఎంత కఠినమైనదయినా చివరకు శుభప్రదమవుతుందని ఈ యయాతి పూరులచరిత్రమే సాక్ష్యమిస్తుంది. "న పుత్రాత్పరమో లాభః" పుత్రుణ్ణి మించినలాభం లేదనడం కూడ ఇటువంటి పితృవాక్యపరిపాలకుడయిన పుత్రుణ్ణి దృష్టిలో పెట్టుకొనే-

మమ జ్యేష్ఠేన యదునా నియోగో నానుపాలితః
ప్రతికూలః పితుర్యశ్చ న సపుత్రః సతాంమతః ॥ 1-85-24

"నా పెద్దకొడుకు నామాట వినలేదు. తండ్రికి వ్యతిరేకి అయినపుత్రుడు పుత్రుడుకాడు" అని కథాభాగంతో అతుక్కుపోయింది సంస్కృతంలో. దీన్ని నన్నయ తెలుగులో కథలోనుండి విడగీసి ఒకసూక్తిగా సంయోజనంచేసి సార్వకాలికమూ విశ్వజనీనమూ చేసినాడు. * * *

ఎఱుక గల వారి చరితలు
గఱచుచు సజ్జనుల గోష్ఠిఁ గదలక ధర్మం
బెఱుగుచు నెఱిఁగిన దానిని
మఱవక నుష్ఠించునది సమంజస బుద్ధిన్ 1-3-203

జ్ఞానుల చరిత్రలు తెలుసుకుంటూ, సర్వదా సజ్జన సాంగత్యంలో దీక్షగా ధర్మం గ్రహిస్తూ, గ్రహించిన ధర్మాన్ని మరవకుండా సమంజసబుద్ధితో ఆచరించాలి

యయాతి పూరుడికి పట్టాభిషేకం చేసేముందు బోధించిననీతుల్లో మొదటి దిది - రాజ్యాభిషేకం పొందే వానికే కాదు. అందరకూ ఈనియమం ఆచరణీయమే.

జ్ఞానుల చరిత్రలు మానవుల్ని ఉత్సాహపూరితుల్నిచేసి సన్మార్గంలో పెడతాయి. మహాపురుష సంశ్రయం అభిలషింపదగింది. ఇది అందరికీ లభించదు. లభిస్తే విడువతానిది. వారిగోష్ఠిలో ధర్మాలు, ధర్మసూక్ష్మాలూ తెలుసుకొనే అవకాశం కలుగుతుంది. రెండుధర్మాలకు పరస్పర విరోధం ఏర్పడినప్పుడు ధర్మసూక్ష్మం గ్రహించాలి. ఆ ధర్మసూక్ష్మం మహాపురుషసంశ్రయం వల్ల సమకూరుతుంది.

సంసారమనే విషవృక్షానికి అమృతతుల్యములైన ఫలాలు రెండున్నాయి. కావ్యామృత రసపానం, సజ్జనసల్లాపము. సజ్జన సల్లాపంవల్ల ధర్మాచరణబుద్ధి ఏర్పడుతుంది. ఆ ధర్మాచరణానికి దేశకాలాలు కాని దేహధర్మాలుకాని ఆటంకం

కాకూడదు - అందుచేత సత్కార్యాచరణాన్ని వాయిదా వేయకూడదు - రేపటికి బ్రతుకు ఉంటుందో ఉండదో - అందుచేత సద్ధర్మాచరణ విషయంలో ("శ్వః కార్య మద్య కుర్వీత") రేపటిపని యీరోజే చెయ్యాలిట- ఈబుద్ధి మానవుణ్ణి క్రియాశీలిగా క్రియాశూరుడుగా చేస్తుంది. సోమరితనాన్ని పారద్రోలి ప్రగతిశీలుడుగా చేస్తుంది. *

ఇచ్చునది పాత్రునకు ధర
మచ్చుగ నొరు వేడకుండునది యభిముఖులై
వచ్చిన యాచకుల వృథ
పుచ్చక చేయునది సర్వభూతప్రీతిన్. 1-3-204

అర్హుడైన వానికే ధనం దానం చెయ్యాలి - ఇతరుల్ని ఎన్నడూ యాచింపకూడదు — తన్ను యాచింపవచ్చిన వాళ్ళని వట్టి చేతులతో పంపరాదు - సర్వ భూత ప్రీతి చేస్తూ ఉండాలి.

పాత్ర మెరిగి దానం చెయ్యాలి - క్షేత్ర మెరిగి విత్తనం చల్లాలి - ధానం యోగ్యుడికే చెయ్యాలి - "ఇచ్చు చోట పాత్ర మెఱుగ వలయు" నని శాంతి పర్వం కూడ చెపుతోంది. అపాత్రులకు ఇవ్వటంకూడ దోషమే - అట్లాగే పాత్రు లయిన వారికి ఇవ్వక పోవడమూ తప్పే - పాత్రత అంటే ? శీలమూ, కులమూ, శమమూ, దమమూ, చెల్వమూ, లేఖ్రాయమూ పాత్రతకు లక్షణాలని అల్లసానివారు చెపుతారు—

అయితే ఇచ్చే ధనం న్యాయార్జిత మైనది కావాలి - అన్యాయార్జిత మైన విత్తం కోట్లకొలదీ దానంచేసినా ఫలితంలేదు - అసలీ దాన గుణం సహజంగా సంక్రమించే గుణం అంటారు —

ఈ దానంలో ఒక మూలసూత్రం ఇమిడి ఉంది - మమకారం బంధ హేతువు. నిర్మమత్వం మోక్ష హేతువు - ఈ దానంతో మమకారం పోతుంది - నాది అనుకొనే వస్తువును ఇతరులకు ఇవ్వడం జరుగుతోంది - పైగా ఇచ్చేటప్పుడు "తుభ్య మహం సంప్రదదే - న మమ" "నీకు నేను ఇస్తున్నాను - ఇందులో నాకు ఏమీ స్వత్వం లేదు" అంటూ ఇస్తున్నాము - అనగా 'మమ' కారాన్ని విడిచి పెడుతున్నట్లు —

దానం చేసే తీరులో అహంకార త్యాగం కూడా ఇమిడి ఉంది - చేసే దానం శ్రద్ధతో చెయ్యాలి. ప్రీతిగా, హితంగా మాట్లాడుతూ చెయ్యాలి - అశ్రద్ధగా ఎన్నడూ చేయరాదు - శక్తికి లోపం లేకుండా దానం చెయ్యాలి - 'ఇంతకంటె ఇవ్వ లేక పోతున్నాను' అని సిగ్గుపడుతూ దానం చెయ్యాలి - అంతే కాదు - భయపడుతూ దానం చెయ్యాలి. ఈ శరీరం క్షణభంగురం - రేపటి ఉనికి అనుమానం - కనుక భయపడుతూ దానం చెయ్యాలి - అనగా వాయిదా పడనీయకుండా వెంటనే చెయ్యాలి- వాయిదాపడితే ఏ విఘాతం కల్గుతుందో అని భయపడుతూ వెంటనే చెయ్యాలి - ఈ భావం అంతా తెలిసి జ్ఞానంతో చెయ్యాలి - ఈ భావం అంతా ఉపనిషత్తులో శాసింప బడింది —

శ్రద్ధయా దేయమ్; అశ్రద్ధయాఽదేయమ్
శ్రియా దేయమ్; హ్రియా దేయమ్
భియా దేయమ్; సంవిదా దేయమ్.

ఈ భావంలో మమకార త్యాగమే కాకుండా అహంకార నిరాసం కూడ తొంగి చూస్తుంది - (నేనెంతవాడిని దానం చెయ్యటానికి అనే భావం) అహంకార మమకారాలు రెండూ అంతరిస్తేనే కాని ముక్తి సాధ్యంకాదు. అనగా ముక్తి సౌధానికి ఈ దానగుణం సోపానప్రాయ మన్నమాట —

'మమ' కార త్యాగాన్ని గూర్చి రెండు మాటలు - ఈ దానాలు చాలా ఉన్నాయి - అన్ని దానాల్లోకి అన్నదానం గొప్పదని ఒక సూక్తి - మిగతా దానాలతో మనిషిని తృప్తిపరచులేము - అన్నదానంతో తృప్తి పరచినట్లుగా. భూదానం గొప్ప దని మరోసూక్తి - ఇట్లా ఏ దానానికి దానికే ప్రత్యేకత ప్రాధాన్యమూ చెప్పబడ్డాయి వీటన్నిటిలోనూ మమకార త్యాగం ఉంది - కాని రెండు దానాల్లో మాత్రం మమకారం పూర్తిగా పోదు - ఒకటి కన్యాదానం - రెండవది జ్ఞానదానం - కన్యాదానం చేసే టప్పుడు "సాలంకృత కన్యాదాన మహం కరిష్యే" (సాలంకృత యైన కన్యను దానం చేస్తున్నాను) అని మాత్రమే అంటారు - న మమ అని అనరు - దీనిలో ఒక మహా ర్థం ఉంది - దానం చేసే కన్యతో సంబంధం ఆనాటితో తీరిపోదు కన్యాదాతకు - రాక పోకలూ, గౌరవమర్యాదలూ, ఇచ్చిపుచ్చుకోవడాలూ ఆ కన్యతో తరువాతి తర తరా లుగా సాగాలనే భావన కన్యాదానంలో తొణికిస లాడుతుంది. అంతేకాదు- ఆ దుహిత యొక్క కొడుకు-దౌహిత్రుడు - (అనగా ఆమెకు పుట్టేకొడుకు). కొడుకుతో సమా

నుడు - మాతామహుని ఉత్తమ గతికి దౌహిత్రుడు కూడ తోడ్పడుతాడు - అతడిచే తిలోదకాలు మాతామహునికి ఉత్తమలోక ప్రాప్తి కల్గిస్తాయి - ఆ (కొడుకుతో) దౌహిత్రునితో కన్యాదాతకు చక్కని సంబంధం పారలౌకిక మయింది - అందుచేత ఇందులో పూర్తి మమకార త్యాగం గోచరించదు - రెండవది జ్ఞానదానం "సుజ్ఞాన మెల్లభంగి సాధ్య తమము" అని శాంతి పర్వం ఉద్ఘోషిస్తోంది - ఈ జ్ఞానదానంలో కూడ 'నా' అనే స్వత్వం పోదు - మరే దానమయినా చేస్తే ఇక కర్త దగ్గర ఏమీ మిగలదు - కాని జ్ఞానం దానం చేసినా వ్యయం కాదు - పైగా వృద్ధి పొందుతుంది - ఒక దీపం నుండి మరో దీపం వెలిగించినట్లు - రెండోదీపం వెలిగితే మొదటిదీపం కాంతి ద్విగుణీకృత మవుతుందే కాని తరిగిపోదు - అందుకే భర్తృహరి వ్యయేకృతే వర్ధత ఏవ నిత్యం" అన్నాడు —

ఈ రెండు దానాలూ తప్ప మిగిలిన దానాలన్నిటిలోను మమకారత్యాగం కన్పిస్తుంది —

ఇక రెండవ అంశం - అడిగిన వారికి నిరాశ కల్గించకుండా సర్వభూత ప్రీతి చెయ్యాలి - "శత్రువునకు నయిన నిచ్చుటయ లెస్స" అని విదురనీతి చెపుతోంది- అంతేకాదు ఇచ్చిన తరువాత బాధపడకూడదు - మొదట ఏదో ఆరంభ శూరతతో ఇచ్చి తర్వాత తనకు లేకుండా పోయింది అని వాపోవడం మంచిదికాదు - "ఇచ్చి వగవ కునికి" .... నడవడికి ఒప్పుసేయు నని విదురుడు సెలవిస్తాడు.

ఈ దాన గుణంలో శిబి, దధీచి, బలి, కర్ణుడు - మొదలయిన వారు పేర్కొన దగినవారు - ఇచ్చేవాని చేయి పైని, పుచ్చుకొనేవాని చెయ్యి క్రిందనూ ఉంటుంది ఇచ్చేటప్పుడు - దాన్నిబట్టి దాతకు గౌరవమూ గ్రహీతకు చులకనదనమూ సంక్రమిస్తాయి - అందుకే బలిచక్రవర్తి దగ్గరకు దానం కోసం వెడదామనుకున్న విష్ణువునకు చిన్నతనం (వామనత్వం) సంక్రమించింది. ఇక్కడ మరొకటి కూడా గ్రహించాలి - ఉత్తములనుండి దానం గ్రహించితే ఆ ధనం పవిత్రమైన దైతే ప్రతి గ్రహీతను ఉన్నతుణ్ణి చేస్తుంది - అందుకే వామనత్వంతో వచ్చిన విష్ణుమూర్తి బలి చక్రవర్తి దానాన్ని గ్రహించి త్రివిక్రముడయ్యాడు - బ్రహ్మాండాంత సంవర్ధియైనాడు—

మనమునకుఁ బ్రియంబును హిత
మును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం

బును పరిమితమును నగు పలు
కొనరంగఁ బలుకునది ధర్మయుతముగ సభలన్ 1-3-205

మనస్సుకు ప్రియంగానూ, హితంగానూ, రుచికరంగానూ, నిజంగానూ, అకుంఠితంగానూ, మధురంగానూ, పరిమితంగానూ ఉండే మాటలే మాట్లాడాలి సభలో. ఈమాటలన్నీ ధర్మయుతంగాకూడా ఉండాలి.

ఈ ఉపదేశం యయాతి పూరుడికి చేసినది. అయినా లోకంఅంతా యయాతి కళ్ళముందు నిలిచినట్లు తోస్తుంది. యావత్ప్రపంచానికి సమన్వయించే సూక్తి -

సభలో అందరికీ ప్రియంగా మాట్లాడాలి. ప్రీతికరంగా ఉండాలి మాట్లాడే తీరు - ప్రియంగా మాట్లాడేవాడికి శత్రువులుండరు. "కః పరః ప్రియవాదినామ్" - మాటల్లో హితమూ పథ్యతా గోచరించాలి - హితము ఆపాత రమణీయం. పథ్యం పర్యంతరమణీయం - అంటే పైకి ఎదుటివానికి ఇష్టంగానూ ఉండాలి. చివరకు మేలు చేకూర్చేదిగానూ ఉండాలి. తరువాత తథ్యమూ అమోఘమూ కావాలి పలుకులు - అంటే వాస్తవంకావాలి. నిజంకావాలి.అంతకంటె అమోఘంకావాలి. వ్యర్థంకాకూడదు. శక్తివంతమై యుండాలి. తిరుగులేనిదై యుండాలి. ఇంకా మధురమై పరిమితమై యుండాలి - చివరకు ఈ గుణాలన్నీ ధర్మసహితాలు కావాలి.

సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
నబ్రూయాత్ సత్యమప్రియం
ప్రియంచ నానృతం బ్రూయాత్
ఏషధర్మః సనాతనః

అన్న ఆర్షసూక్తిలోని ఆంతర్యంకూడ యిదే. వీనిఅన్నిటికీ విశేషణం ర్మయుతం అనడం - పలికేపలుకులో అధర్మానికి తావివ్వరాదు. ఈలక్షణాలలో రిమితత్వం" నన్నయకు చాల ఇష్టమనిపిస్తుంది. 'మితహిత సత్యవాక్య' అని జనమే యుణ్ణి సంబోధిస్తాడు. నన్నయ వర్ణనల్లోకూడ సంయమనం గోచరిస్తుంది. ఇది రిమితత్వం యొక్క పారమ్యం - వాక్కులతో వాగ్మికావాలి కాని వాచాలుడు రాదు. మరోగుణం మాధుర్యం. ఇదే ఒకకోణంలోంచి చూస్తే "స్మితపూర్వాభి షిత్వం". రాముడు స్మితపూర్వాభిభాషి - పారుష్యం ఎన్నడూ వాక్కులకు నీయడు.

కృష్ణునిగూర్చి పరుషంగా మాట్లాడుతున్న శిశుపాలుడితో ధర్మరాజు అంటాడు.

భూరిగుణోన్నతు లనఁదగు
వారికి ధీరులగు ధరణి వల్లభులకు వా
క్పారుష్యము చన్నె ! మహా
దారుణ మది విషముకంటె దహనము కంటెన్ 2-2-17

సద్గుణవంతులూ, ధీరులూ అయిన రాజులకు వాక్పారుష్యం పనికిరాదు. అది విషంకన్నా అగ్నికన్నా దారుణమయింది.

"పారుష్యంచ నిరర్థకమ్" అని మాత్రమే సంస్కృతంలో ముక్తసరిగా చెప్పబడింది. దాన్ని నన్నయ రుచిరార్థయుక్తం చేశాడు. సందర్భాన్నిబట్టి 'రాజులకు' అన్నాడు కాని వాక్పారుష్యం ఎవరికీ తగనిదే. విషమయితే తిన్నవాడినే చంపుతుంది. అగ్ని తానెవరిని ఆశ్రయిస్తే వాళ్ళనే కాలుస్తుంది, తత్కాలంలోనే కాలుస్తుంది. కాని వాక్పారుష్యం ఈ రెండింటికంటె చాలా దారుణమయింది. వాక్పారుష్యం చాలామందిని దహిస్తుంది. వేర్వేరుకాలాల్లో దాని కర్మకాండ కొనసాగుతుంది. ద్రుపదుని గర్వ సహితమైన వాక్పారుష్యం ద్రోణునిమీద ప్రయోగించబడింది. అది తరువాతి తరం వారిని కూడా కాల్చివేసింది.

అందుకే "వెలది, జూదంబు, పానంబు, వేట, పలుకు ప్రల్లదనము. ....

అని వాక్పారుష్యాన్ని సప్తవ్యసనాల్లో ఒకటిగా పరిగణించటం జరిగింది. "నోరు మంచిదయితే ఊరు మంచిది" అన్న సామెతకుకూడా ఈభావమే మూలం— * *

మదముఁ గామంబుఁ గ్రోధంబు మత్సరంబు
లోభమును మోహమును నను లోని సహజ
వైరి వర్గంబు నోడిచిన వాఁడ యొడుచు
నశ్రమంబున వెలుపలి యహిత తతుల 1-3-206

కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు అంతశ్శత్రువులు. వీనినే అరిషడ్వర్గం అంటారు. వీనిని జయించినవాడే తేలికగా వెలుపలి శత్రువుల్నికూడ జయిస్తాడు.

యయాతి పూరుడికి చెప్పిన చివరి నీతి యిది. ఇతరులకు మర్మచ్ఛేదకా లయిన మాటలు మాట్లాడే దుర్జనుల్ని చేరనీయరాదు. కరుణ, ఆర్జవం, జూదమాడక పోవడం, సత్యం, శమం, శౌచం అనేవి మనసులో కుదుర్చుకోవాలి. కామాదులు శత్రువులు. విసర్జింపదగినవి. కరుణ మొదలయినవి మిత్రములు— కోరదగినవి.

ముందు లోపలి శత్రువుల్నిగెలిస్తే బయటి శత్రువుల్ని తర్వాత తేలికగా గెలువవచ్చు - ఈశత్రువులు ఇంద్రియాల్ని వశంచేసుకుంటాయి. "బలవా నింద్రియ గ్రామో విద్వాంస మపికర్షతి" అన్న మనస్మృతిలోని అంతరార్థం ఇదే. ఈ అరిషడ్వర్గాలకు లోనుకాని వాడే నిష్కల్మషుడుగా ప్రవర్తించగలడు. అందుకే దీన్నిబట్టి "ఇంటగెలిచి రచ్చగెలువుము" అనేసూక్తి ఏర్పడింది తెలుగులో - వైయక్తికంగా కాకుండా సాంఘికంగా పరిశీలించినా బహిశ్శత్రువులకన్న అంతశ్శత్రువులే ప్రమాదకారకులన్న విషయం సంఘంలో బ్రతికే అందరికీ తెలిసిన సత్యమే.

అరిషడ్వర్గాలకు "కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యా"లని ఒక క్రమముంది. నన్నయ ఈ క్రమాన్ని మార్చివేశాడు. మదాన్ని మొదటచెప్పాడు. దీనికి కారణం లేకపోదు - తేటగీతిలో ఇమడ్చడంకోసం క్రమం మార్చలేదు. ఒక ఔచిత్యాన్ని దృష్టిలో పెట్టుకొనే మార్చాడు.

ఈ చెపుతున్నది యయాతి. ఇప్పటి యయాతికి కామవాంఛలన్నీ తీరాయి. యౌవనం పూరుడికి తిరిగి యిచ్చేశాడు. దీనితర్వాత తాను ఎంతో తపస్సుచేసి బ్రహ్మలోకానికి వెళ్ళి మళ్ళీ తిరిగి యింద్రలోకానికి వచ్చాడు - "పూరునికి పట్టాభిషేక సమయంలో ఏమేమి నీతులు చెప్పావు?" అని యింద్రుడు యయాతి నడిగితే "ఇవిగో ఈనీతులు చెప్పా"నని చెప్పాడు. వెంటనే ఇంద్రుడు"నీతపస్సు చాలా మహిమాన్వితమైంది. ఇన్నివేల సంవత్సరాలు పుణ్యలోకాలు అనుభవించావంటే నీ తపస్సు సామాన్యమైనదికాదు" అన్నాడు. దానితో యయాతికి గర్వం ఏర్పడింది. "దుష్కరమైన నాతపస్సుతో దేవతల, రాక్షసుల మహర్షుల తపస్సులేవీ సరిపోల వన్నాడు. ఆ గర్వవాక్కుకు ఇంద్రుడు "తపోభిమానంతో మహర్షుల తపస్సు నవమానించి మాట్లాడావు. ఇంతగర్వమా! దీనితో నీపుణ్యం పూర్తిఅయింది. సమాప్తంఅయింది. ఇక భూలోకానికి వెళ్ళు" అన్నాడు. అంటే ఏవిషయంలోనూ గర్వమూ, మదమూ పనికిరా వన్న మాట. యయాతియే తర్వాత పశ్చాత్తాపంతో "అల్పమయ్యె గర్వమున బహుకాల సంచిత తపఃఫలహాని యొనర్పకుండునే" (గర్వం మదం కొంచెమేఅయినా

చాలాకాలంగా కూడబెట్టిన తపస్సుయొక్క ఫలితాన్నంతనూ హరించివేస్తుంది) అనుకుంటాడు. యయాతికి తర్వాత జరుగబోయే శాపపాతానికి కారణం మదం. ఆ విషయాన్ని ముందుగానే నన్నయ సూచించాడు. మదానికి ప్రథమతాంబూలం యిచ్చి-చెప్పేసూక్తితో కథకుకూడ స్ఫూర్తినివ్వడం కథాసూచన చేయడం నన్నయ రుచిరార్థాలలో ఒకటిగా కీర్తింపదగింది * * *

సర్వభూత దయకు సత్యవాక్యమునకు
నుత్తమంబు ధర్మ మొండెఱుంగ
నొరుల నొప్పికోడ కుపతాప మొనరించు
నదియ కడు నధర్మ మనిరి బుధులు 1-3-219

సర్వప్రాణుల మీదా దయకలిగి ఉండటం, సత్యాన్నే పలకడం ఈరెంటికీ మించిన ధర్మంలేదు. ఇతరుల బాధకు వెనుకాడకుండా హింసించడమే మిక్కిలి అధర్మం అన్నారు పండితులు.

సద్భువనానికి వచ్చిన యయాతికి అష్టకాదు లయిన తనపనుమలు కనిపించారు - వారితో తనగోడు వెళ్ళబోసుకొని పశ్చాత్తాపపడ్డాడు యయాతి. దానితో అతనిగర్వం పోయింది. ఇపుడు మళ్ళీ అష్టకాదులు చాలా విశేషాలు అడిగారు. వాటన్నిటినీ చెప్తూ ధర్మసర్వస్వం చెప్పినట్లు ధర్మాధర్మాలను సూక్ష్మంగా రెండుముక్కల్లో తేల్చిచెప్పాడు. భూతదయ, సత్యం ఈ రెండింటినీ మించిన ధర్మంలేదు. హింసను మించిన అధర్మంలేదు అన్నాడు.

పూరుడికి యయాతిచెప్పిన నీతులలో ఇదిలేదు. యయాతి తనకు గర్వప్రక్షాళనం అయినతర్వాత చెప్పాడు ఈనీతి - ఇది ధర్మసర్వస్వం - సకల నీతులకూ సారభూత మైనది. సర్వధర్మాల సమాహారం ఇది. గర్వం నశించిన యయాతిచేత ఈ ధర్మసర్వస్వం చెప్పించడంలో నన్నయ లోకజ్ఞత, పత్యమధురాధిపావాక్యత్వమూ ప్రస్ఫుట మౌతాయి. నన్నయనే ఎందుకు పేర్కొనవలసి వచ్చిందంటే దీనికి సరి అయిన సంస్కృతమూలం కన్పడదు గనుక-

ఇక్కడ ధర్మాన్ని గూర్చి, ధర్మసూక్ష్మాన్ని గూర్చి కొద్దిగా ప్రస్తావించాలి. ధర్మం అంటేఏమిటి? ధర్మాన్ని ఎట్లా గ్రహించాలి? రెండుధర్మాలకు విరోధం ఏర్పడినపుడు ధర్మసూక్ష్మాన్ని ఎట్లా గ్రహించాలి - వీటినిగూర్చి యోచిద్దాం -

ధర్మలక్షణం చెపుతూ భారతం అది మూడువిధాలని చెపుతోంది. ధర్మాన్ని మూడు కోణాలనుండి గ్రహించాలంటుంది. అవి ఏవంటే

వేదోక్తః పరమోధర్మః ధర్మశాస్త్రేషు చాపరః
శిష్టాచారశ్చ శిష్టానాం త్రివిధం ధర్మలక్షణమ్.

ఆరణ్యపర్వ - 206_83

ధర్మానికి మూలం వేదం - దానిలో చెప్పినదేదో అది ఉత్తమము. మొదటిస్థానం దానిది. రెండవది ధర్మశాస్త్రం - మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి - పరాశరస్మృతి మొ॥ ధర్మశాస్త్రాలు రెండోమార్గం - మూడోది శిష్టాచారం. పెద్దలూ, పూర్వులూ అనుసరిస్తున్న మార్గంఇది. వేదంలోకాని ధర్మశాస్త్రంలోకాని చెప్పబడక పోతే అటువంటి ధర్మాన్ని శిష్టాచారంవల్ల తెలుసుకోవాలి.

ధర్మలక్షణం మూడు విధాలని భారతం చెపుతూంటే నాల్గు విధాలని మనుస్మృతి చెపుతోంది -

వేదః స్మృతిః సదాచారః స్వస్యచ ప్రియమాత్మనః
ఏ త చ్చతుర్విధం ప్రాహుః సాక్షా ద్ధర్మస్య లక్షణమ్.
మను - 2-12 శ్లో.

వేదమూ, స్మృతీ, సదాచారమూ మాత్రమే కాక ఆత్మ హితం - (అదే అంతఃకరణం) అని నాల్గవదాన్ని చేర్చాడు మనువు - ఇది సందేహమూ, విరోధమూ ఏర్పడినపుడు సామాన్యంగా సజ్జనులు ఆలోచించి ఆచరించే విధానం - కావుననే కాళిదాసు

సతాంహి సందేహ పదేషు వస్తుషు
ప్రమాణ మన్తః కరణ ప్రవృత్తయః అభిజ్ఞానశాకుంతలం-

అంటాడు - సజ్జనులకు సందేహాస్పదమయిన విషయాల్లో ప్రమాణం అంతఃకరణమే అవి - అంటే శిష్టాచారాన్నిబట్టి తెలుసుకోవాలి - లేకపోతే సద్బుద్ధి కలవారి అంతః కరణమే ప్రమాణం - వాళ్ళ అంతఃకరణం ధర్మాన్నుంచి తప్పుకోదు కనుక - యక్షప్రశ్నలు వేసిన యమధర్మరాజు ధర్మరాజు సమాధానాలకు సంతృప్తుడై ఇట్లా

అంటాడు - ధర్మస్వరూపు డయిన తన్ను చేరేందుకు కొన్ని మార్గాలు ఉన్నా యంటాడు —

అహింసా సమతా శాంతిః తపశ్శౌచ మమత్సరః
ద్వారాణ్యేతాని మే విద్ధి ప్రియోహ్యసి సదా మమ -
ఆరణ్యసర్గ - 323-8

అహింస, సమత, శాంతి, తపస్సు, శుచిత్వము, అసూయ లేకపోవడం - ఇవి మార్గాలు - అయితే తనయొక్క తనువులూ స్వరూపాలూ అంటూ మరికొన్ని చేర్చి చెపుతాడు -

యశస్సత్యం దమశ్శౌచ మార్జవం హ్రీరచాపలమ్
దానం తపో బ్రహ్మచర్య మిత్యేతా స్తనవో మమ -
అరణ్యపర్వ - 313-7

యశస్సు - సత్యము - దమము - శుచిత్వము - ఆర్జవము - సిగ్గు - చాపలము లేకపోవుట - దానము - తపస్సు - బ్రహ్మచర్యము - ఈ పదీ తన తనువులని ధర్మ స్వరూపుడయిన యమధర్మరాజు అంటాడు —

ఇదే విషయాన్ని కొద్ది మార్పులతో మను స్మృతి చెపుతుంది —

ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచమింద్రియ నిగ్రహః
ధీర్విద్యా సత్య మక్రోధో దశకమ్ ధర్మలక్షణమ్.
మను-6-92

ధృతి - క్షమ - దమము - అస్తేయము (దొంగతనము లేకుండుట) శుచిత్వము - ఇంద్రియ నిగ్రహము - బుద్ధి (జ్ఞానము) విద్య- సత్యము - క్రోధము లేకుండుట - ఈ పదీ ధర్మలక్షణాలు —

ఈ ధర్మాలను మానవుడు తప్పక ఆచరించాలి - తనకెంత కష్టం వచ్చినా ధర్మాన్ని విడవకూడ దంటుంది భారతం — * * *

ఆపద నైయైనను ధర్మువ
ప్రాపుగ రక్షింప వలయుఁ బరమార్థము ధ

ర్మా పాయము ధార్మికులకు
నాపద; జన్మాంతరమున ననుగతమగుటన్

ఆత్మరక్ష కంటె ధర్మరక్ష ప్రధానం - తనకు ఆపద కలుగుతున్నా ధర్మాన్ని రక్షించాలి - ఇదే పరమార్థం - అసలు ధార్మికులకు ఆపద అంటే ధర్మానికి అపాయం కలగడమే - ధర్మాపాయం జన్మాంతరంలో కూడా అనుసరిస్తుంది- అందు చేత ధర్మహానిని ధార్మికులు సహించకూడదు - అధర్మాన్ని పాటించియే ధర్మరాజు సార్థక నామధేయుడయ్యాడు - యక్షుడితో ధర్మరాజు అందుకే ఇట్లా అంటాడు —

ధర్మ ఏవ హతో హన్తి ధర్మో రక్షతి రక్షితః
తస్మాద్ధర్మం న త్యజామి మానో ధర్మో హతోఽవధీత్
ఆరణ్యపర్వ – 312-126

ధర్మాన్ని ఉపేక్షించి చంపివేస్తే అది మనల్ని చంపుతుంది - అట్లాగే ధర్మం రక్షింపబడితే మనల్ని రక్షిస్తుంది - అందుచేత ధర్మాన్ని విడవనన్నాడు ధర్మరాజు.

అయితే ఒక్కొక్కప్పుడు రెండు ధర్మాలకు విరోధం ఏర్పడుతుంది- అప్పుడు ధర్మ సూక్ష్మాన్ని గ్రహించాలి - ధర్మసూక్ష్మం గ్రహించడం చాలా కష్టం - దీన్ని శ్రుతిప్రమాణం వల్లనూ, వృద్ధాచార నిదర్శనం వల్లనూ తెలుసు కోవాలంటాడు ధర్మ వ్యాధుడు - ఒక ధర్మసూక్ష్మం చెపుతున్నాడు - సత్యమూ - అహింస (భూతదయ) ఈరెండూ ఆచరింప దగ్గ ధర్మాలే - ఈ రెండింటికి (Clash) విరోధం ఏర్పడి నపుడు ధర్మ సూక్ష్మం చెపుతున్నాడు —

భూతహితంబుగాఁ బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చుఁ ద
ద్భూత భయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్లు,ప్రా
ణాతురుఁ డైనచోఁ బరిణయంబున యందును బల్కు బొంకు స
త్యాతిశయంబ యండ్రు మహితాత్మక ! యిట్టివి ధర్మసూక్ష్మముల్ —
ఆరణ్య—5—62

ఒక ప్రాణికి హితంగా, ప్రాణి రక్షణకోసం అసత్యం చెప్పినా అది తప్పు కాదు - పైగా సత్యఫలాన్నే ఇస్తుంది - అట్లాగే ప్రాణులకు భయాస్పద మయిన సత్యం కూడ అసత్యంతో సమానమే - ప్రాణాతురు డయినప్పుడు అంటే ప్రాణ

భయంతో పల్కిన అసత్యమూ, వివాహాల్లో పల్కిన అసత్యమూ సత్యం క్రిందికే వస్తాయి - ఇటువంటివి ధర్మసూక్ష్మాలు —

దీంట్లో అహింసకు ప్రాధాన్యం చెప్పబడింది - అహింస అంటే - వీలయినంత వరకూ హింసామార్గానికి దూరంగా వెళ్ళడమే అహింస అంటాడు - అదే భూతదయ అవుతుంది - అందుకే సత్యానికంటె ముందుగా సర్వభూత దయ పెట్టాడు నన్నయ —

అందుకే యక్షప్రశ్నల్లో — లోకంలో ఉత్తమధర్మం ఏది ? (కశ్చధర్మః పరో లోకే ?) అన్నప్రశ్నకు ధర్మరాజు అనృశంస్యమే — భూతదయయే — ఉత్తమ ధర్మము (అనృశంస్యం పరోధర్మః) అన్నాడు - అట్లాగే ఏధర్మం సదా ఫలితాన్నిస్తుంది అని అడిగితే (కశ్చధర్మః సదాఫలః) వేదధర్మం సదా ఫలితాన్నిస్తుంది (త్రయీ ధర్మః సదాఫలః) అంటాడు. అందుకే "వేదోఽఖిలో ధర్మమూలమ్" అన్నాడు మనువు.

ఉత్తమమైన ధర్మాన్నేకాకుండా అధమమైన అధర్మాన్నికూడ నన్నయ గారు సూచించారు. "ఒరుల నొప్పికోడకుపతాప మొనరించుటయ కడు నధర్మమనిరి" అని—ఇతరులనొప్పికి వెనుకాడక బాధించడమే — హింసించడమే — అధర్మం అని సూక్ష్మంగా చెప్పాడు. ఇతరులను శారీరకంగాగాని, మానసికంగా గానీ బాధింపరాదు. శాంతిపర్వంలో భీష్ముడు ధర్మవిధానం చెప్పి చివరకు ధర్మసర్వస్వ నైజస్వరూప నిరూపణంబు సేసి కరతమలామలకంబుగా ఇట్లా చెప్పాడు

ఒరు లేమేమి యొనర్చిన
నరవర ! యప్రియము దనమనంబున కగుఁదా
నొరులకు నవిసేయకునికి
పరాయణము పరమధర్మ పథములకెల్లన్ శాంతి - 5-220

ఇతరులు ఏ ఏ పనులుచేస్తే తనమనస్సుకు అప్రియం కలుగుతుందో అటువంటిపనులు ఇతరులకు తాను చేయకుండా ఉండడమే ఉత్తమధర్మం. ఇది భూతదయను వివరించి చెప్పడమే. *

---

* పోతనకూడ "దయయు సత్యంబులోనుగా దలపడేని, గలుగనేటికి—" అని భూతదయయొక్క ప్రాధాన్యంచెప్పాడు. "నితాంతాపార భూతదయ" దయ సేయు మని సుదామునిద్వారా భగవంతుని వేడుకొన్నాడు.

మొత్తానికి నన్నయ ధర్మాన్ని — అధర్మాన్నికూడ ఒక్క ఆటవెలదిలో ఇమిడ్చి సూక్ష్మంగా బోధించాడు. * * *

ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
బెద్దకాల మునికి తద్ద తగదు
పతుల కడన యునికి సతులకు ధర్మువు
సతుల కేడుగడయుఁ బతుల చూవె 1-4-66

ఎంత పతివ్రతలకైనా పుట్టింటిలో చాలాకాలం ఉండటం మంచిదిగాదు. భర్తదగ్గర ఉండటమే భార్యధర్మం - భార్యకు రక్షణ భర్తయేకదా !

దుష్యంతుడు శకుంతలను గాంధర్వవిధిగా వివాహమాడి వెళ్ళాడు — శకుంతల గర్భవతి అయింది. కొన్నాళ్ళకు కణ్వాశ్రమంలో ఒక కొడుకును కన్నది. అతడు పెరిగి పెద్దవాడవుతున్నాడు. యౌవరాజ్యాభిషిక్తుడు కావగిన వయస్సు వచ్చింది. అయినా దుష్యంతుడు వచ్చి శకుంతలను తీసుకు వెళ్ళలేదు. అప్పుడు కణ్వుడు శకుంతలను దుష్యంతుని దగ్గరకు పంపాలనుకొని శకుంతలతో అంటున్నాడు.

పుట్టింటిలో స్త్రీలు చాలాకాలం ఉండకూడదు. ఈసూక్తి యీనాటికీ వాస్తవంగా విలచింది. ఈనాడేకాదు ఏనాడూ అంతే. పుట్టింటిలో చాలాకాలం ఉంటే ఎన్నో అపవాదులు బయలుదేరుతాయి. లోకులు పలుగాకులు - అందుచేత ఎంత పతివ్రతకైనా భర్తయే శరణ్యం. లేకపోతే సతికి రక్షణకూడలేదట. అందుకే ఈ రక్షణను దృష్టిలోపెట్టుకొనే మనుస్మృతి

పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే
రక్షంతి స్థవిరే పుత్రా నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి (9-3)

బాల్యంలో తండ్రి, యౌవనంలో భర్త, వార్ధకంలో పుత్రుడూ స్త్రీని రక్షించాలి అంటాడు. స్త్రీకి రక్షణ లేకపోతే పితృవంశానికీ భర్తృవంశానికీ కూడా సంతాప కారకమవుతుంది. ఈ భావంతోనే స్త్రీకి స్వాతంత్ర్యం పనికిరాదన్నది.

భర్తచాటునఉన్న స్త్రీకి రక్షణ ఉండటం మాత్రమే కాదు. గౌరవంకూడా ఉంటుంది. లేకపోతే చులకనతనం ఏర్పడుతుంది ప్రజల మనస్సులలో - అంతేకాదు

పురుషుల మనస్సులలో కలుషభావం ఏర్పడేందుకు కూడా అవకాశమిచ్చినట్లు అందు చేత భర్త భార్యకు రక్షకుడు.

ఇక్కడ సంస్కృతంలో శకుంతలను దుష్యంతుని దగ్గరకు తీసుకు వెళ్ళమని కణ్వుడు శిష్యులతో ఇట్లా అంటాడు.

నారీణాం పితృవాసోహి బాంధవేషు నరోచతే
కీర్తి చారిత్ర ధర్మఘ్న స్తస్మాన్నయత మా చిరమ్.

"స్త్రీలకు పుట్టింటిలో చిరకాలం ఉండటం మంచిది కాదు - అది కీర్తికీ, చరిత్రకూ, ధర్మానికీ భంగకరం - అందుచేత తీసుకు వెళ్ళండి" అన్నాడు —

తెలుగులో కణ్వుడు శిష్యులతో కాకుండా శకుంతల తోనే అంటాడు — ఇందులో ఆమెతో గల చనవూ ఆమె మీది వాత్సల్యమూ గోచరిస్తాయి - కథలో నుండి సూక్తిని వింగడిస్తూనే నన్నయ దాని వెనుక ఒక వైచిత్ర్యాన్ని కూడా సంతరించాడు - రుచిరార్థ సంయోజనంలో ఇదొక విధానం —

మఱచినఁ దలఁపింపఁగ నగు
నెఱుఁగని నాఁడెల్ల పాటు నెఱిఁగింప నగున్
మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని
కఱటిం దెలుపంగఁ గమల గర్భుని వశమే ! 1-4-72

మరిచి పోతే గుర్తు చెయ్యవచ్చు - అసలే తెలియక పోయినా ఎట్లాగో అట్లా తెలియజేయవచ్చు- మరి తెలిసి కూడా తెలియదనే వంచకుడికి తెలపడం బ్రహ్మతరం కూడా కాదు -

శకుంతల తన కుమారుణ్ణి తీసుకుని దుష్యంతుని సభలోకి వెళ్ళి నిలిచింది. దుష్యంతుడు శకుంతలను చూశాడు - కాని ఆ ముఖంలో పూర్వం కనపడ్డ సంభ్రమం కానీ కరుణ కానీ ఆదరణ కానీ అనుగ్రహం కానీ కనపడలేదు శకుంతలకు. శకుంతల మనసులో సందేహం అంకురించింది. "ఇతడు నన్ను ఎఱుగడా లేక మరిచి పోయాడా !" అనుకుంటుంది - బహుకార్యాలలో మగ్నులు కదా రాజులు ! మరిచి

పోయాడేమో అనుకుని మరిచిపోతే ఎట్లాగైనా గుర్తు చేయవచ్చు - అసలే తెలియక పోయినా నేను ఫలానా అని ఏదోవిధంగా పరిచయం చేసుకోవచ్చు - కాని తెలిసి కూడా తెలియదనే మోసగాడికి ఎట్లా చెప్పడం ? అది ఎవరి తరమూ కాదు - చివరికి వాడిని పుట్టించిన బ్రహ్మతరంకూడా కాదు - అనుకుంటుంది. దీనికి సంవాద రూప మయిన భావం భర్తృహరి నీతిశతకంలో గోచరిస్తుంది — ఈ పద్యాన్నే దృష్టిలో పెట్టుకొని ఏనుగు లక్ష్మణకవి భర్తృహరి శ్లోకాన్ని తెనిగించి ఉంటాడు.

తెలియని మనుజుని సుఖముగఁ
తెలుపందగు సుఖతరముగఁ దెలుపఁగ వచ్చున్
దెలిసిన వానిన్ దెలిసియుఁ
దెలియని నరుఁ దెల్ప బ్రహ్మదేవుని వశమే —

ఈ భావం సంస్కృతభారతంలో లేదు — నన్నయ ఉపజ్ఞక మవడం గమనార్హం.

* * *

సతియును గుణవతియుఁ బ్రజా
వతియు ననుబ్రవతయు నైన వనిత నవజ్ఞా
న్వితదృష్టిఁ జూచు నతి దు
ర్మతి కిహముం బరముఁ గలదె మతిఁ బరికింపన్ 1—4—82
సంతత గృహమేధి ఫలం
బంతయుఁ బడయంగ నోపు ననుగుణ భార్యా
వంతుండగు వాఁడు క్రియా
వంతుఁడు, దాంతుండు పుత్రవంతుండు నగున్ 1—4—83

గుణవతీ, సంతాన వతీ, పతివ్రతా అయిన భార్యను పరాభవ దృష్టితో చూచే దుష్టుడికి ఇహమూ, పరమూ కూడా దక్కవు.

అనుగుణంగా ప్రవర్తించే భార్య కలవాడు గృహస్థాశ్రమ ఫలాన్ని సంపూర్ణంగా అనుభవిస్తాడు — క్రియా శీలి అవుతాడు. దాంతు డవుతాడు — పుత్రులను కూడ పొందుతాడు —

ఈ మాటలు కూడా శకుంతల దుష్యంతునితో సభలో అన్నవే — శకుంతలను అవజ్ఞా దృష్టితో చూస్తున్నాడు దుష్యంతుడు — శకుంతల దోషరహిత —

పైగా భర్తయందు అనురక్తురాలు — వారి ప్రణయానికి చిహ్నంగా ఒక పుత్రుడు కూడ కలిగాడు — అటువంటి భార్యను అవమానించడం సహింపరానిది. అందుకే ఒళ్ళుమండి ఇహమూ పరమూ ఉండవు (నీకు) అంది. మూలంలో లేని ఈ భావాన్ని నన్నయ స్త్రీ స్వభావాని కనుగుణంగా నిబంధించాడు — దాన్నికూడ సాధారణీకరణం చేసి (generalise) ఒక సూక్తిగా మలచాడు —

ఇక రెండవపద్యం - ఈ భావం సంస్కృతంలోనిదే. అనుకూలంగా ప్రవర్తించే భార్య ఉంటే ఆభర్త గృహస్థాశ్రమఫలాన్ని పూర్తిగా పొందుతాడు. (ప్రవరుడు దీనికి ఉదాహరణం) వారికి మాటల్లో కాని మనసుల్లోకాని క్రియల్లోకాని తేడాలుండవు - అపుడు క్రియాశూరత ఏర్పడుతుంది. అయితే దాంతుడెట్లా అవుతాడు ? అని శంక పొడముతుంది. దమం—అంటే అంతరింద్రియ నిగ్రహం కలవాడు దాంతుడు. భార్య అనుకూలగతిలో మెలగితే ఇంద్రియతృప్తి యేర్పడుతుంది. దానితో ధర్మకర్మ దీక్ష ద్విగుణితమవుతుంది. అదే యింద్రియ నిగ్రహానికి దారితీస్తుంది. ధార్మికమైన ఇంద్రియతృప్తితో పుత్రవంతు డవుతాడు. పరస్పరానుగతంతో కలిసే వారిరువురికి సత్పుత్రలాభం కలగటంలో ఆశ్చర్యంలేదు. ఇక్కడ దాంతుడవుతాడనే విషయం నన్నయ లోకజ్ఞతకు నిదర్శనం. * * *

నుతజల పూరితంబులగు నూతులు నూఱిటి కంటె సూనృత
వ్రత ! యొక బావిమేలు; మరి బావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతు వదిమేలు, తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు త
త్సుత శతకంబుకంటె నొక సూనృత వాక్యము మేలు సూడగన్
1-4-93

వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్క సత్యమును నిరుగడలం
దుల నిడి తూపగ సత్యము
వలనన ములు సూపు గౌరవంబున పేర్మిన్ 1-4-95

సర్వ తీర్థాభి గమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుగావు

ఎఱుఁగుమెల్ల ధర్మంబులకెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులయిన మునులు -4-98

తియ్యని నీటితో నిండిన నూరు నూతులకంటె ఒక దిగుడుబావి మేలు. ఆ దిగుడుబావులు నూరింటికంటె ఒకయజ్ఞం శ్రేష్ఠమయినది. అటువంటి నూరు యజ్ఞాలకంటె ఒక కొడుకు గొప్ప. అటువంటి నూర్గురు కొడుకులకంటె ఒక్కసత్య వాక్యం మిన్న.

వేయి అశ్వమేధయాగాల ఫలితం ఒకప్రక్కనూ, ఒక్కసత్యాన్ని ఒక ప్రక్కనూ పెట్టి తూచితే గౌరవాన్నిబట్టి సత్యంవైపే మొగ్గుమాపుతుంది.

సర్వతీర్థాలూ సేవించినా, వేదాలన్నీ వల్లించినా సత్యంతో సమానంకావు. తెలుసుకో—అన్నిధర్మాలకూ సత్యమే పెద్దదని ధర్మజ్ఞు లయిన మునులు చెప్పారు.

భరతుణ్ణి తీసుకుని శకుంతల దుష్యంతుని సభలోకివచ్చింది. దుష్యంతుడు నీవెవరో తెలియదన్నాడు. అసత్యమాడిన దుష్యంతునితో శకుంతల సత్యం యొక్క గొప్పదనం చెపుతోంది. సుశీతల పూతంబులనే పద్యంలో ఒక క్రమం ఉంది. ఔచిత్యంఉంది. నుయ్యి కొద్దిమందికే నీటితో తృప్తినిస్తుంది. ఒక యింటివాళ్ళను తృప్తిపరుస్తుంది. దిగుడుబావి దిగిముంచుకునేందుకు వీలుగాఉండి చాలామందిని జలంతో తృప్తిపరుస్తుంది. దానికంటె యజ్ఞం నూరురెట్లుగొప్పది. యజ్ఞంలో హవిస్సుతో దేవతలను తృప్తిపరుస్తారు. దానివల్ల వర్షాలు పడతాయని విశ్వాసం. అంతేకాదు యజ్ఞంలో దివృభువులయిన మానవులందరికీ భోజనంతో తృప్తికలిగిస్తారు. దిగుడుబావి కేవలం జలంతోనే తృప్తిపరుస్తుంది. యజ్ఞంలో భోజనాలతో సర్వ రసతృప్తి కలుగుతుంది. వీనికంటె ఒక ధార్మికుడయిన పుత్రుడు శ్రేష్ఠుడు. అతడు నిర్మల ధర్మ కర్మ దీక్షాపరతంత్రుడయి ఎన్నో యజ్ఞాలు చేయవచ్చును. అందుచే యజ్ఞాలకంటె సుతుడు మేలనవచ్చు.

ఇక సత్యం లేనిదే లోకవ్యవహారం సరళంగా సాగదు. ప్రజలకు సుఖ జీవనమే కరువైపోతుంది. సత్పుత్రుల ప్రవర్తనకూడ సత్యంమిదనే ఆధారపడిఉంది. వేదాలుకూడ సత్యప్రతిష్ఠానాలు. అంగుచేత సత్యాన్ని మించిన ధర్మం లేదు. అదే సర్వోత్తమధర్మం - 'సత్యాన్నాస్తి పరం పదమ్' అని ఆర్యోక్తి. ఉపనిషత్తులు ఇంతకంటె పెద్ద పీటవేశాయి సత్యానికి 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అని -

ఒకప్రక్కనుండి సత్యం అన్నిధర్మాల్లోనూ గొప్పదని ఘోషిస్తూంటే మరోప్రక్కనుంచి శర్మిష్ఠ అసత్యానికి లైసెన్సు ఇస్తోంది.

చను బొంకఁగఁ బ్రాణాత్యయ
మున సర్వధనాపహరణమున నిధనము వ
చ్చిన విప్రార్థమున వధూ
జన సంగమమున వివాహసమయములందున్ 1—3—178

యయాతి దేవయానిని వివాహం చేసుకున్నాడు. దాసియైన శర్మిష్ఠతో సహా దేవయాని యయాతిని చేరింది. శయనవిషయంలో మాత్రం శర్మిష్ఠను పరిహరించి, శర్మిష్ఠ సేవలు స్వీకరింపుమని శుక్రుడు యయాతిని ఆజ్ఞాపించాడు. యయాతి సరే అన్నాడు. కొన్నాళ్ళకు శర్మిష్ఠ తన్ను వివాహమాడుమని యయాతిని కోరింది. యయాతి పూర్వప్రతిజ్ఞను గుర్తుచేసి అసత్యమాడలేను అన్నాడు. అపుడు శర్మిష్ఠ తన వాదాని కనుకూలంగా ఈ విధంగాచెప్పింది. ప్రాణం పోతున్న సమయంలోనూ, సర్వస్వమూ పోయే సమయంలోనూ, బ్రాహ్మణ వధ సందర్భంలోనూ స్త్రీ సంగమంలోనూ, వివాహ సమయాల్లోనూ బొంకవచ్చునట. తన్ను వివాహమాడినందువల్ల యయాతి సత్యసంధతకు ఏమీభంగం కలుగదనీ, వివాహసమయంలో అసత్యమాడినా దోషంకాదనీ వాదిస్తుంది. వామనుడికి దానంచెయ్యవద్దంటూ శుక్రుడు బలిచక్రవర్తితో ఇదేవాదన చేస్తాడు భాగవతంలో.

వారిజాక్షు లందు వైవాహికములందుఁ
బ్రాణ విత్త మాన భంగ మందుఁ
జకిత గోకులాగ్ర జన్మ రక్షణమందు
బొంకవచ్చు నఘము పొందదధిప!

ఈ సమయాల్లో బొంకినా పాపం రాదుట - పాపం రాకపోతే బొంకడ మేనా? ఒక విధంగా చూస్తే బొంకిన తర్వాత పాపం రాకపోవడ మేమిటి? కేవలం వాదనకోసం తనకనువయిన రీతిలో మలచుకొని (ధర్మాన్ని) ధర్మ స్వరూపాన్ని వికృత పరచిన ఘట్టం యిది - శుక్రుడు నీతిశాస్త్ర కర్త - బృహస్పతికూడ నీతిశాస్త్ర కర్తయే - అయితే శుక్రనీతి కూటనీతి. సమంజసంగా లోకం పరిగణించదు - అందుచే శుక్రుని యీ మాటలు సమంజసాలుగా కన్పడవు. మరి శర్మిష్ఠ చెప్పిన మాటలో? అవి

వచ్చు - శర్మిష్ఠ మాటల్లో స్వార్థం దాగి ఉంది - అంతేకాదు కానువాంచ పొంచి పొంచి చూస్తోంది - ఆమె హృదయం కల్మషరహితంకాదు - కల్మష చిత్తంనుండి వెలువడిన మాట ఎంత చమత్కార సహితంగా ఉన్నా ధర్మం మాత్రం కానేరదు - శకుంతల మనస్సు మాత్రం నిష్కల్మషమైంది - ఆమె మనసులో రాజుకు కూడ బోధించగల ధైర్యమూ ప్రత్యయమూ ఉన్నాయి - ఆమె సత్యం చెప్పింది - ఈ విషయాన్ని ఆకాశవాణి "శకుంతల సత్యము వల్కె" అని ధ్రువపరిచింది కూడ - సతశీ ప్రభావానికే ఆకాశవాణి కూడ ప్రత్యక్ష మయింది. సత్యవాక్కు దివ్యవాణిని ఆకర్షించింది - 'సత్యము ఇహపర లోకములకు సేతువు' అన్నారు అందుకే— * * *

అవని యరాజకంబయిన యప్పుడ భూప్రజ యందు వర్ణధ
ర్మ్మవులు దొలంగు, దేవముని ముఖ్యులు వాయుదురు, రోలి సృష్టి లే
దవు, మఱి యర్థుపుల్ దఱుగు నందురు, గావున గాలయాపనం
బవితథ వాక్య ! చేయక నయంబున రాజ్యము నిల్పు మిత్రజిన్
1—4—220

రాజు లేని రాజ్యం అరాజకం అవుతుంది - అరాజకం ప్రబలితే ప్రజల్లో ధర్మం నశిస్తుంది - దానితో దేవతలూ మహర్షులూ దూరమవుతారు - వర్షాలు కురవక అనావృష్టి వ్యాపిస్తుంది - విలువలు తగ్గిపోతాయి - అందుచేత కాలయాపనం చెయ్యకుండా నీతితో రాజ్యాన్ని నిలబెట్టు —

శంతనుడి భార్య సత్యవతికి ఇద్దరు కొడుకులు పుట్టారు - చిత్రాంగదుడు విచిత్రవీర్యుడు. చిత్రాంగదుడు చిన్నతనంలోనే పెళ్ళికాకుండానే చచ్చి పోయాడు — విచిత్ర వీర్యుడికి అంబిక, అంబాలిక ఇరువురు భార్యలు - సంతానం కలగకుండానే విచిత్రవీర్యుడూ మరణించాడు - అపుడు సత్యవతి భీష్మణ్ణి పిలిచి వంశం నిలబెట్టేందుకు భీష్మణ్ణి వివాహం చేసుకో అంటుంది - భీష్ముడు తన ప్రతిజ్ఞను గుర్తు చేసి అది జరగదంటాడు - అపుడు సత్యవతి తనకొడుకయిన వ్యాసుణ్ణి తలచుకొంటుంది - వ్యాసుడు ప్రత్యక్ష మయ్యాడు - సత్యవతి విషయం చెప్పి, సోదర క్షేత్రాల్లో దేవర న్యాయంతో పుత్రుల్ని కనమంటుంది - సరే అన్నాడు వ్యాసుడు. సంవత్సరకాలం వ్రతం చేసి నీ కోడళ్ళు పరిశుద్ధలయితే సత్పుత్రులు కలుగుతారు అంటాడు వ్యాసుడు- అపుడు సత్యవతి కాలాయాపనం పనికిరాదు, వెంటనే పుత్రుల్ని పొందాలి. లేకపోతే భూమి అరాజకం అవుతుంది — అరాజకంగా ఒక్క నిముషం

కూడ ఉండరాదంటూ ఈ విశేషాలు చెప్తుతుంది. అరాజకమయిన రాజ్యంలో సంభ వించే కష్టనష్టాలు సూక్ష్మంగా చెపుతోంది.

సామాన్యంగా ప్రజలు చాలామంది దైవంపట్ల భక్తితోనూ, రాజుపట్ల భయంతోనూ ప్రవర్తిస్తారు. రాజశాసనం పట్ల భయం లేకపోతే అధర్మ ప్రవర్తను లయ్యే అవకాశంఉంది. ఇంటికి తాళంవేయడం నిజానికి దొంగకోసంకాదు - సామాన్యుడికోసమే—గజదొంగకు తాళాలు ఎట్లాగూఆగవు—తాళం వెయ్యకపోతే ధార్మికంగా ప్రవర్తించే వాడికికూడా ఒక్కొక్కప్పుడు దుర్బుద్ధి కలుగుతుంది. అతడికా దుర్బుద్ధి కలిగేందుకు ఆస్కారం ఇవ్వకూడదు—అనగా రక్షణ విడవకూడదు—రాజు లేకపోతే ప్రజలకు రక్షణఉండదు. దానితో అధర్మం పెచ్చుపెరిగిపోతుంది. ధర్మం తొలగితే దానితోపాటు దేవతలూ మహర్షులుకూడా తప్పుకుంటారు. వాళ్ళు పరోక్షంగా ప్రియం చేకూర్చేవారు—"పరోక్షప్రియా ఏవహి దేవాః" అనివేదం. మానవులు తమధర్మాన్ని తాము ఆచరిస్తూంటే దేవతలు పరోక్షంగా ప్రీతి కలిగిస్తారు. వర్షాలు కురిపించి - వర్షాలులేక అనావృష్టి వ్యాపిస్తే విలువలన్నీ తారుమారవుతాయి- గౌరవ మర్యాదలూ, కీర్తిప్రతిష్ఠలూ వీనిపట్ల ఆదరణ ఉండదు- అనగా అధర్మాచరణం విశ్వరూపం ధరిస్తుంది "ధర్మఏవహతోహన్తి" ధర్మం చంపబడితే మానవుణ్ణి అధర్మమే చంపుతుంది. ఈ వినాశానికి మూలకారణం అరాజకత్వం. అందుచేత రాజ్యం ఎన్నడూ అరాజకంగా - రాజులేకుండా — ఉండకూడదు. * * *

ఎట్టి విశిష్ట కులంబునఁ
బుట్టియు సదసద్వివేకములు గల్గియు మున్
గట్టిన కర్మ ఫలంబులు
నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్ ? 1—5—58

ఎంత ఉత్తమవంశంలో పుట్టినా, మంచీచెడూ తెలుసుకొనే వివేకం ఎంత ఉన్నా, మనుష్యులు తాము పూర్వంచేసిన కర్మలఫలాలను అనుభవింపకుండా తప్పుకోలేరు.

పాండురాజు వేటమీది ఆసక్తితో ఓరోజున అడవిఅంతా తిరిగినా ఒక్క మృగాన్నికూడా కొట్టలేకపోయాడు. చివరికి ఒకచోట మన్మథాయత్తమై మేనుమఱచి ఉన్న మృగదంపతుల్ని కొట్టాడు. కొనప్రాణంతో ఉన్న ఆమృగం మనుష్యభాషలో

తాను కిందముడనే మహర్షిననీ, మనసిజరాగాయుక్తమైన మృగాన్ని గొట్టావుగనుక నీవు ప్రియాసంగమం అయినప్పుడే మరణిస్తావు అనిశపించి మరణించింది. అప్పుడు పాండురాజు ఎంతో నిర్వేదంతో ఇట్లా అనుకుంటాడు.

తాను సద్వంశంలో పుట్టాడు. సదసద్వివేకంకూడ ఉంది తనకు. మరి యిట్లా ఎందుకు చేయ వలసి వచ్చింది? ఈశాపం ఏమిటి? సరే! ఏంచేస్తాం? పూర్వకర్మఫలం అనుకున్నాడు.

ఇక్కడ కర్మసిద్ధాంతం ప్రతిపాదింప బడుతోంది. మానవుడు ఏపని సాధించాలన్నా పురుషకారంతోపాటు దైవంయొక్క అనుకూలతకూడా ఉండాలి. కర్మసిద్ధాంతం ఇక్కడ దైవంఅంటే పూర్వకర్మలని సమాధానం చెపుతుంది. మానవుడు పూర్వంచేసుకున్న కర్మలయొక్క ఫలితాన్నే అనుభవిస్తాడు ఇప్పుడు. ఒకపనినిచేస్తే దానిఫలితం వచ్చేందుకు కొంతకాలం పడుతోంది లౌకికంగా. ఈనాడు ఒక విత్తునాటితే అది మొలకెత్తి పెరిగి వృక్షమై ఫలాన్ని సాధించాలంటే కొంత కాలం అవసరమవుతోంది. అట్లాగే ఈనాడుచేసిన కర్మయొక్క ఫలితాన్ని (ముందు) భావిలో ఎప్పుడో అనుభవిస్తాము. మరిఇపుడు అనుభవించే ఫలితం? అది పూర్వ కర్మయొక్క ఫలితం—అంటే మానవుడు తానుచేసిన కర్మలఫలితాన్నే తాను అనుభ విస్తున్నాడు. ఆ ఫలితం సుఖంకానీ దుఃఖంకానీ తాను చేసిన కర్మల వల్లనే వస్తుంది. కానీ ఎవరో ఈ ఫలితాన్ని ఇస్తున్నారనడం తెలివితక్కువ అంటుంది కర్మసిద్ధాంతం.

సుఖస్య దుఃఖస్య నకోపి దాతా
పరో దదాతీతి కుబుద్ధి రేషా
అహం కరోమీతి వృథాభి మానః
స్వకర్మ సూత్ర గ్రథితోహి లోకః

నేను చేస్తున్నాననుకోవడం కూడా వ్యర్థమంటుంది - తన ఆకారం కానీ, కులం కానీ, శీలంకానీ, విద్యకానీ, ఎంతో ప్రయాసపడి చేసిన సేవకానీ ఫలించదు తాను పూర్వంచేసుకొన్న తపస్సే ఫలిస్తుంది. వృక్షం కాలాన్నిబట్టి ఫలించినట్టుగా!

---

(1) నైవాకృతిః ఫలతి నైవకులం న శీలం
విద్యాపి నైవ నచ యత్నకృతాపి సేవా
భాగ్యాని పూర్వతపసా కిల సంచితాని
కాలేఫలంతి పురుషస్య యథైవవృక్షాః భర్తృహరి-నీతి-97

మానవుని బుద్ధి కూడా ఆ కర్మనే అనుసరించి ప్రవర్తిస్తుంది. అందుకే "బుద్ధిః కర్మానుసారిణీ" అన్నారు - ఎంతో పండితులూ, ప్రతిభావంతులూ అయిన వాళ్ళు కూడా పొరబడుతూ ఉంటారు - మానవుల బుద్ధి ఒక్కటే కాదు - వాళ్ళు చేసే ప్రయత్నాలూ - వాళ్ళకు చేకూరే సహాయాలూ కూడా వాళ్ళ భవితవ్యాన్నీ, కర్మనూబట్టి కలుగుతుంటాయి —

యాదృశీ జాయతే బుద్ధిః వ్యవసాయోపి తాదృశీ
సహాయా స్తాదృశా శ్చైవ యాదృశీ భవితవ్యతా-

సమయానికి పొరబాటు పడి మరుక్షణంలో 'అయ్యో'అనుకునే సంఘటనలకు కారణం ఇదే అంటుంది ఈ సిద్ధాంతం —

ఇంతమంది జనులు ఉన్నారు కదా - వీళ్ళు ఎన్నో విధాల కర్మలు పూర్వం చేసి ఉంటారు - ఆ కర్మల ఫలితాలు సరిగా వాళ్ళకే ఎట్లా చేరుతాయి ? పొరబడటం కానీ, కలిసిపోయి తారుమారు కావడం కాని జరుగదా అని సందేహం కలగవచ్చు - ఆ సందేహాన్ని చక్కని ఉపమానంతో నివారిస్తున్నాడు - వేలకొలదీ ఆవులున్నా దూడ తన తల్లి దగ్గరకే పోయి పాలు కుడుస్తుంది - అట్లాగే పొరబడకుండా పూర్వం చేసుకున్న కర్మ కర్తను అనుసరించి వస్తుంది - ఈ కర్మయే జన్మ జన్మలకూ అనుసరించి వచ్చేది —

యధాధేను సహస్రేషు వత్సో విందతి మాతరమ్
తధా పూర్వకృతం కర్మ కర్తార మనుగచ్ఛతి -

ఈ కర్మ అనేది పురుషులనే కాదు. పురుషోత్తముణ్ణి కూడ అనుసరిస్తుంది. దానికెక్కడా వైయర్థ్యం లేదు - (Exemption) పురుషోత్తమునికి కూడా బుద్ధి పొరపడటం ఈ కర్మఫలితం వల్లనే అని చెపుతుంది ఈ సిద్ధాంతం - చమత్కారంగా ఈ ఉదాహరణ చెపుతారు -

రాముడు పురుషోత్తముడని కీర్తింపబడుతున్నాడు - అయినా రాముడు ఒకసారి పొరబడ్డాడట - అరణ్యంలో ఉంటున్నాడు- తాను ఇంతకుముందు ఎప్పుడూ బంగారు లేడిని చూడలేదు - అసలు బంగారు లేడి ఉండదనీ తెలును ఆయనకు

కాని కనకమృగం కోసం పరుగెత్తాడు - అంటే సమయానికి బుద్ధి పెడతల నుంటుంది - పూర్వకర్మ ఫలితాన్నిబట్టి ఆపద సంభవిస్తూ ఉంటే మాన్యుల బుద్ధి కూడా కలుష మవుతుంది - అని ఈ క్రింది శ్లోకం చెపుతుంది -

అసంభవం హేమ మృగస్య జన్మ
తథాపి రామో లులుభే మృగాయ
ప్రాయ స్సమా సన్న విపత్తి కాలే
ధియోఽపి పుంసాం మలినీ భవన్తి -

ఈ కర్మనే నుదుటివ్రాత అనడం కూడా కద్దు - "లలాట లిఖితా లేఖా పరి మార్ష్టుం నశక్యతే" నుదుటన్ వ్రాసిన వ్రాత తప్పదు గదా - అనీ, ఎవరు చేసిన కర్మ వారనుభవింపక ఏరికైనను దప్పదన్నా, అనీ తెలుగుదేశంలో బాగా ప్రచారంలోకి వచ్చింది ఈ కర్మ సిద్ధాంతం -

ఈ సిద్ధాంతాన్ననుసరించే పాండురాజు పొరబడ్డాడు - ఈ సిద్ధాంతాన్ని నన్నయ కందంలో సంగ్రహించాడు పాండురాజు పొరబాటుకు కారణాన్ని చెపుతూ-

ఇక్కడ ఒకటి గమనించాలి. కర్మ సిద్ధాంతాన్ని సక్రమంగా అర్థం చేసు కోకపోతే మనిషికి సోమరితనం అలవడుతుంది - దీన్ని ఉత్సాహపూరితమయిన పురుషప్రయత్నం చేసేందుకు సమన్వయించుకోవాలేకాని సోమరితనం అలవరచు కొనేందుకు కాదు - * * *

కులమునకు నఖిల లోకం
బులకు నపాయంబుసేయు పురుషాధము ని
మ్ముల దూషించి జగంబును
గులమును రక్షించు టుఱదె కువలయనాథా! 1-5-11

వంశానికీ లోకానికీ కీడు కల్గించే అధముణ్ణి విడిచి వంశాన్నీ, లోకాన్నీ రక్షించడం తగదా!

త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్
గ్రామం జనపదస్యార్థే హ్యాత్మార్థే పృథివీం త్యజేత్

అనే ప్రసిద్ధ శ్లోకాని కిది తెలుగుసేత - దుర్యోధనుడు పుట్టినప్పుడు ఎన్నో దుశ్శకునాలు పొడసూపాయి - అపుడు భీష్ముడు విదురుడు మొదలయినవారు ధృతరాష్ట్రునితో అన్నమాట యిది.

తెలుగుసేతలో అవసరమైన విషయం మాత్రమే స్పృశింపబడింది. ఒకవి వల్ల వంశాని కంతకూ కీడు కలుగుతున్నపుడు అతన్ని విడిచిపెట్టడం సమంజసం - దుర్యోధనుణ్ణి విడిచిపెట్టి లోకాన్ని వంశాన్ని రక్షించమంటున్నాడు. ముందు జగత్తునూ తర్వాత కులాన్నీ రక్షించాలి అనడంలో జగత్తుయొక్క ప్రాధాన్యం గోచరిస్తుంది. జగద్ధితాన్ని అపేక్షించే నన్నయ సుజనత్వానికి ఇదొక విదర్శనం. వ్యక్తికన్న సంఘానికి, స్వస్థితికన్న వ్యవస్థితికి వున్న ప్రాధాన్యాన్ని చాటిచెప్పే పద్యమిది. *

మతిఁ దలఁపఁగ సంసారం
బతిచంచల మెండమావులట్టుల సంప
త్ప్రతతు లతిక్షణికంబులు
గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్ 1-5-159

ఈ సంసారం ఎండమావులలాగ చంచలమైంది. సంపదలు క్షణభంగురాలు - రాబోయే కాలంకంటె జరిగిపోయినకాలం మేలయింది.

శతశృంగంలో పాండురాజు మరణించాడు. మాద్రి సహగమనం చేసింది. అక్కడి మహర్షులు కుంతినీ కుమారు లయిదుగురినీ హస్తినకు తీసుకువచ్చారు. భీష్మాదులకు అప్పగించి వెళ్ళిపోయారు. వ్యాసుని సూచనమేరకు పాండురాజుకు పరలోకక్రియలు జరిగాయి. తర్వాత ఒకనాడు వ్యాసుడు తల్లియైన సత్యవతితో అంటున్నాడు. అమ్మా! ఈసంపదలు క్షణభంగురాలు - రాబోయేకాలం చాలా గడ్డయినది. ఈ ధృతరాష్ట్రుడి కొడుకులు చాలాక్రూరులు - విలుప్త ధర్మాచారులు - పాండుపుత్రులకు నిష్కారణ వైరు లవుతారు. వీరివల్ల కౌరవులందరకూ చేటు కల్గుతుంది. ఈ ధృతరాష్ట్రుడదంతా అనుభవిస్తాడు. మీరీ ఘోరకలి చూడరాదు - తపోవనానికి వెళ్ళండి" అన్నాడు వ్యాసుడు.

అతిక్రాంత సుఖాః కాలాః పర్యుపస్థిత దారుణాః
శ్వః శ్వః పాపీయ దివసాః పృథివీ గతయౌవనా

అని సంస్కృతంలో వ్యాసుడు కేవలం కథాభాగానికి సంబంధించినదిగా మాత్రమే చెప్పాడు.

నన్నయ దాన్ని కథలోంచి ప్రత్యేకించి ఒకసూక్తిగా మలచాడు - నన్నయ వశ్యవాక్కు - ఈనాటికీ "గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్" అనేది సూక్తిగా చలామణీ అవుతోంది. నన్నయ ఋషివంటివాడు. అందునా తెలుగు సాహిత్యంలో ఆద్యఋషి — మానవు లయితే అర్థాన్ని ముందు భావించుకొని దానికి తగినవాక్కుల్ని ఎన్నుకొని మాట్లాడుతారు. ఋషులు మాట్లాడితే దానివెంట అర్థం అనుసరించి వస్తుంది. "ఋషీనాం పునరాద్యానాం వాచ మర్థోఽనుధావతి" — అని భవభూతి. కథాభాగ సంబంధిగా సంస్కృతంలో ఉన్నదానిని ఏదృష్టితో నన్నయ వేరుపడించివ్రాసాడో - అది సామెతఅయి పాఠకులకు ఆమెత అయింది * *

సమశీల శ్రుతయుతులకు
సమ ధనవంతులకు సమ సుచారిత్రులకున్
దమలో సఖ్యమును వివా
హమును నగుఁగా కగునె రెండు నసమానులకున్ 1-5-205

సమానమైన శీలమూ, పాండిత్యమూ కలవారికీ, సమానమైన ధనం కల వారికీ, సమానమైన చరిత్ర కలవారికి సఖ్యంకాని వివాహంకాని అవుతుంది. అంతే కాని అసమానులకు కల్గుతాయా ?

ద్రోణుడు పాడిఆవులకోసం ధనార్థిఅయి సహాధ్యాయి అయిన ద్రుపదమహా రాజు దగ్గరకు వెళ్లాడు. మహారాజుతో "నేను ద్రోణుణ్ణి నీ బాలసఖుణ్ణి - సహాధ్యాయుణ్ణి, నన్నెరుగుదువా" అంటూ చనువుగా మాట్లాడాడు. ద్రుపదుడికి కోపం వచ్చింది. "తారతమ్యం తెలుసుకోకుండా ఇటువంటిమాటలు మాట్లాడుతావా ? నేను నీకు సఖుణ్ణి ఎట్లా అవుతాను ? ఎక్కడయినా ధనపతితో దరిద్రుడికి స్నేహం కుదురుతుందా ? తత్త్వవేత్తకు మూర్ఖుడితోనూ, ప్రశాంతుడికి క్రూరుడితోనూ, శూరుడికి పిరికిపందతోనూ, సజ్జనుడికి దుర్జనుడితోనూ ఏవిధంగా నయినా స్నేహం కలుగుతుందా ?" అన్నాడు ఐశ్వర్యగర్వంతో. వెంటనే ఎవరెవరికి పొత్తుకుదురుతుంధో కూడా చెప్పాడు.

ఇది సార్వకాలిక మయిన సత్యసూక్తి — స్నేహంకానీ వివాహంకాని సమానులకే చెల్లుతోంది. ముఖ్యంగా సమశీలశ్రుతులకు సఖ్యం, సమధనవంతులకు వివాహంఅనే క్రమాన్వయంతో కూడ చెల్లుతోంది.

వాడి స్నేహితుల్ని బట్టి, వాడి అలవాట్లను బట్టి వాడి గుణగణాలను లెక్క-కట్ట వచ్చు అంటారు -

రాజులకు కార్యకారణ వశ మైన సఖ ం ఏర్పడుతుంది కొంత మందితో అప్పుడప్పుడు - కాని ఆ అవకాశం కూడ నీకు లేదు - నేను ధనపతిని - నీవు దరిద్రుడవు - అని ద్రుపదుడు ద్రోణుణ్ణి ఎత్తి పొడిచాడు - హేళన చేశాడు -

ఇటువంటిదే "వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే" అనే సూక్తి- ఇందులో వివాదం అధికంగా చేర్చబడింది - దీనికి ఇంకా కొన్ని చేర్చి తిక్కనగారు విదురనీతిలో

చెలిమియు సంభాషణమును
బలిమి వివాదంపు ద్రోపుఁ బాడియుఁ దమయం
తల వారి తోన తగు నధి
కుల హీనుల తోడనైనఁ గాలగా దధిపా!

అని చెపుతారు. స్నేహం, సంభాషణం, బలప్రయోగం, వివాదం, యుద్ధం, న్యాయం ఇవి సమానులకే శోభిస్తాయి -

రెండు పువ్వుల్ని ఏకత్ర సమావేశపరచాలంటే ఒక గుణం కావాలి - (దారం) - అట్లాగే రెండు మనస్సు లనే పుష్పాలు కలియాలంటే వానిలోని గుణాలు ఏకం కావాలి - సమానమైన శీలం కల మనసులు కలుస్తాయి - ఆ స్నేహం పది కాలాల పాటు నిలుస్తుంది. అయితే చిన్నతనంలో ద్రుపదుడు - ద్రోణుడూ స్నేహితులే కదా! ఇపుడెందుకు కుదరదు ? అని శంక కలుగవచ్చు - చిన్నతనంలో మనస్సు నిష్కల్మషంగా ఉంటుంది - పెద్దవాడయే కొద్దీ ఆ మనస్సు అనే దర్పణానికి కాలుష్యం అంటుతుంది - ఇపుడు ద్రుపదుడికి ఐశ్వర్య గర్వం అనే కాలుష్యం ఆవరించింది - తత్ఫలింగా వారికి స్నేహం కొనసాగలేదు -

## కణికనీతి

ధృతరాష్ట్రుడు భీష్మవిదురులతో ఆలోచించి ధర్మరాజును యౌవరాజ్యాభిషిక్తుణ్ణి చేశాడు - తమ్ముళ్లు నలుగురూ అతణ్ణి ఎంతో భక్తితో సేవిస్తున్నారు–ద్రోణుడు అర్జునుడికి బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని కూడా ఇచ్చాడు–అపుడు దుర్యోధనుడు ధర్మరాజు యౌవరాజ్యాభిషేకానికీ, పాండవుల ఔన్నత్యానికీ సహింపలేక కర్ణ శకుని దుశ్శాసనులతో ఆలోచిస్తాడు–"పాండవులకు నేనెప్పుడూ భయపడుతూ ఉంటాను–పైగా ఇపుడు ధర్మరాజును యువరాజు చేశాడు రాజు. ఇపుడు నేనేమి చెయ్యాలి ? రాజనీతి ఏమిటోచెప్పండి !" అన్నాడు. అపుడు సౌబలుడి మంత్రి కణికుడనేవాడు దుర్యోధనుడి ఇష్టానికి తగినట్లుగా కొన్నినీతులు చెప్పారు. అదే కణికనీతి. ఈ నీతి కూటనీతి అనీ, ఇది భారతప్రతు లన్నిటాలేదని కొందరంటారు. కాని నన్నయ్య తెనిగించాడు. తెలుగులో పర్వసంగ్రహంలో "దుర్యోధను దుర్మంత్రంబును" అనిమాత్రంఉంది. కణికనీతి అనే మాటలేదు.

సంస్కృతంలో విస్తృతంగా ఉన్నదాన్ని నన్నయ అవసరాన్నిబట్టి సంగ్రహించాడు. మూలంలో ధృతరాష్ట్రుడికి కణికుడు చెప్పినట్లుంది. కాని నన్నయ దుర్యోధనుడికి చెప్పించి ఔచితీవ హితం చేశాడు. ఈ కణికనీతిని విషయాన్నిబట్టి నాలుగుభాగాలు చెయ్యవచ్చు. 1. దండము, 2. ఆత్మరక్షణ 3. దుర్జనస్వభావం 4. శత్రుజయం-

## దండము

రాజు ఉద్యతదండుడు కావాలి. తగినట్లు దండాన్ని ప్రయోగించి ప్రజల్ని ధర్మచరితులుగా చేసి రక్షించాలి. తను సత్ప్రవర్తన కలిగిఉండాలి. సమబుద్ధితో ప్రవర్తించాలి. అపుడు ప్రజలు రాజదండానికి భయపడి తమతమ ధర్మాలలో ప్రవర్తిస్తారు. ఈ దండప్రయోగం విషయంలో రాజు చాలా జాగ్రత్తపడాలి. ఎవరినీ ఉపేక్షవహింపరాదు. చివరకు గురువైనా దండం విషయంలో ఉపేక్షచెయ్యకూడదు. ఉచితానుచితాలు తెలుసుకోకుండా, దుష్ప్రవర్తనతో అహితుడయితే గురువునైనా జనులందరికీ తెలిసేటట్లు శిక్షించాలి.

గుఱుకొని కార్యాకార్యము
తెలియఁగక దుశ్చరితుఁడై యహితుఁ డగు నేనిన్
మఱపక గురునైనను జను
లెఱుఁగఁగ శాసించు నది మహేశుఁడు బుద్ధిన్ 1-6-103

జనులందరికీ తెలిసేటట్లు దండించి నందువల్ల ప్రజల్లో భీతి యేర్పడుతుంది. ధర్మ భంగం ఏర్పడకుండా జాగ్రత్తపడి నట్లవుతుంది- రాజుపట్ల ప్రజలకు భయమూ, భక్తి ఏర్పడతాయి -

## ఆత్మ రక్షణ :-

జన పాలుఁడు మృదు కర్మం
బున నైనను గ్రూర కర్మమున నైనను నే
ర్పున నుద్ధరించు నది ద
న్నన పాయతఁ బొంది చేయు నది ధర్మంబుల్ 1-6-105

రాజు మృదువుగా కాని క్రూరంగా కాని ఎట్లాగయినా నేర్పుగా తన్ను తాను ఉద్ధరించు కోవాలి. ముందు తనకు అపాయం లేకుండా చేసుకుని తర్వాత ధర్మం ఆచరించాలి.

ధర్మం ఆచరించేందుకు ఆధారం శరీరం - "శరీర మాద్యం ఖలు ధర్మ సాధనమ్" అన్నారు - శరీరం లేకపోతే ధర్మాచరణం సాధ్యంకాదు - అందుచేత ముందు తనను తాను రక్షించుకోవాలి రాజు - దానికి ఏమార్గం అయినా అవలంబించ వచ్చు - ఆమార్గం మృదువైనది కావచ్చు, క్రూరమయినది కావచ్చు - ఏదయినా ఆత్మరక్షణ ప్రధానం -"జనపాలుడు" అని రాజుకు చక్కని పదాన్ని ప్రయోగించాడు నన్నయ. అది సాభిప్రాయంగా వాడినది - జనుల్ని పాలించేవాడు రాజు- పాలించడ మంటే రక్షించడం - ప్రజలందర్నీ రక్షించవలసిన వాడు రాజు. అందుచేత వాళ్ళని రక్షించేందుకు తన్ను ముందు రక్షించుకోవాలి - "స్వయం తీర్ణః పరాం స్తారయేత్" తాను దాటి యితరుల్ని దాటించాలి - అది జనపాలుని ధర్మం -

రాజులో కూడా దోషాలు ఉండవచ్చు - కాని ఆ దోషాలు ఇతరులకూ, శత్రువులకూ కన్పడనీయకూడదు - కాని తానుమాత్రం ఇతరుల దోషాలూ లోపాలూ

తెలుసుకుంటూ ఉండాలి - దేశాన్ని కాలాన్ని తెలుసుకొని మిత్రసంపదను వృద్ధి చేసుకోవాలి -

అమలిన మతి నాత్మ చ్ఛి
ద్రము లన్యు లెఱుంగ కుండఁ దా నన్య చ్ఛి
ద్రము లిమ్ముగ నెఱుఁగుచు దే
శముఁ గాలము నెఱిఁగి మిత్రసంపన్నుండై 1-6-109

దేశకాలాలకు అనుగుణంగా ప్రవర్తిస్తే చాలామంది మిత్రులవుతారు - మిత్రసంపదన్ను పెంచుకోవడం బుద్ధిమంతుని లక్షణం -

రాజు ఇతరుల కార్యకలాపాల్ని చారులవల్ల తెలుసుకుంటూ ఉండాలి - శత్రురాజుల యొక్క, ప్రజల యొక్క విశేషాలు తెలుసుకొని రాగల గూఢచారుల్ని పంపాలి - సమాచారాన్ని సేకరించాలి -

అలయక పరాత్మ కృత్యం
బులఁ బతి యెఱుఁగునది దూతముఖమునఁ బరభూ
ముల వృత్తాంతము లెఱుఁగఁగఁ
బలు మఱుఁ బుచ్చునది వివిధ పాషండ తతిన్- 1-9-108

చారుల్ని చాలసార్లు పంపాలట - ఇదంతా ఆత్మరక్షణ విధానంలో భాగమే. మరొకటి కూడా ఉంది యిందులో - రాజు ఎవరినీ నమ్మకూడదు - నమ్మదగిన వారనీ, నమ్మ దగని వారనీ అసలు భేదమే చూపరాదు - ఎవర్నీ నమ్మకుండా రాజు ఎల్లప్పుడు ఆత్మరక్షాపరుడై ఉండాలి -

వీరు నమ్మంగఁ దగుదురు వీరు నమ్మఁ
దగరు నాకు నా వలవదు తత్త్వబుద్ధి
నెవ్వరిని విశ్వసింపక యెల్ల ప్రొద్దు
నాత్మ రక్షా పరుం డగునది విభుండు - 1-6-110

ఇదే భావానికి తిక్కన గారు మరింత మెఱుగులు దిద్దారు -

నమ్మఁదగని వారి నమ్మక యున్నది
తగిన వారి నైనఁ దద్ద నమ్మి
యుండఁ దగదు తన్ను నొరులు నమ్మెడు నట్లు
యుండి యొరుల నమ్మకునికి నీతి          శాంతి-3-239

నమ్మదగని వారిని నమ్మరాదు - నమ్మ దగిన వారిని కూడా ఎక్కువగా నమ్మి ఉండ కూడదు - తన్ను ఇతరులు నమ్మేటట్లు ప్రవర్తించాలి - కాని తాను మాత్రం ఎవరినీ నమ్మక పోవడమే రాజనీతి -

ఈ అపనమ్మకంలోనే రాజు ఎక్కడికి వెడుతున్నా ఆ ప్రదేశాలన్నీ ముందుగా పరిశోధించాలి - ఏ అపాయాలూ లేవని నిర్ధరించుకుని మరీ వెళ్ళాలి - ఇదే నీతి —

బాహ్య విహార శైలో
ద్యాన సభాతీర్థ దేవతాగృహ మృగయా
స్థానముల కరుగు నెడ మును
మానుగ శోధింపలయు మానవ పతికిన్-          1-6-109

విహారానికి వెళ్ళేటప్పుడూ, క్రీడాపర్వతాన్నెక్కేటప్పుడూ, ఉద్యానవనము, సభ, తీర్థం, దేవాలయం, వేట, మొదలయిన చోట్లకు ఎక్కడకు రాజు వెడుతున్నా ముందుగా ఆయా ప్రదేశాలు శోధించాలి. ఇదే నీతి ఇప్పటికీ చెల్లుబడి అవుతోంది - ఆత్మరక్షా విధానంలో ఇది ప్రధాన మయింది.

ఈ ఆత్మరక్షణ విధానంలోనే ఒక భాగం మంత్రరక్షణ - ఆత్మరక్షణకు ఎంత ప్రాధాన్యం ఇవ్వాలో అంతే ప్రాధాన్యం మంత్రరక్షణకు కూడా ఇవ్వాలి - మంత్రం అంటే ఆలోచన - ఏదైనా ఒక కార్యం చేస్తున్నప్పుడు రాజు సమర్థులయిన మంత్రులతో ఆలోచించాలి - ఆ మంత్రులు ధీరస్వభావం కలిగి ఉండాలి - బుద్ధిలో బృహస్పతి సమానులయి ఉండాలి - తనపై అనురాగం కలవారు కావాలి - అటు వంటి వారితో ఆలోచించిన పనికి విఘ్నం రాదు — చివరిదాకా కొనసాగుతుంది -

ధీరమతియుతుల తోడ వి
చారము సేయునది; మును విచారిత పూర్వ
ప్రారబ్ధ మయిన కార్యము
పారముఁ బొందును విఘాత పదదూరంబై - 1-6-104

మొదట బాగా ఆలోచించి చేసిన పని నిర్విఘ్నంగా కొనసాగుతుంది - అయితే రాజు చేసే ఆలోచనలు ఎవరికీ తెలియరాదు - అంటే మంత్రరక్ష ఉండాలి - ఆలోచన గోప్యంగా ఉండాలి - మంత్రరక్ష వల్ల రాజుకు విజయం లభిస్తుంది - (1) రాజుచేసే ఆలోచనలు ఎంత గుప్తంగా ఉండాలంటే -

కడు నలుకయుఁ గూర్మియు నే
ర్పడ నెఱిఁగించునది వాని ఫలకాలమునన్
బిడుగును గాడ్పును జనులకుఁ
బడుటయు వీచుటయు నెఱుక పడియెడు భంగిన్-1-6-114

పిడుగు పడుతోందని పడుతున్నప్పుడే తెలుస్తుంది - ముందుగా తెలియదు - అట్లాగే గాలి వీచడం కూడ ముందుగా తెలియదు - అదే విధంగా రాజు తన కోపం గానీ అనుగ్రహం కానీ, అవి ఫలించే (అమలు పరచే) సమయంలోనే తెలియ నియ్యాలి ముందుగా తెలియ నీయ రాదు -

ఈ విధమైన మంత్ర రక్ష వల్ల పరిపాలన సాఫీగా, నిరాటంకంగా సాగుతుంది - రాజు ఆజ్ఞాపరిపాలనవ్రతుడు కావాలి - ప్రజలు ఆజ్ఞ మిగిలితే రాజు కది గౌరవప్రదం కాదు - తన కోపం అమలు పరచటానికి ముందే ముద్దాయికి తెలిస్తే తప్పించుకొనేందుకు ఎన్నో ఉపాయాలు ఆలోచిస్తాడు అపరాధి - ఒకవేళ తత్సంబంధ

---

(1) రాజునకు విజయ మూలము, రాజితమంత్రంబు సుస్థిరంబుగ దానిన్
రాజాన్వయ! రక్షించితె ధ' రాజనులకుఁ గర్ణ గోచరము గాకుండన్- 2-1-28

నారదుడు ధర్మరాజును పైవిధంగా అడుగుతాడు - మంత్ర రక్షణ చేస్తున్నావా అని -

మయిన అధికారులకు ముందుగా తెలిసినా వాళ్ళు బయట పెట్టరా దంటాడు తిక్కన - (1)

అట్లాగా రాజు ఎవరి పయినయినా అనుగ్రహం చూపదలచినా ముందు తెలియనీయరాదు - గిట్టనివాళ్ళు దానికెన్నో విఘాతాలు కల్పించవచ్చు —

ఇక్కడ నన్నయగారు చక్కని ఉదాహరణం చూపించారు. రాజుయొక్క అలుక పిడుగుపాటు వంటిది - (కూర్మి) ప్రేమ మలయ మారుతం వంటిది అని క్రమాలంకారంతో ఔచిత్యాన్ని రుచిరార్థాన్ని సంతరించారు - * * *

# దుర్జన స్వభావం

పలుమఱు శపథంబులు నం
జలియును నభివాదనమును సామప్రియ భా
షలు మిథ్యావినయంబులు
గలయవి దుష్టస్వభావ కాపురుషులకున్ 1-6-112

పలుమార్లు ప్రమాణాలు చేస్తూ ఉండటం — అంజలి ఘటించడం — నమస్కారాలుచేస్తూ ఉండటం- సౌమ్యంగా ప్రియంగా మాట్లాడటం — దొంగవినయం — ఇవి దుష్టస్వభావంగల నీచుల లక్షణాలు.

మాటకుముందు ఒట్టువేసి (ప్రమాణం చేసి) మాట్లాడే స్వభావంఉంటుంది కొంతమందికి — అంటే వాళ్ళమనస్సులో ఏదో ఒకసంకోచం, అధైర్యం, అనుమానం, భయం, ఉన్నాయన్నమాట — అందుకే వాటినుండి ఎదుటివాడి దృష్టిని తప్పించి నమ్మకంపుట్టించే ఉద్దేశంతో అలా ఒట్టుపెడుతూఉంటారు. అంటే మోసం చేస్తున్నారన్నమాట — అది దుర్జనస్వభావం —

రెండవది — దొంగనమస్కారాలు — మిథ్యావినయాలు. ఈరెండూ ఒకే కోవకు చెందినవే. ఒకటి శారీరకం. మరొకటి మానసికం. రెండూ కాపట్యానికి

---

(1) జనపతి యెవ్వరి నైనను
మనుపఁ జెఱుపఁబూని యునికి మదిఁ దెలియ నెఱిం
గిన యేనిఁ దాను వెలిపు
చ్చునె మును మున్నెట్టి పాలసుండును దానిన్ ....విరాట - 1-134

లక్షణాలే — లేనివినయాన్ని అతివినయాన్ని ప్రదర్శిస్తారు — "అతివినయం ధూర్త లక్షణం" అన్నారు.

మధ్యలోఉంది. సామప్రియభాషలు — మెత్తగా ప్రియంగా మాట్లాడుతారు. హితంగా మాట్లాడుతారు. కాని ఆ ప్రీతీ, హితమూ మనసులోంచి వచ్చినవికావు — నేటి అధికారుల దగ్గరచేరే "కాకారాయుళ్ళ" లక్షణంఅది. అధికారికి ఎంతోప్రియంగా మాట్లాడుతారు — తమపని అయ్యేవరకూ. పనిఅయిన తర్వాతకాని, అధికారి అధికారం లోంచి విరమించిన తర్వాతకాని మళ్ళీ వారి మొహంకూడ చూడరు. అందుకే ధూర్త లక్షణం మూడువిధా లంటుంది — ఈ శ్లోకం.

ముఖం పద్మదళాకారం వాచా చందనశీతలా
హృదయం క్రోధసంయుక్తం త్రివిధం ధూర్తలక్షణం

ముఖం పద్మంలాగా అందంగా ఉంటుంది — మాట చల్లగా చందనంలాగా ఉంటుంది. హృదయంమాత్రం క్రోధపూరిత మవుతుంది. ఈమూడూ ధూర్తలక్షణాలు.

దుర్జనస్వభావాన్ని సుమతి "నిలువెల్లవిషము" అని రెండుముక్కల్లో తేల్చిచెప్పాడు. అటువంటివాడిని దూరంగా ఉంచాలి — లేకపోతే — వాడు పైకి ఇష్టుడు లాగానే కన్పిస్తాడు తనకు వీలు చిక్కేవరకూ — వీలు చిక్కిందంటే వెంటనే త్రాచు పాములాగా దారుణకృత్యం అనే విషపుకోరలతో కరిచివేస్తాడు. ౫

తనకిసి గ్గగు నంతకు దు
ర్జను డిష్టుడ పోలెనుండి సర్పముపోలెం
దన కిమ్మగుడును గఱచును
ఘనదారుణ కర్మగరళ ఘన దంష్ట్రములన్ 1_6_113

ఈ దుర్జనత్వం అనుకూలశత్రుత్వం వంటిది-ఒక దృష్టితో చూస్తే శకుని శత్రుత్వం శకుని అనుకూలుడుగాఉండి దుర్యోధనుణ్ణి ముంచివేశాడు.

అందుచేత ఇటువంటి దుర్జనస్వభావం కలవాణ్ణి దూరంగానే ఉంచాలి — చేరదీసి బాగుచేద్దామనుకోరాదు — వాడు పాముతో సమానుడు కదా ! పాముకు పాలు పోసినా విషాన్ని కక్కుతుంది. దుర్జనులకు ఉపకారంచేస్తే పాముకు పాలుపోసినట్లే- "పయఃపానం భుజంగానాం కేవలం విషవర్ధనమ్".

## శత్రు జయం

రాజుకు ప్రధానమైన కార్యం శత్రువుని జయించడం. దానికి ఎన్నో విధాల శ్రమపడాలి. కష్టాలు సహించాలి. ఒక్కొక్కప్పుడు శత్రువు బలవంతుడవుతాడు. అటువంటప్పుడు కొంతకాలం శత్రువునయినా భుజంమీద మొయ్యాలి.

తఱియగు నంతకు రిపుఁ డున
యఱకటఁ బెట్టుకొని యుండ నది దఱియగుడుం
జెఱచునది ఱాతిమీఁదను
వఱలఁగ మృద్ఘటము నెత్తివైచిన భంగిన్ 1-6-115

వీలు చిక్కేటంతవరకూ శత్రువును మూపుమీదపెట్టుకొని మోయాలి — సమయంవస్తే కుండను రాతిమీద కొట్టినట్లుగా నేలకేసి కొట్టాలి.

శత్రువు బలవంతుడయితే చేసేపని పైది. ఇక బాలుడయితే — తనకంటె బలహీనుడయినా ఉపేక్షచేయకూడదు. వాడు — ఏంచేస్తాడులే అనుకొని నిర్లక్ష్యం చేస్తే మొదటికే మోసంవస్తుంది

బాలుఁడని తలఁచి రిపుతో
నేఁదమునఁ గలసియునికి యిదికార్యమె యు
త్కీలానల కణమించుక
చాలదె కాల్పంగ నుగ్రశైలాటవులన్

బాలుడుకదా! అని చులకనచేసి శత్రువును చేరనీయడం మంచిదికాదు. చిన్న నిప్పురవ్వ చాలును పెద్ద పెద్ద అడవుల్ని సమూలం దహించివేయటానికి — అందుచేత శత్రువు విషయంలో ఉపేక్ష, నిర్లక్ష్యం ప్రమత్తత పనికిరావు — ప్రమత్తంగాఉంటే ఎంత అపాయం కలుగుతుందో మరో ఉదాహరణ చెపుతున్నాడు.

మొనసి యపకారిఁ గడ నిడి
కొనియుండెడు కుమతి దీర్ఘకుజశాఖాగ్రం
బున నుండి నిద్రవోయెడు
ఘనుఁ బోలె సమానమగుఁ బ్రమత్తత్వమునన్ 1-6-118

తన కపకారం చేసినవాడిని దగ్గరపెట్టుకొని ఉండకూడదు. అట్లా పెట్టుకొన్నవాడు ప్రమత్తు డన్నమాట. తెలివితక్కువవాడు. ఎత్తైన చెట్టుకొమ్మమీద నిద్రపోతున్నవాడితో సమానుడు అతడు—చెట్టుకొమ్మమీద నిద్రపోతే—నిద్రలో ఎపుడు దొర్లి క్రిందపడతాడో వాడికే తెలియదు—వాడు ప్రమత్తుడు—నిద్రమత్తులో ఉన్నవాడు చెట్టుకొమ్మమీద ఉండే ప్రాణాలు దక్కవు—అందుచేత శత్రువును దరిచేరనీయరాదు.

శత్రువును సంహరించడం రాజధర్మం—శత్రుశేషం ఉంచరాదు. ఎంత చిన్నముల్లయినా కాలిలోదిగితే దానితో నడవలేరు—దాన్ని తీసివేస్తేనే నడక సాఫీగా సాగుతుంది.

తనకపకారము మును జే
సిన జనుఁడల్పుఁడని నమ్మి చేకొని యుండం
జన దొలఁగించుక ముల్లయి
నను బాదతలమున నడవఁగ నగునే. 1-6-116

అందుచేత శత్రువును నిశ్శేషంగా వధించాలి - ఆ వధించేందుకు ఏ ఉపాయమైనా అమలు పరచవచ్చు - ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా సామోపాయం చేతకాని, భేదోపాయం చేతకాని, దానోపాయం చేతకాని శత్రువును వధించాలి. ఒక్కొక్కప్పుడు మోసంచేసి వధించాలి - నమ్మబలికి దయచూపి వధించాలి ఒక్కొక్కప్పుడు- ఒక్కొక్కప్పుడు సత్యాన్నయినా విడిచిపెట్టాలి శత్రువధకోసం - తనకపకారం చేసిన శత్రువును ఏ విధంగా నయినా సరే వధించమని శుక్రాచార్యుని ఆదేశం - అందుచేత శత్రువులను వారు బంధువులయినా సరే ఉపేక్షించకుండా వధించాలి- లేదా దూరం చెయ్యాలి —

తడయక సామవేదముల దానములన్ దయతోడ నమ్మఁగా
నొడివియు, సత మిచ్చియు జనున్ జననాథ కృతాపకారులం
గడఁగి వధింపఁగాఁగనుట కావ్యసుతం బిదిగాన యెట్టులుం
గడుకొని శత్రులం జెఱుపఁగాంచుట కార్యము రాజనీతిమైన్.

ఇది చివరగా కణికుడు దుర్యోధనునికి చెప్పిన నీతి - మరో సూచన కూడా చేశాడు -

"కావున సర్వప్రకారంబుల నపకారకారణు లయిన వారిం
బరుల నయిన బాంధవుల నయిన సుపేక్షింపక యాత్మ
రక్షాపరుండ వయి దూరంబుజేసి దూషించునది"

అంటాడు - శత్రువును వధించడం దుర్యోధనునికి ఇప్పట్లో చేతకాని పని - అందుచేత ఆత్మరక్షణకోసం పాండవుల్ని దూరంచేసి - వారణావతం పంపి - అక్కడ నమ్మిక పుట్టించి చంపాలని ఆలోచించాడు దుర్యోధనుడు -

ఈ రాజనీతి మహాభారతంలో మొట్టమొదట ప్రత్యక్షమయ్యే రాజనీతి - దీనికంటె విదురనీతి మంచిది - అది కల్మషరహితం - ఇది దుర్యోధనుని ఇష్టానికి అనుగుణంగా చెప్పినది - అది ధర్మానికి అనుగుణంగా చెప్పినది —

శత్రువును జయించే విషయమై అరణ్య పర్వంలో మరో ప్రసంగం వస్తుంది - పాండవులు అరణ్యవాసం చేస్తూ ఉంటారు - తమ అరణ్య వాసానికీ, దురదృష్టానికీ కారణం పరిశీలిస్తూ భీముడు "ఎల్లప్పుడూ కేవల ధర్మాచరణం పనికి రాదు - అది శత్రు జయానికి సాధనంకాదు - దానికోసం ధర్మాన్ని విడిచిపెడితే మాత్రం తప్పా ?" అంటూ ఇట్లా అంటాడు -

మిత్ర సంపన్నుఁడైన నమిత్రు మిత్ర
బలముతోడ భేదించి దోర్బలముఁ జలముఁ
గలిగి దేశబలంబును గాలబలముఁ
గలుగువాని కసాధ్యంబు కలదె యెందు 3-1-250

మిత్ర సంపదకల శత్రువును మిత్రులనుండి ముందు విడదీయాలి. ఆ తరువాత దేశకాలబలాలు తెలిసికొని భుజబలం ప్రకటిస్తే అసాధ్యం ఉండదు.

ఇందులో భేదోపాయం చెపుతున్నాడు "Devide and rule policy" కి మూలం ఇదే. ఈ విధానం విదేశీయులు భారతీయులపై ప్రయోగించారు. అయితే ఇందులో భేదంపెడితే చాలదు. దేశకాల పరిస్థితుల్నికూడ గమనించాలి.

అంతేకాదు బలం నాకే ఉందికదా అని గర్వించి అలసుడై ఉండకూడదు— దేశపరిస్థితుల్ని కాలపరిస్థితుల్ని తెలుసుకుంటూఉండాలి. లేకపోతే

బలము గలవానిఁ బలువురు బలవిహీను
లొక్కటైకూడి నిర్జింతు రుత్సహించి
మధువుఁగొన నుత్సహించిన మనుజుఁబట్టి
కుట్టినిర్జించు మధుకర కులముసట్లు 3-1-251

తేనెపట్టు తేనె తీసుకోడానికి వెళ్ళినవాడిని తేనెటీగలు కుట్టి తరిమివేస్తాయి. అట్లాగే పలువురు బలహీనులు ఒక్కటై పరాక్రమించి బలవంతుణ్ణి జయిస్తారు.

అందుచేత బలంఉన్నా దేశం పరిశీలించాలి. పదిమందితో విరోధం పెట్టుకోరాదు. "బలవంతమైన సర్పము చలిచీమలచేత చిక్కిచావదె" అని సుమతి తేలికగా చెప్పాడు * * *

కులపాంసనులై యహితం
బులు సేయుచు నుండు చుట్టములఁ బొందక యి
మ్ముల నుండు వాఁడ పుణ్యుఁడు
వెలయఁగ గ్రామ స్థితైక వృక్షము పోలెన్ 1-6-182

పరహిత ఫలసంతులు సు
స్థిర మూలాన్వితు లపాప ధీరతులు పర
స్పర సంశ్రయమున జీవిం
తురు మనుజులు వనములోని ద్రుమముల పోలెన్-1-6-183

కులదూషకులై, అపకారంచేసే చుట్టాలను విడచి సుఖంగా దూరంగా ఉండే వాడే పుణ్యాత్ముడు - అతడు గ్రామంలో ఉండే ఒకే ఒక వృక్షం లాగా పత్ర పుష్ప ఫల శోభిత డవుతాడు —

పరులకు ఇష్టమైన ఫలాలతో, స్థిరమయిన మూలంతో, పాపబుద్ధిలేని మనుష్యులు అడవిలోని చెట్లలాగా ఒకరి నొకరు ఆశ్రయించుకొని జీవిస్తారు —

లాక్షాగృహ దహనం అయిన తరువాత భీముడు అన్నదమ్ముల్నీ తల్లినీ తీసుకు వెడుతూ ఉంటాడు - వాళ్ళు నడిచి నడిచి అలసిపోయి పడుకుంటారు - సాయంకాలం అవుతోంది - భీముడు సమీపంలోని చెరువులో నీళ్ళు త్రాగి సోదరులకు

తామరదొప్పల్లో నీళ్ళు తెచ్చాడు - సోదరులు, తల్లీ ఇంకా నిద్రపోతున్నారు- అపుడు భీముడు తమకు కౌరవులు చేసిన అకృత్యాన్ని తలుచుకొని ఇట్లా అనుకుంటాడు -

బంధువులు పరస్పర శ్రేయోభిలాషులై ప్రవర్తించాలి - అట్లా కాక స్వార్థబుద్ధితో బంధువులకే అపకారాలు చేసేవాళ్ళు కొంద రుంటారు - ఆ బంధు గణాన్ని విడిచి బుద్ధిమంతుడు దూరంగా సుఖంగా ఉంటాడు - అడవిలో ఉండకుండా గ్రామంలో ఉన్న ఏకైకవృక్షం లాగా అతడు సుఖపడతాడు - గ్రామంలో ఉన్న వృక్షం లన దయిన అడవిని వీడి వచ్చినా తన్నాశ్రయించిన జనులకు నీడనూ ఫలాలను ఇచ్చి తృప్తి పరుస్తుంది - అట్లాగే అపకారు లయిన బంధుగణాన్ని విడిచి దూరంగా ఉన్నవాడు తాను సుఖపడతాడు - తన్నాశ్రయించిన ప్రజలందరినీ సుఖపెడతాడు —

నిజానికి బంధుగణం పరస్పరసహకారంతో ప్రవర్తించాలి - అపుడే వారు పరహిత మయిన కార్యాలనూ ఫలితాలనూ, సాధిస్తారు - దృఢమయిన జీవనాధారం కలిగి ఉంటారు - పుణ్య బుద్ధితో ప్రవర్తిస్తారు - ఈ ప్రవర్తనకు ఒక ఉదాహరణ అడవిలోని చెట్లు - అడవిలోని చెట్లు పరులకు హితమయిన పండ్లతో (ఫలాలతో) నిండి ఉంటాయి—సుస్థిరమైన మూలం కలిగి ఉంటాయి—తాము మాడిపోతూ కూడ తమ్మాశ్రయించిన వారిని చల్లని నీడ, తియ్యని ఫలాలతో తృప్తి పరిచే పుణ్యబుద్ధి కలిగి ఉంటాయి - పుణ్యమంటే పరోపకార బుద్ధియే - ఇంకా అవి సంఘీభవించి ఒక దాని నొకటి ఆశ్రయించుకొని పెనవేసుకొని ఉంటాయి. విడదీయ శక్యంగాకుండా —

తమతో ఇట్లా ఉండవలసిన కౌరవులు తెలివిమాలిన వారయ్యారు—చెట్లకున్నంత వివక్షణ కూడ లేకపోయింది కౌరవులకు - వాటిని చూచి అయినా నేర్చుకోలేక పోయారు.

ఇక్కడ నన్నయ సంస్కృత మూలానికి వన్నె తెచ్చే ఆంధ్రీకరణం చేశాడు—

తే జీవంతి సుఖం లోకే భవంతి చ నిరామయాః
బలవంత స్సమృద్ధార్థా మిత్రబాంధవనందనాః
జీవంత్యా న్యోన్య మాశ్రిత్య ద్రుమాః కాననజా ఇవ

ఒకరి నొకరు ఆశ్రయించుకొని. అడవిలోని చెట్లవలె మిత్రులనూ, బంధువులనూ సంతోషపరుస్తూ ఆరోగ్యవంతులూ, బలవంతులూ అవుతారు - సుఖంగా జీవిస్తారు—

ఈ భావానికి నన్నయ మెఱుగులు దిద్దాడు—సముచితమైన తన వైదుష్యాన్ని జోడించాడు—శ్లేషతో పై భావాన్ని ఆశ్లేషించాడు—పరహిత ఫలవంతులు, సుస్థిర మూలాన్వితులు, అపాప ధీరతులు, పరస్పర సంశ్రయము అనే శ్లిష్టార్థ పదాలతో పై భావానికి మెఱుగు పెట్టాడు—వ్యాసుని సూక్తులకు వన్నెలు దిద్ది రుచిరార్థతను సంతరించిన ఘనత నన్నయ్యకు దక్కినది— * * *

కృత మెఱుగుట పుణ్యము స
న్మతి దీనికి సమముసేఁత మధ్యము మరి త
త్కృతమున కగ్గలముగ
త్కృతిసేయుట యుత్తమంబు కృతబుద్ధులకున్ 1-6-244

సద్బుద్ధులైనవారు తమకుచేసిన ఉపకారాన్ని తెలుసుకోవడమే ధర్మం పుణ్యం—సద్బుద్ధితో దానికి సమానమయిన ప్రత్యుపకారం చెయ్యడం మధ్యమం—ఆ ఉపకారానికి మించి ఉపకారం చెయ్యడం ఉత్తమమార్గం.

ఏకచక్రపురంలో కుంతి, పాండవులూ బ్రాహ్మణవేషాల్లో ఉండి ఒక బ్రాహ్మణుని యింట్లో కాలక్షేపం చేస్తున్నారు. ఒకరోజున ఆ యింటి బ్రాహ్మణుని వంతు వచ్చింది బకాసురుడికి ఆహారంగా వెళ్ళేందుకు—ఆబ్రాహ్మణకుటుంబం దుఃఖిస్తోంది. ఆ ఆర్తధ్వని విని కుంతి చాలాబాధపడి భీముడితో "ఈ బ్రాహ్మణుడు మనకు పరమోపకారి—ఏదోతీరని కష్టంవచ్చింది—మనం దాన్ని తీర్చాలి"—అంటూ ఈ సూక్తి చెపుతుంది.

ఒకనికి ఒకడు ఒక సత్కృతిచేస్తే అది గ్రహింపగల విజ్ఞత ఉండాలి—అవతలవాడికి అది ధర్మంకూడాను. దాన్ని సక్రమమార్గంలో తెలుసుకోవాలి. మళ్ళీ అవకాశం వచ్చినపుడు అతడు వీడికి సమానమయిన ప్రత్యుపకారం చెయ్యడం మధ్యమం—అంతకు మించి ఉపకారంచెయ్యడం ఉత్తమం. ఈ మూడూకూడా సజ్జన లక్షణాలు—ఒక దానికంటె ఉత్తరోత్తరమూ ఉత్కృష్ట మయినవి—అందరికీ అభిలషణీయాలు—

ఈ ప్రత్యుపకృతికి మొదటిమెట్టు పరోపకారం—పరోపకారం విషయంలో చెట్లు చెప్పుకోదగ్గవి. అవి ఎండలో మాడిపోతూఉంటాయి—తమ నాశ్రయించినవారికి నీడనిస్తాయి—తాము ఎండలో నిరాహారులై తపస్సు చేస్తున్నట్లుంటాయి—ఇతరులకు రుచికరము లయిన మధురఫలాలు అందిస్తాయి—తమ్ము ఆశ్రయించుచున్న పక్షులకు నివాసాన్ని ప్రసాదిస్తాయి—పరోపకారస్వభావం మానవుడు చెట్లనుండి నేర్చుకోవాలి.

అసలు మానవుడు ఈశరీరాన్ని ధరించడం పరోపకారం కోసమే. "పరోపకారార్థ మిదం శరీరమ్" అని—శరీరానికి ఆభరణం పరోపకారమే అంటాడు భర్తృహరి—ఈ పరోపకారస్వభావం కొంతమందికి సహజగుణం—ఎవరూ ప్రేరేపించవవసరంలేకుండ—సూర్యుడు పద్మాలను వికసింపచేస్తున్నాడు—ఈస్వభావంతోనే.

వ్యాసుడు ధర్మసర్వస్వాన్ని క్లుప్తంగాచెపుతూ "పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్". అనిచెప్పాడు—

చేసినమేలు మరచిపోకుండా తెలుసుకొని ప్రత్యుపకారం చేయడం రాజుధర్మాల్లో ఒకటి. "నీవు కృతమెరిగి కర్తను స్తుతిస్తున్నావా?" అంటూ నారదుడు ధర్మరాజును ప్రశ్నిస్తాడు.

కృత మెఱిఁగి కర్త నుత్తమ
మతుల సభల సంస్తుతించి మఱవక తగు స
త్కృతి సేయుదె! కృత మెఱిఁగెడు
పతియె జగజ్జనుల నెల్లఁ బరిపాలించున్. 2-1-46

కృతజ్ఞుడైన రాజే జనులను చిరకాలం పరిపాలించగలడు. కృతఘ్నుడి పీనుగును కుక్కకూడ ముట్టదంటారు తిక్కనగారు. * * *

నలసారము సంసార, మ
ఖిల దుఃఖావహము, భయనికేతన, మతిచం
చలము పరాధీనం బిం
దుల జీవనమేల నమ్మెదురు? తత్త్వజ్ఞుల్ 1-6-248

ఆదిని సంయోగ వియో
గాది ద్వంద్వములు దేహియగు వానికి సం

పాచెల్లక తక్కవు పూ
ర్వోదయ కర్మమున నెట్టియోగికి నయినన్ 1-6-249

ఈ సంసారం గడ్డిపరకలాగా నిస్సారం అయినది. అన్నిదుఃఖాలూ ఇందు లోనే కలుగుతాయి. భయానికి స్థానం—మిక్కిలి చంచలమూ పరాధీనమూను—అందు చేత దీనితత్త్వం తెలిసినవాళ్ళు దీన్ని నమ్మరు.

ఎంత యోగీశ్వరుడి కయినా దేహం ధరించడంవల్ల పూర్వకర్మచేత వచ్చే సంయోగ వియోగాది ద్వంద్వాలు తప్పకుండావస్తాయి.

బకాసురుడికి ఆహారంగా వెళ్ళవలసివచ్చిన బ్రాహ్మణుడు బంధువులతో అంటున్న మాట లివి. వాళ్ళ బాధనుగూర్చి తెలుసుకుందా మని వెళ్ళి కుంతి యీ మాటలు విని నిశ్చేష్టురాలయింది.

నిజమే! ఈ సంసారం ఎన్నో దుఃఖాలకు నిలయం—సర్వభయాలకూ పుట్టినిల్లు—భర్తృహరి ఆ భయాలను చక్కగా క్రోడీకరించాడు—భోగిస్తే రోగాలు తగులుతాయని భయం—డబ్బుంటే రాజుల వల్లనూ దొంగల వల్లనూ భయం. అభి మానం ఉంటే ఎప్పుడు దైన్యం కలుగుతుందో అని భయం—బల పరాక్రమాలుంటే శత్రువు లెక్కడ,ఎప్పుడు విజృంభించి రూపుమాపుతారో అని భయం—చక్కని రూపం ఉంటే ముసలితనం వచ్చేస్తుందని భయం—శాస్త్రం చదివి ఉంటే వాదన వల్ల భయం. సద్గుణాలుంటే దుర్మార్గుల వల్ల భయం—మొత్తానికి అన్నీ భయాలే—భయాల విశ్వ రూపం సంసారం అనిపిస్తుంది - ఏ భయమూ లేనిది వైరాగ్యం—అదొక్కటే అభయం ఇస్తుంది మానవుడికి అంటాడు భర్తృహరి యీ శ్లోకంలో—

భోగే రోగభయం, కులే చ్యుతి భయం, విత్తే నృపాలాద్భయం
మానే దైన్య భయం, బలే రిపుభయం, రూపే జరాయా భయమ్
శాస్త్రే వాద భయం గుణే ఖలభయం కాయే కృతాన్తా ద్భయం
సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్య మేవాభయమ్

భర్తృహరి – వైరాగ్యశతకము.

ఈ సంసారం అతి చంచల మయినది-క్షణభంగురం—బుద్బుదప్రాయం. (నీటిబుడగలాంటిది)పైగా పరాధీనం. పరాధీనపు బ్రతుకు చాలా హేయ మయినది—అందుచేత నిస్సారమూ, పరాధీనమూ అయిన ఈ సంసారాన్ని విసర్జించాలి—తత్త్వం

తెలిసిన వాళ్ళు దీన్ని నమ్ముకు కూర్చోరు—వైరాగ్యాన్ని ఆశ్రయిస్తారు. భగవంతుని ఆశ్రయిస్తారు—

సంయోగ వియోగాలు — (కలియడం, విడిపోవడం) శీతోష్ణాలు—సుఖ దుఃఖాలు మొ॥ వాటిని ద్వంద్వాలు అంటారు—దేహం ఉంటే ఇవన్నీ సంక్ర మిస్తాయి ఎంతటి యోగీశ్వరుడి కయినా—'కర్మానుభవం' ఎవరికీ దాటరానిది—పుణ్యం చేసినా అనుభవించాలి—పాపం చేసినా అనుభవించాలి—ఈ రెండూ నశిస్తేనే కాని మోక్షం సాధ్యం కాదు—పైగా పుణ్యమూ పాపమూ రెండూ ఒక దాంట్లో ఒకటి తీసివేయ దగినవి కావు—జమ—ఖర్చు లాగా. పుణ్యానికి పుణ్యమే—పాపానికి పాపమే— రెంటినీ అనుభవించాలి—ఎవరైనా సరే! ***

మనుజులకు నెవ్విధంబున
ననతిక్రమణీయ మైన యాపద్విషయం
బున సంతాపింపఁగఁ జన
దని యెఱిఁగియు నగునె యెట్లు లని శోకింపన్ 1-6-254

పురుషు కంటె మున్న పరలోక మేఁగిన
సతియ నోఁచి నదియు సతులలోనఁ
బురుషహీన యైనఁ బరమ పతివ్రత
యయ్యు జగము చేతఁ బ్రయ్యఁ బడదె 1-6-256

పడిన యామిషంబు పక్షు లపేక్షించు
నట్లు పురుష హీన యయిన యువతిఁ
జూచి యెల్లవారుఁ జులుక నపేక్షింతు
రదియుఁ బాప మనక హీనమతులు 1-6-257

మానవులకు ఏవిధంగానూ దాటలేని ఆపద (చావు) మరణం - అటు వంటప్పుడు దానికోసం బాధపడి ప్రయోజనం లేదని తెలిసి కూడా ఎందుకు విచారించడం ?

భర్త కంటె ముందుగా స్వర్గస్థురాలయిన భార్య అదృష్టవంతురాలు — భర్తలేని పతివ్రత కూడా లోకంచేత నిందపడవలసి వస్తుంది.

పై నుండి పడ్డ మాంసాన్ని పక్షు లపేక్షిస్తాయి – అట్లాగే (రక్షణలేని) భర్తలేని యువతిని చూచి చులకనగా అపేక్షిస్తారు బుద్ధిహీనులు–పాపం అని అయినా అనుకోకుండా–

బకుడికి ఆహారంగా వెడతానన్న భర్తతో భార్య అంటుంది–తాను వెడతా నంటూ–మానవులకు చావు అనేది దాట రానిది–ఎంత తప్పించు కోవాలనుకున్నా వెంటాడి మీదపడి చంపుతుంది–అటువంటప్పుడు దాటటానికి ప్రయత్నించడం వ్యర్థం - దానికోసం బాధ పడటమూ వ్యర్థమే–

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ
అద్య వాఽబ్ద శతాంతే వా మృత్యుర్వై ప్రాణినాం ధ్రువః[1]

పుట్టినవానికి చావు తప్పదు. ఇప్పుడు కాకపోతే ఇంకో నూరేళ్ళతర్వాత అయినా మృత్యువు కబళించక మానదు. ఇది తెలిసి శోకింపరాదు చావుకు–ఇక్కడ సంస్కృతంలో బ్రాహ్మణి ఒకచక్కని నీతి చెప్పింది. నన్నయ ఎందుకో విడిచి పెట్టాడు.

ఆపదర్థం ధనం రక్షే ద్దారాన్ రక్షే ద్ధనైరపి
ఆత్మానం సతతంరక్షే ద్దారైరపి ధనైరపి

ఆపదల్లో ఆదుకునేందుకు ధనం సంగ్రహించి దాచుకోవాలి. ధనంకంటె ప్రధానంగా భార్యను రక్షించుకోవాలి. ఈ రెంటికంటెనూ ముందు తన్నుతాను ఎల్లప్పుడూ రక్షించుకోవాలి–ఈ ఆత్మరక్షణం ధర్మసాధనం కోసమే.

ప్రతి స్త్రీ తాను భర్తకంటె ముందు చనిపోవాలని కోరుకుంటుంది. ఆ విధంగా పుణ్యవతిగా వెళ్ళిపోవడంకంటె కోరుకోవలసినది లేదు. స్త్రీకి–భర్తలేని స్త్రీకి జీవితం దుర్భరం–లోకం అనేకవిధాలుగా అపవాదులు వేస్తుందికూడ–దానికో ఉదాహరణ చెపుతున్నాడు–మాంసాన్ని పక్షులు అపేక్షించినట్లుగా రక్షణలేని స్త్రీని హీనులు అపేక్షిస్తారట–ఇది ఆనాటి సామాజికపరిస్థితి మాత్రమే కాదు–ఈనాటికీ ఇదే పరిస్థితి కొనసాగుతోంది. అది హీనుల లక్షణంఅంటాడు నన్నయ.

(1) తస్మాదపరిహార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి —భగవద్గీత

ధృతిసెడి వేడెడి వానిని,
నతిథిని, నభ్యాగతుని, భయస్థుని, శరణా
గతుఁ, జంపఁగ నొడఁబడు దు
ర్మతి, కిహముంబరము గలదె మదిఁ బరికింపన్ 1-6-274

ధైర్యం సన్నగిల్లి వేడుకొనేవాడినీ, అతిథినీ, అభ్యాగతుణ్ణి, భయపడ్డ వాణ్ణీ, శరణుకోరినవాడినీ చంపడానికి పాల్పడే దుర్మార్గుడికి ఇహపరా లుండవు—

కుంతి వెళ్ళి బ్రాహ్మణుడితో అంటుంది. "నీకు ఒక్కడేకొడుకు—పైగా చిన్నవాడు—నాకయితే అయిదుగురు కొడుకులు—ఒకణ్ణి బకాసురుడికి ఆహారంగా పంపుతానులే. విచారించకు"అని. ఆమాటలు వినలేక చెవులు మూసుకుని బ్రాహ్మణుడు "అమ్మా! మీరు మాకు అతిధులు—మిమ్మల్ని ఏమాత్రం అవమానపరచరాదని శాస్త్రం చెపుతోంది. అటువంటప్పుడు హత్యాపాతకంకూడా కట్టుకోమంటారా?", అంటూ పైపద్యం చెపుతాడు.

తిధి నియమంలేకుండా ఎప్పుడో అప్పుడు వచ్చేవాడు అతిధి—సరిగా భోజనసమయానికే వచ్చేవాడు అభ్యాగతుడు—అభ్యాగతుణ్ణి విష్ణుస్వరూపుడు అని పూజించాలిట. "అభ్యాగతః స్వయం విష్ణుః" అంటారు—అభ్యాగతుడు అందరికీ గురువులాగా పూజనీయుడు. "పతిరేకో గురుః స్త్రీణాం—సర్వస్యాభ్యాగతో గురుః" అన్నారు. అటువంటివానిని చంపడం మహాదారుణం.

యుద్ధంలో వెనుదిరిగి ధైర్యంపోయి భయపడి పారిపోయేవాడినీ చంపకూడదు—పరాక్రమవంతుడి లక్షణంకాదది.

అట్లాగే శరణాగతునీ చంపరాదు. పాండవులిక్కడ ఎవరికీ కనపడకుండా తెలియకుండా తలదాచుకున్నారు."శరణంబని వచ్చిన భీకరశత్రువు నయినప్రీతిఁగావఁగ వలయున్" అనిచెపుతూంటే తనదగ్గర తనశరణంలో ఉన్నవారిని చంపడానికి పాల్పడ లేనంటాడు ఆ బ్రాహ్మణుడు — అటువంటివానికి ఇహలోకమూ దక్కదు—పరలోకమూ దక్కదు - రెండిటా దుఃఖమే పొందవలసివస్తుంది. * * *

పరుల వలన బాధ వొరయ కుండఁగ సాధు
జనుల ధనము గాచు జనవిభుండు

కరుణ దప్పి తాన హరియించు వాఁడగు
నేని సాధులోక మేమి సేయు ? 1—7—104

ఇతరులవల్ల బాధ కలుగకుండా సజ్జనుల ధనాన్ని రక్షించే మహారాజే దయమాలి తానే ఆధనాన్ని అపహరిస్తే సజ్జనులు ఏం చేయగలరు ?

విశ్వామిత్రుడు వసిష్ఠుని ఆశ్రమానికి సపరివారంగా వచ్చి వసిష్ఠుని ఆతిథ్యం స్వీకరించాడు. వసిష్ఠుడుచేసిన విందు ఏర్పాట్లకు విశ్వామిత్రుడు విస్మితు డయ్యాడు. ఎట్లావేళావీ పదార్థాలు అని ఆశ్చర్యంతో అడిగాడు. వసిష్ఠుడు నందినీ ధేనువునుచూపి 'దానిమహిమ' అన్నాడు—విశ్వామిత్రుడు దాన్ని తన కిమ్మన్నాడు వసిష్ఠుడు హోమద్రవ్యాలకు లోపం కల్గుతుంది. ఏమయినాసరే ఇవ్వ"నన్నాడు. విశ్వామిత్రుడు బలవంతాన నందినీ ధేనువును అపహరింపదలచి పరివారాన్ని నియోగించాడు. "వసిష్ఠుడు చూస్తూ ఊరుకున్నాడు. అప్పుడు కవి కల్పించుకొని పాఠకుల సందేహాన్ని తీరుస్తున్నాడు.

విశ్వామిత్రుడు మహారాజు. అతడు ప్రజలనూ, వారిసొత్తునూ పాలించ వలసినవాడు - పాలించడమంటే రక్షించడం అర్థం. వసిష్ఠుడుకూడా అతని పాలన లోనివాడే. వసిష్ఠుని సంపదనుకూడ రక్షింపవలసినవాడు విశ్వామిత్రుడు. కాని విశ్వామిత్రుడే ఇపుడు వసిష్ఠుని సంపదను అపహరింపదలచాడు. ఎవరేమి అడ్డుకో గలరు ? కంచెయే చేను మేసినట్టయింది.

సంస్కృత భారతంలో ఈభావానికి మూలంలేదు - నన్నయ దీనిని కావా లని కల్పించాడు. పాలకులకు ఇది ఒకవిధమైన ఉపదేశం.

ఇతరుల సొత్తు అపహరించడం ఎవరిపట్ల నయినా దోషమే - ఎవరైనా అందుకు పాల్పడితే రాజు నివారించాలి - ఒక అన్యాయం, అక్రమం, అధర్మం జరుగుతున్నపుడు సమర్థుడైనవాడు చూస్తూ ఊరుకోకూడదు - అట్లా ఊరుకుంటే ఆ పాప ఫలం తాను కూడా అనుభవింపవలసి వస్తుంది - (చూడుడు - ఎఱుకగలదేని - అనే పద్య వ్యాఖ్య -) అయితే అధర్మం జరిగి పోవలసిందేనా ? అంటే అక్కర లేదు - పైన దైవం ఉంటాడు—సమర్థుడు చూస్తూ ఉపేక్షించి పాపం అనుభవించాడు కాని దైవం అధర్మాన్నుండి రక్షిస్తాడు - అతడు ధర్మాన్ని కాపాడుతాడు - ఏదో ఒక ఉపాయంతో —

తపస్వులు చేసే తపస్సులో ఆరవ భాగం రాజుకు చెందుతుంది - తపస్వులకు రక్షణనిచ్చి ప్రశాంతతకు దోహదం చేస్తున్నందుకు. కాని ఆ ధర్మాన్ని కూడ గుర్తెరుగక పోవడం శోచనీయం ఇక్కడ - తన్ను నమ్మిన వారిని హింసించే వాడు కిరాతకుడూ, ఘాతకుడూ. అదృశ్యమైన తపస్సులో భాగమేకాకుండా కనిపించే ఆదాయం, సంపద వగైరాలలో కూడా పారితుడు పాలకులకు భాగాన్ని నివేదిస్తూనే వున్నారు, నాడూ నేడుకూడా. అయినా పాలకులలో అనేకులకు నాటివలె నేటికీ ప్రజా సంక్షేమం పట్ల దృష్టి సన్నగిల్లటం శోచనీయం —

రాజు ప్రజల్ని బిడ్డలవలె రక్షించాలి. తల్లి విషం పెట్టాలనుకుంటే, తండ్రి కొడుకును అమ్మివేద్దామనుకుంటే, రాజే సర్వస్వమూ అపహరించుదా మను కుంటే ఎవరేం చేయగలరు. ఈ భావంగల సంస్కృత శ్లోకం.

మాతా యది విషం దద్యాద్విక్రీణాతి పితా సుతమ్
రాజా హరతి సర్వస్వం తత్రా పరిదేవనా ?          ***

మతి మఱచి యనిస్తీర్ణ
ప్రతిజ్ఞుఁడగువాని కోపపటు దహన మని
ర్గత మయి వడి నరణి సము
త్థిత దహనము పోలె నాత్మదేహము నేర్చున్          1–7–143.

ప్రతిజ్ఞ నెరవేర్చుకోలేని వాని కోపాగ్ని బహిర్గతం కాలేక అరణుల్లో అగ్ని లాగా తనదేహాన్నే దహించివేస్తుంది.

తన పితరులు అందరూ నిష్కారణంగా పరలోకగతు లయ్యారని విని ఔర్వుడు కోపంతో సకలలోక ప్రళయార్థమై ఘోరతపస్సు చేయడం మొదలు పెట్టాడు. మూడులోకాలు చలిస్తున్నాయి అతని తపస్సుకు-అపుడు పితృలోక నివాసులయిన అతని పితరులు వచ్చి అతనిని శాంతి పరుస్తారు. అసమర్థులమై చచ్చిపోలేదని, కావాలనే చచ్చిపోయామని అది తమకు ఇష్టమనీ సెలవిచ్చారు. అయితే మరి నా త్రిలోక పరాభవ ప్రతిజ్ఞ ఎట్లా తీరుతుంది ? అంటూ ఔర్వుడు ఈ మాట లన్నాడు.

ప్రతిజ్ఞ చేసినవానికోపం బహిర్గతం కాకపోతే తననే దహించి వేస్తుందట. అందుకే ప్రతిజ్ఞ చేయటానికి ముందు చాలా ఆలోచించాలి. అసలు ప్రతిజ్ఞచేయకుండా ఉండటం చాలామేలు. ప్రతిజ్ఞ చేస్తున్నాడంటే అహంభావం తనలోపల గూడుకట్టుకుని ఉందన్నమాట. నేను గనుక యింతపని చేయగల్గుతున్నానని ఒక అహంకారం. అహంకారం పతనహేతువు-అహంకారం తగ్గనంతవరకూ భగవంతుడుకూడ మానవునివైపు చూడడు. "నీవే తప్ప నితఃపరంగ బెరుగ" అని అహంకార రహితమైన భక్తితో అర్థించాడు కనుకనే విష్ణుమూర్తి గజేంద్రుణ్ణి రక్షించాడు. అందుచే అహంకారం విడువదగింది. తద్వారా ప్రతిజ్ఞలు చేసే స్వభావంకూడ వర్జింపదగింది.

యజ్ఞంలో అరణుల ద్వారా అగ్నిని ప్రజ్వలింపజేస్తారు. రెండు ఎండు జమ్మికఱ్ఱలు అవి - అరణిని అగ్నిగర్భ అంటారు- అరణులను రెండింటిని ఒక దానితో ఒకటి రాపిడిపెట్టి అగ్నిని మథిస్తారు. ఆ అరణుల రాపిడివల్ల ఏర్పడ్డ అగ్ని అరణులనే దహించి వేస్తుంది.

భారతీయులు కోపాన్ని అగ్నితో పోలుస్తారు, అగ్ని దేన్ని ఆశ్రయిస్తే అది తగులబడి పోతుంది. అట్లాగే కోపంకూడా ఎవరికి వస్తే వాళ్ళ మనస్సును దహించి వేస్తుంది. కోపం బహిర్గతం కాకుండా మనస్సులో దాచుకోవడం చాలా కష్టం. అట్లా దాచుకున్నవాడు ధర్మార్థ కామాల్ని సరిగా సమంగా రక్షించలేడు- అది మనస్సులో ఉన్నంతకాలం ధర్మాచరణకు భంగమే కలుగుతుంది. సరికదా! లోపల ఉన్నంతకాలం అది క్షణక్షణం పెరుగుతూ ఉంటుంది. ఒక్కసారి బహిర్గతమై ప్రళయాన్ని సృష్టిస్తుంది.

ఈ కోపం రెండు విధాలు - 1. ప్రథమ కోపం 2. దీర్ఘక్రోధం.

ప్రథమకోపం చాలా చురుకుగా వస్తుంది. ఒక్క మంట మండి చల్లారి పోతుంది తాటాకు మంటలాగా- ఇది ఒక విధంగా చాలామేలు. అందుకే సజ్జనులకు కోపం రానేరాదుట- ఒకవేళ వచ్చినా ఒక్క నమస్కారంతో తీరిపోతుందట.

దీర్ఘక్రోధం ఆటువంటిది కాదు. దీన్ని కోపం అనడంకంటె క్రోధం అనడమే సమంజసం. ఇది దీర్ఘకాలం ఉంటుంది. లోపలలోపల రాజుకుంటూ ఉంటుంది కొలిమిలోని నిప్పులాగా - ఈ దీర్ఘక్రోధం తనకార్యక్రమాన్ని ఒక మనిషితో సరిపెట్టి ఊరుకోదు. ఒక్కొక్కప్పుడు కొన్ని తరాల ప్రజలను దహించి వేస్తుంది. భారతంలోనే ఒక ఉదాహరణ - ద్రోణుడూ, ద్రుపదుడూ సహాధ్యాయులు.

వాళ్లిద్దరికీ ఏర్పడిన క్రోధం పరిస్పర వినాశక మయింది. ద్రోణుడు భారత యుద్ధంలో ద్రుపదుణ్ణి చంపాడు. ఆ ద్రోణుణ్ణి ద్రుపదుని కొడుకు ధృష్టద్యుమ్నుడు చంపాడు. ఆ ధృష్టద్యుమ్నుణ్ణి, తమ్ముడు శిఖండినీ ద్రోణుని కొడుకు అశ్వత్థామ సంహారించాడు. అనగా క్రోధం - వైరం - దీర్ఘమై తరాలవరకూ వ్యాపించిందన్నమాట.

అందుకే "వలవ దధిక దీర్ఘ వైర వృత్తి" అంటారు. కోపం రానీయకూడదు. అణచుకోవాలి. సాధ్యం కాకపోతే బహిర్గతమైన వెంటనే మరచిపోవాలి.

అసలు ఏ కోప మయినా అది శత్రుతుల్యమే. అందుకే అనుభవసారాన్ని సూక్ష్మంగా సుమతి "తన కోపమె తన శత్రువు" అన్నాడు. ***

ఎఱుక గలఁడేని మఱి శక్తుఁడేని యన్యు
లన్యులకు హింస గావించునపుడు దానిఁ
బూని వారింప కున్న నప్పురుషుఁడేఁ గు
హింస చేసిన వారల యేఁగు గతికి 1-7-146.

ఒకరు మరొకరిని బాధిస్తూ ఉంటే అది తెలిసి, సమర్థుడయికూడ నివారించక పోతే అతడు హింస చేసిన వారి దుర్గతినే పొందుతాడు. హింస చేసినవారికి ఏగతి కలుగుతుందో వారింపకుండా ఉపేక్షించిన వారికీ అదేగతి పడుతుంది.

ఇద్దరు పిల్లలు కొట్టుకుంటున్నారు. పెద్ద లెవరైన చూవారు. వెంటనే వాళ్ళిద్దరినీ విడదీసి వాళ్లవైరాన్ని ప్రశాంత పరచి, సర్దిచెప్పి పంపుతారు ఇది లోక ధర్మం. అట్లా చేయకపోతే కూడ ఆ పెద్దలను లోకం హర్షించదు. పైగా క్రూరకర్ముడని నిందిస్తుంది. లోకం నిందించడమే కాదు. భగవంతుడూ క్షమించడు. అధర్మంగా కొట్టుకునే వాళ్ళకు ఏ గతి పడుతుందో ఆ గతే పెద్దలకూ కల్గిస్తాడు. దీనిలో ఒక మూల సూత్రం ఉంది. సమర్థుడయిన వాడు అధర్మాన్ని ఆపకపోతే అతడుకూడా ఆ అధర్మాన్ని అనుమతించినట్లే, ప్రోత్సహించినట్లే. అందుకే మంచి పని జరిగినా చెడ్డపని జరిగినా దాంట్లో నలుగురు సమానమైన భాగం పంచుకుంటారు.

కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః
సుకృతే దుష్కృతే చైవ చత్వారస్సమభాగినః

చేసినవాడూ, చేయించినవాడూ, ప్రేరేపించినవాడూ, అనుమతించినవాడూ ఈ నలుగురూ ఏపనిలోనయినా (పుణ్యకార్యం కాని పాపకార్యం కాని) సమభాగం పంచుకుంటారు.

ఇదే భావం తిక్కనగారు మరింత పటిష్ఠంగా చెపుతారు. ఉద్యోగ పర్వంలో కృష్ణుడు రాయబారంకోసం వెళ్ళి కౌరవ సభలో ధృతరాష్ట్రుడితో ఇట్లా అంటాడు.

సారపు ధర్మమున్ విమల సత్యము పాపముచేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁబాటిన నైన యవస్థ దక్షులై
వారలుపేక్ష సేసి రది వారల చేటగుఁగాక ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును నైన ముండెడిన్.

ఈ మాటలు ధర్మరాజు కౌరవసభలోని వారికి చెప్పుమన్న మాటలు ధర్మమూ, సత్యమూ అధర్మంచేత, అసత్యం చేత బాధింపబడుతూ ఉంటే చూస్తూ ఉపేక్ష సేసిన వారికే చేటు కలుగుతుంది. అయినా ధర్మమూ, సత్యమూ ప్రతిష్ఠించేందుకు దైవమూ ఎట్లాగూ ఉంది. సత్యధర్మాలు ప్రతిష్ఠించే గౌరవం పెద్దలు దక్కించు కోరు అంతే.

కథాభాగాన్నిబట్టిచూస్తే కౌరవులకు కల్గినకీడు అంతా ధృతరాష్ట్రుడే అనుభవించాడు. సమర్థుడై యుండి సరిగా కొడుకును నివారించలేదు. తన కళ్ళముందరే తనకొడుకులు చచ్చిపోయారు. అంతకంటె దుఃఖం ఏముంటుంది ? అంతేకాదు, "బిడ్డలకు బుద్ధిసెప్పని గ్రుడ్డికి పిండంబు నిడిరే" అంటూ భీముని చేత సూటిపోటి మాటలు పడుతూ ధర్మరాజు పంచను ఉండవలసి వచ్చింది. అందుచేత అధర్మాన్ని వారించగలిగినపుడు వారించకుండ ఉపేక్షిస్తే ఆ పాపం కట్టి కుడుపుతుందన్న మాట. *

కీర్తిలేని వానికిని జీవనంబు ని
రర్థకంబ చూవె యవని మీద
నిత్యమయిన ధనము నిర్మలకీర్తియ
యట్టికీర్తి వడయు టర్హమిందె ?

ఇలఁగీర్తి యెంత కాలము
గలిగి ప్రవర్తిల్లె నంత కాలంబును ని
త్యుల కారె కీర్తి గల పు
ణ్యులు, కీర్తి విహీనుఁ డెందునుం బూజ్యుండే ! 1-8-32

కీర్తిలేని వాని జీవితం వృథా- నిత్యమయిన ధనం నిర్మలకీర్తి ఒక్కటే- అటువంటి కీర్తి కల్గటం సామాన్యం కాదు.

భూమిమీద కీర్తి ఎంతకాలం నిలుస్తుందో అంతకాలమూ మానవుడు నిత్యుడే - కీర్తివిహీనుడు ఎక్కడా పూజింపదగడు.

పాండవులు ద్రౌపదిని వివాహమాడి సుఖంగా ద్రుపదుని పురంలో ఉన్నారని విన్నాడు దుర్యోధనుడు. "పాండవులూ పాంచాలురూ కలిస్తే మనపని ఏంగాను ? " అని భయపడి దుర్యోధనుడు మిత్రులయిన కర్ణసౌబలులతోనూ తండ్రితోనూ ( విదురుడు లేకుండా ) ఆలోచించాడు. పెద్దలతో ఆలోచిద్దాం అని ధృతరాష్ట్రుడు భీష్మద్రోణాదుల్ని పిలిచి చెప్పాడు. అపుడు భీష్ముడంటాడు. "మీరన్నా వారన్నా నాకు సమానమే. వాళ్ళతో వైరం పనికి రాదు. మీరెట్లా పితృరాజ్యానికి అర్హులో వాళ్లూ అట్లాగే అర్హులు. అందుచే వాళ్ళకు అర్ధరాజ్యం ఇయ్య- లేదా అపకీర్తి కలుగుతుంది. అపకీర్తి వల్ల నరకం, కీర్తివల్ల స్వర్గమూ కలుగుతాయి. కీర్తి నిలబెట్టడం రాచపుట్టువు పుట్టిన వాడిధర్మం- ఆ పుట్టుకకు ఫలితం అదే "

మానవుడు జీవించి నంతకాలం మంచిపేరు తెచ్చుకోవాలి. పదిమందిచేత "ఓహో! " అనిపించుకోవాలి గాని " ~~ఛీ " అని పించుకోవాలి గాని~~ " ఛీ " అని పించుకోరాదు. భూలోకంలో సత్కీర్తి నిలచినంతకాలం అతడు స్వర్గ లోకంలో నిలుస్తాడు.

యావత్కీర్తి ర్మనుష్యస్య పుణ్యా లోకే ప్రగీయతే
తావత్స పురుషవ్యాఘ్ర స్వర్గలోకే మహీయతే...ఉద్యో-35-4

స్వర్గలోకంలో శ్రేష్ఠమయిన కీర్తి ఇహలోకంలో ఆయుర్వర్ధక మవుతుంది. ***

ధృతి హీనుల చిత్తము ల
ట్లతివల యందేల తగులు నత్యంత దృఢ
వ్రతుల మనంబులు ? వారల
మతులం దృణ స్త్రైణములు సమంబుల కావే ! 1–8–157

ధైర్యరహితుల మనస్సులు తగుల్కొన్నట్లుగా, ధైర్యమూ, దృఢనియమమూ కలవారి మనస్సులు స్త్రీలయందు ఎందుకు తగుల్కొంటాయి ? వారి మనస్సులో గడ్డిపరక - స్త్రీ సమూహమూ రెండూ సమానాలే కదా !

అర్జునుడు తీర్థయాత్రలు చేస్తున్నాడు - దక్షిణ సముద్రతీరంలో ఒకతీర్థంలో స్నానానికి దిగాడు. వెంటనే మొసలి పట్టుకుంది. దాన్ని అవలీలగా లాగి బయట పడేశాడు. అర్జునుడు. మరుక్షణంలో అది ఒక అప్సరసగా నిలిచింది. "ఎవరునువ్వు ?" అర్జునుడు అడిగాడు. ఆమె తన కథ చెప్పటం మొదలుపెట్టింది." మేము అయిదుగురం అప్సరసలం. ఒకసారి సరదాగా భూలోకానికి వచ్చాం. ఒకచోట ఉగ్ర తపస్సు చేస్తున్న ఒక మునిని చూచాం. అతని తపస్సుకు విఘ్నం కలిగించాలనుకున్నాం. అతని ముందు ఎన్నో ఆటలు ఆడాము. పాటలు పాడాము. ఎన్నో పరిహాసాలు చేశాము. అతడు నీరసుడులాగా మావైపే చూడలేదు. " అంటూ పై సూక్తి చెపుతుంది.

స్త్రైణము అంటే - స్త్రీ సమూహం- తృణంవాలా అల్పమయినది. స్త్రీ జనంకూడ దృఢవ్రతుల మనస్సులలో అంతటిదే. వారి మనసు స్థిరమయినది. ధైర్యం లేని వారి మనస్సులు మాత్రమే స్త్రీల యందు తగుల్కొంటాయి. అనగా ధైర్యం అవలంబింప దగింది. ధైర్యంవల్ల జితేంద్రియత్వం సంక్రమిస్తుంది. ఇంద్రియజయం ముక్తికి సోపానం అప్సరస ద్వారా నన్నయ గారీ విషయం చెప్పించారు. ***

దార సంగ్రహంబు ధరణీశ ! రతి పుత్ర
ఫలము; శీలవృత్త ఫలము శ్రుతము;
దత్తభుక్త ఫలము ధనము; వేదములగ్ని
హోత్ర ఫలము లనియు నొగి నెఱుంగు 2–1–152

వివాహం చేసుకున్నందుకు ఫలాలు రెండు- 1. రతి సుఖం 2. పుత్రులను కనడం. శాస్త్రం చదువుకున్నందుకు ఫలాలు రెండు. సత్స్వభావాన్ని, సత్ప్రవర్తననూ అలవరచుకోవడం- ధనం ఉన్నందుకు ఫలాలు రెండు. ఒకటిదానం. రెండు భోగం- వేదాధ్యయనానికి ఫలం నిత్యాగ్నిహోత్రి కావడం.

రాజసూయానికి ముందు నారదుడు ధర్మరాజును యోగక్షేమా లడుగుతూ "నీపట్ల వేదాలూ, ధనమూ, భార్యా, శ్రుతమూ సఫలా లయ్యాయా ?" అని అడుగుతాడు. అవి సఫలములవడం అంటే- ? అంటాడు ధర్మరాజు-దానికి సమాధానం పై పద్యం- సంస్కృతంలో కూడా ఇది చక్కని ప్రసిద్ధశ్లోకం

అగ్నిహోత్ర ఫలా వేదాః దత్తభుక్తఫలం ధనమ్
రతిపుత్ర ఫలా దారాః శీలవృత్త ఫలం శ్రుతమ్

రతి, పుత్రఫలాలు రెంటిలోనూ రతి అప్రధానఫలమూ, పుత్రుడు ప్రధాన ఫలమూను- అందుకే "శోచ్యం మైధున మప్రజమ్" అంటారు.

శాస్త్రజ్ఞానం కలవ్యక్తి మంచి స్వభావాన్ని, ప్రవర్తననూ అలవరచుకోవాలిః ఇవి అలవరచుకోకపోతే ఆ శాస్త్రజ్ఞానం కేవలం భారమే అవుతుంది. "జ్ఞానం భారః క్రియాం వినా".

ధనానికి ఫలం దానమూ భోగమునూ-కలిగినంతలో దానంచెయ్యాలి. అనుభవించాలి. ఈ రెండూ లేకపోతే ఆ ధనం నశించిపోతుంది.

వేదాభ్యాసానికి ఫలం నిత్యమూ హవిస్సులతో అగ్నిని తృప్తిపరచడం. అనగా స్వధర్మానుష్ఠానం ముఖ్యం. రేపును మాపు, హవ్యములచేత తృప్తుడయిన అగ్ని గృహస్థుకు అభీష్ట ప్రదాత అవుతాడు. ప్రవరుడే దీనికి తార్కాణం. ***

ఆరంభరహితుఁ బొందునె
యారయ సంపదలు హీనుఁడయ్యును బురుషుం
డారంభ శీలుఁడై యకృ
తారంభుల నోర్చు నెంత యధికుల నయినన్ 2-1-123

సంపదలు ప్రయత్నరహితుణ్ణి పొందవు. అల్పు డయినా ప్రయత్నశీలుడు అధికులయిన అప్రయత్నపరుల్ని ఓడిస్తాడు.

రాజసూయం చేయాలనుకున్న ధర్మరాజుకు జరాసంధుడు మనస్సులో మెదిలాడు. ఈ రాజసూయం తాను చెయ్యగలనా అనుకున్నాడు. సంశయగ్రస్తుడైన ధర్మరాజుతో సోత్సాహుడయిన భీము డిట్లా అన్నాడు. "మనం తేలికగా జరాసంధుని వధించగలం. హరికరుణా, అర్జునుడి సహాయమూ, నీ అనుగ్రహమూ ఉంటే జరాసంధవధ నాకేమి కష్టంకాదు," అన్నాడు.

సహజంగా కూడా ప్రయత్నం చెయ్యనిదే ఏ పనీ జరగదు. పనులు నెరవేరాలంటే ప్రయత్నం (ఆరంభము - ఉద్యమము) అవసరం. ఎంత సింహమయినా అది నిద్రిస్తూంటే మృగాలు తమంతతాముగా వచ్చి దానినోట్లో పడవు - లేచివెళ్ళి పరాక్రమించాలి.

ఉద్యమేన హి సిధ్యన్తి కార్యాణి న మనోరథైః
న హి సుప్తస్య సింహస్య ప్రవిశన్తి ముఖే మృగాః

ఊరికే కోరుకుంటే పనులు సమకూడవు. "సాధనమున పనులు సమకూరు."

ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మిః
దైవేన దేయ మితి కాపురుషా వదన్తి

ప్రయత్న పరు డయిన పురుషసింహుణ్ణే లక్ష్మి వరిస్తుంది. అలసత్వంతో సోమరితనంతో దేవుడిమీద భారంవేసి కూర్చున్నవాడు కాపురుషుడు. నిర్వ్యాపారత్వం కాపురుష లక్షణం.

ఉత్సాహవంతుడై ప్రయత్నపరు డయినవాడు కొన్నిదోషాలను విడిచిపెట్టాలి. వాటిని దరిచేరనీయకూడదు. నిద్ర-జాడ్యం-భయం-క్రోధం-అలస్యం-దీర్ఘసూత్రత - ఈ ఆరూ విడిచిపెట్టాలి. [1]

---

1. షడ్దోషాః పురుషేణేహ హాతవ్యా భూతి మిచ్ఛతా
నిద్రా తంద్రా భయంక్రోధ ఆలస్యం దీర్ఘ సూత్రతా

ముసలి మొగుణ్ణి ప్రౌఢయువతి పొందటానికి నిరాకరించినట్లుగా ప్రయత్న హీనుణ్ణి లక్ష్మి నిరాకరిస్తుంది. ఉన్నతిని కోరే బుద్ధిమానవునికి ప్రయత్నమూ, దీక్షా, సాహసమూ అత్యావశ్యకాలు.[2]

ఉత్సాహంతో పురుషుడు ప్రయత్నిస్తే దైవం అనుకూలించి కర్మఫలం ప్రాప్తిస్తుంది. ఈ భావాన్ని అరణ్యపర్వంలో ద్రౌపది ధర్మరాజుతో ఈ క్రింది విధంగా అంటుంది.

తిలలందుఁ దైలంబు గాష్ఠములయందుఁ బరముగా నగ్ని
గలుగ నెఱింగి యుపాయపూర్వము గడఁగి తత్సిద్ధి
యలయక యుత్సాహవంతుఁడు వడయు నట్లనుత్సాహ
మొలసి దైవముఁ దలఁచి వడయఁగను నోపఁడెందు 3–1–284

కడు నిమ్ముగా దున్ని బీజములు నల్లి కర్షకుండున్నఁ
దడయక వర్షంబు గురిసి కాపింపఁ దత్ఫలసిద్ధి
సేఁడెము బర్జన్యుఁడనుగ్రహింపని నాఁడేమి సేయుఁ
గడఁగి చేయఁగలవానిఁ జేయుసుగాక కర్షకుండు 3–1–285

నువ్వులలో నూనె, కట్టెలలో అగ్ని ఉందని తెలుసుకొని ఉపాయంతో వాటిని సాధించడం ఉత్సాహవంతుడికే చెల్లుతుంది. దైవం మీద భారం వేసిన సోమరికిది సాధ్యంకాదు.

రైతు చక్కగా పొలాన్నిదున్ని విత్తనాలు చల్లితే వెంటనే వర్షం కురిసి ఫలం సిద్ధిస్తుంది. మధ్యలో ఇంద్రుడు అనుగ్రహించక వర్షం కురవకపోతే కర్షకుడేం చేస్తాడు ? తాను విత్తనాలు చల్లి ఊరుకుంటాడు తప్ప.

2. అవ్యాపారిణమలసం దైవపరం సాహసాచ్చ పరిహీనమ్
ప్రమదేవహి వృద్ధపతిం నేచ్ఛత్యుపగూహితుం లక్ష్మీః

దైవం అనుకూలిస్తుందో లేదో అని ముందే శంకించి పని మొదలుపెట్టకుండా ఊరుకోవడం సోమరిలక్షణం. ముందు పురుషప్రయత్నం ఉంటే దైవం అనుకూలించడం తర్వాత - అందుకే బుద్ధిమంతుడూ, పరాక్రమవంతుడూ అయిన వాడు పరాక్రమించి ప్రయత్నించాలని శ్రీకృష్ణుడు జరాసంధవధకు ప్రేరేపిస్తూ ధర్మ రాజుతో అంటాడు.

వెలయ విధిదృష్ట నయమున
వలయుఁ బరాక్రమము సేయ వసుధేశ్వర య
గ్గల మగు బుద్ధియుఁ గడఁకయుఁ
గల పురుషుల కిదియె చూవె కర్తవ్య మిలన్ 2–1–131

శాస్త్రచోదితమైన నీతితో పరాక్రమించాలి. చక్కని తెలివీ, ఉత్సాహము కలవారి కర్తవ్యం ఇదే అని ప్రబోధిస్తాడు.

అందుచేత పురుషకారం ప్రధానం అయితే పని ప్రారంభించే ముందు కూలంకషంగా ధీరమతియుతులతో ఆలోచించాలి. ఆలోచించి చేసినపనికి విఘాతం రాదు.

***

కల రూప గుణ ద్రవ్యం
బులు విక్రమవంతునందు భూవిదితములై
నిలుచు నవిక్రమునకు నవి
కలిగియు లేనిక్రియ నప్రకాశంబులగున్ 2–1–129

మానవునిలోని రూపంకాని, గుణంకాని, ద్రవ్యసంపద కాని సాహసించి పరాక్రమిస్తేనే బయటపడుతుంది. ప్రకాశిస్తుంది. పరాక్రమ రహితుడికి అవి ఉన్నా లేనట్లే కప్పబడిపోతాయి.

భీముడి మాటలకు ఉపబలకంగా అర్జును డీ మాట లన్నాడు ధర్మరాజుతో. మనలో కల శక్తి యుక్తులు పరులపై పరాక్రమించి నపుడే బయటపడి ప్రకాశిస్తాయి. రాణిస్తాయి. లేక పోతే మనమూ లేనివారితో సమానులమే అవుతాము. అందుచే జరాసంధవధ తప్పక కావించాలి. రాజసూయం చెయ్యాలి అంటాడు.

తెలుగుదేశంలో ఎంతోమంది విద్వత్కవులు పుట్టారు. వాళ్లందరిలోనూ ప్రాచీనకాలంలో శ్రీనాధుడికీ ఈ మధ్యకాలంలో తిరుపతి వేంకటకవులకు వచ్చిన ప్రశస్తి మరెవరికీ రాలేదు. కారణం ? వారు వారి పాండిత్యంతో పరాక్రమించడమే. శ్రీనాధుడు పరాక్రమించి కనకాభిషేకాన్ని పొందాడు. జగత్ప్రసిద్ధుడయ్యాడు. తిరుపతి వేంకటకవులు పరాక్రమించి తెలుగుదేశం నలుమూలలలో అష్టావధాన శతావధానాలతో తమ ఆశుకవితా సౌరభాలను గుబాళింపజేశారు.'' చెళ్లపిళ్ల వేంకవ గురువంచు చెప్పికొనగా వదిగొప్ప తెలుంగునాడునన్" అని కీర్తింపబడే స్థితికి ఎదిగిపోయారు. ఉన్నపాండిత్యానికీ, కవిత్వానికీ వారిపరాక్రమం వ్యాప్తినీ దీప్తినీ ఇచ్చింది. వారిని మించిన పండితులూ, కవులూ దేశంలో వుండి వుండవచ్చు. కాని వారు పరాక్రమించలేదు. వారికి దీప్తి రాలేదు.

అట్లాగే ఇక్కడకూడా అర్జునుని దివ్యాస్త్ర సంపత్తికి రాజసూయప్రయత్నం దీప్తినీ సాఫల్యాన్నీ ఇచ్చింది.

అల్పుఁడయ్యు మనుజుఁ డతి పరాక్రమమున
పేర్మిఁ దరతరంబ పెరుగుచున్న
వాఁడు ద్రుమాని మొదలి వల్మీకము ద్రుమానిఁ
జెఱుచునట్లు గడఁగి చెఱుచుఁ బగఱ 2—2—144

చెట్టుమొదట్లో పుట్టిన పుట్ట పెరిగి పెరిగి చెట్టునే కబళిస్తుంది. అట్లాగే అల్పుడయినా పరాక్రమంతో క్రమక్రమంగా పెరుగుతూ ఉంటే శత్రువును జయిస్తాడు.

రాజసూయంలో ధర్మరాజ వైభవాన్ని చూచి దుర్యోధనుడు సహింపలేకపోయాడు. పైగా మయసభలో అవమానంపొందాడు. ఇంటికి వచ్చాడు. మాత్సర్యంతో కుమిలిపోతున్నాడు. ఏవిధంగా ధర్మరాజు ఐశ్వర్యం అపహరించాలా ? అనుకుంటాడు. శత్రువృద్ధిని ఉపేక్షించరాదు. ఉపేక్షిస్తే అది మహావ్యాధిలాగా అసాధ్యమవుతుంది. అంటూ ఈ ఉదాహరణం చెప్పుతాడు.

దుర్యోధనుని దృష్టిలో ఇప్పుడు ధర్మరాజు అల్పుడు. పరాక్రమంతో పెరుగుతున్నాడు. అలక్ష్యం ఉపేక్షించరాదు. దుర్యోధనుడు శాఖోపశాఖలు గల వృక్షం లాంటివాడు. ధర్మరాజు పుట్టలాంటివాడు. పుట్టపెరిగి చెట్టును కబళించి వేసినట్లు ధర్మరాజు పెరిగి పెరిగి తననే కబళించి వేస్తాడని దుర్యోధనుని భయం. అందుచేత శత్రువును పెరగనీయరాదు. చిన్నప్పుడే పెకిలించి వేయాలి. పొడిచివేయాలి పుట్టను పొడిచి నట్లు పెరిగి పెద్దవాడయితే కష్టమవుతుంది జయించడం. ఒక్కొక్కప్పుడు సాధ్యంకాకపోవచ్చు కూడ. అందుచేత శత్రువును ఎన్నడూ ఉపేక్షించ కూడదు. ***

ప్రియము పలికెడు వారిన పెద్దమెత్తు
రప్రియంబును బథ్యంబు నైన పలుకు
వినగ నొల్లరు గావున వేడ్క దానిఁ
బలుక రెవ్వరు సుత్తమ ప్రతిభు లయ్యు 2—2—191

మొదల నప్రియ మయ్యును దుదిఁ గరంబు
పథ్యమగు పల్కు ప్రియులందు బలిమి నైనఁ
బలుక వలయు మోమోడక యొలసి యట్టి
వాఁడు దగు సహాయుండు భూవల్లభునకు 2—2—192

ప్రియంగా మాట్లాడే వారినే రాజు మెచ్చుకుంటాడు. ఎవరైనా పథ్యమైన మాట మాట్లాడినా అది తనకు అప్రియమయితే దాన్ని వినిపించుకోరు. అందుచే ఎంత ప్రతిభావంతు లయినా పథ్యమై అప్రియమైన మాటలు మాట్లాడరు.

కాని సరిగా ఆలోచిస్తే మొదట అప్రియంగా ఉన్నా చివరకి మేలు చేకూర్చే పలుకులే హితులకు చెప్పాలి బలవంతంగా నయినా. ఆ విషయంలో మొగ మాట పడరాదు, అటువంటివాడే రాజుకు నిజ మయిన సహాయుడు.

ద్యూతం మాన్పించమని విదురుడు ధృతరాష్ట్రుడికి చెప్పాడు. విని ఊరుకున్నాడు ధృతరాష్ట్రుడు పుత్ర వ్యామోహంతో. అపుడు స్వయంగా దుర్యోధనుడికే చెప్పాడు విదురుడు. నిన్ను ప్రజలు 'ని' అంటారని నిందించాడు. దుర్యోధనుడికి కోపంవచ్చింది. మాకు నీవు బుద్ధులు చెప్పనక్కరలేదు. నోరుమూసుకు కూర్చో అన్నాడు దుర్యోధనుడు అపుడు విదురుడు. దుర్జనులు దుర్జనుల మాటలే వింటారు. అంటూ పై మాటలు చెప్తాడు.

ఇదే భావం రామాయణంలో

సులభాః పురుషా రాజన్ । సతతం ప్రియవాదినః
అప్రియస్యచ పథ్యస్య వక్తా । శ్రోతాచ దుర్లభః అరణ్య - 37-2

రాజు దగ్గర ప్రియంగా మాట్లాడేవాళ్ళు చాలా మంది సులభంగా. దొరుకుతారు ( అవివేకులయిన రాజులు వాళ్ల మాటలే వింటారు కూడ ) కాని అప్రియ మయినా మేలు కూర్చే మాటలు మాట్లాడే వక్త దొరకడు. ఒకవేళ అటువంటి వాడు దొరికినా వానికి శ్రోత దొరకడు. అనగా రాజులు వాని మాటలు విననొల్లరు అయినా సరే బలవంతంగా నయినా సరే చెప్పాలంటాడు విదురుడు. అపుడే అతడు హృదయపూర్వకంగా రాజుయొక్క మేలు కోరేవాడవుతాడు.

ఇదే భావాన్ని విదురుడు మరోచోట కూడ దుర్యోధనుణ్ణి ధృతరాష్ట్రుడినీ దృష్టిలో పెట్టుకొని అంటాడు ధర్మరాజుతో.

కార్యగతుల్ల తెలుగు కలరూపు సెప్పిన
నధిక పుణ్యులు దాని నాదరింతు
రల్ప కార్య బుద్ధులగు వారలకు నది
విరస కారణంబు విషము పోలె 3_1_59

ఉన్న విషయం చెపితే ఉదాత్తబుద్ధి కలవాళ్ళు ఆదరిస్తారు. అల్పబుద్ధులకు అది విరసం కలిగిస్తుంది విషంలాగా.

అరణ్యంలో ఉన్న పాండవులను రప్పించి వాళ్ళరాజ్యం వాళ్లకిచ్చి కీర్తిని, ధర్మాన్ని నిలబెట్టుమని ధృతరాష్ట్రుడితో అన్నాడు విదురుడు. అది ధృతరాష్ట్రుడికి కష్టం కలిగించింది. నువ్వు నా కొడుకుల ఉన్నతిని చూచి ఓర్వలేవు. పాండవుల దగ్గరికి పో అన్నాడు. వెంటనే విదురుడు పాండవుల దగ్గరకు కామ్యకవనానికి వచ్చాడు. తన రాకకు కారణం చెపుతూ ధర్మరాజుతో విదురుడీ మాట లంటాడు.

అల్ప బుద్ధులయిన కౌరవులకు విదురుని మాటలు విరస హేతువు లయ్యాయి. మంచి మాట విషం అయింది. అందుచేత వాక్కులుకూడ పాత్ర తెలిసి వాడాలన్న మాట. ***

సభకు వచ్చి ధర్మ సందేహ మడిగిన
నెఱిఁగి చెప్ప కుండి రేని సభ్యు
లనృత దోషఫలము నం దర్ధ మొందుదు
రనిరి ధర్మవేదులయిన మునులు 2–2–238

ధర్మ వెఱిఁగి దానిఁ దానొండుగా లాభ
లోభ పక్షపాత లోల బుద్ధి
సభల నెవ్వఁడేని సభ్యుఁడై పలుకు వాఁ
డనృత దోష ఫలము ననుభవించు 2–2–2౦8

సభలోకి వచ్చి ఎవరైనా ధర్మ సందేహం అడిగితే సభ్యులు తెలిసికూడ చెప్పక పోతే (మౌనం వహిస్తే) ఆ సభ్యులు అసత్యఫలంలో సగంపాలు పొందుతారని ధర్మజ్ఞు లయిన మునులు సెలవిచ్చారు.

స్వార్థ బుద్ధితో కాని, లోభబుద్ధితోకాని, పక్షపాత బుద్ధితోకాని ధర్మం తెలిసికూడ మరోవిధంగా వ్యతిరేకంగా చెప్పే సభ్యుడు అసత్య ఫలాన్ని పూర్తిగా పొందుతాడు.

సభలో ద్రౌపది అడిగిన ప్రశ్నకు సభ్యు లెవరూ సమాధాన మీయలేదు. ఒక్క వికర్ణుడు మాత్రం అధర్మమని ఎలుగెత్తి చాటాడు. దుశ్శాసనుడు చేస్తున్న అకార్యానికి కోపించి భీముడు అమానుష మయిన ప్రతిజ్ఞ చేశాడు. ఆ తరువాత విదురుడు ద్రౌపది ధర్మసందేహాన్ని ముచ్చటిస్తూ ఈ మాటలు అంటాడు. సజ్జనులు భాసించే ప్రదేశమే సభ. పండితు లున్నదే సభ. ఆ పండితసభ ధర్మసందేహాన్ని తీర్చవలసి ఉంటుంది. అది జ్ఞానవృద్ధు లయిన పండితుల బాధ్యత, ధర్మమూను, ఇది లోక నియతి కూడ. ఈ విధంగా చేయడం వల్ల వారి జ్ఞానానికి ప్రకాశంకూడ లభిస్తుంది. సందేహం తీరడమే కాకుండా దాన్ని కాదని ఎవరయినా మౌనంవహిస్తే అది క్షమార్హంకాదు. అదికూడ అధర్మం కోవలోకే వస్తుంది. ఇక స్వార్థబుద్ధితోనూ లాభంతోనూ, పక్షపాత బుద్ధితోనూ కావాలనే వ్యతిరేకంగా చెప్పేవాళ్ళు ఉండవచ్చు కొంతమంది. దానివల్ల అసత్యదోషం సంపూర్ణంగా లభిస్తుంది. ధర్మ నిర్ణయం కామక్రోధ రహితంగా చేయాలి. రాగ ద్వేషపూరితమైన నిర్ణయం పనికిరాదు. అంతే కాదు-సమర్థులయిన వారు అధర్మాన్ని ఆపాలికూడా. ***

మనమున నేరమి దలపమి
యును సత్క్షమ చిత్తుఁడగుటయును, గుణములు గై
కొని దోషంబులు విడచుట
యును నుత్తముఁడైన పురుషు నుత్తమగుణముల్ 2—2—266

మనస్సులో భేదభావం ( వీడు నా వాడు, వీడు పరాయివాడు అనేభావం ) లేకుండా ఉండటం, ఓర్పుకలిగి ఉండటం గుణాలు గ్రహించి దోషాలు విడచి పెట్టడం- ఈ మూడూ ఉత్తముని ఉత్తమగుణాలు.

ద్యూతంలో ధర్మరాజు అన్నీ ఓడిపోయాడు. ద్రౌపది పరాభవింపబడింది. తర్వాత ధృతరాష్ట్రుడు ద్రౌపదికి రెండు వరా లిచ్చాడు. ఆమె ధర్మజ్ఞతకు సంతసించి యుధిష్ఠిరుని రావించి మళ్ళీ సర్వస్వం పదలతోనూ మామూలుగా ఇంద్రప్రస్థపురం

వెళ్ళి సుఖంగా రాజ్యపాలనం చెయ్యమంటూ ధర్మరాజుతో ధృతరాష్ట్రుడు ధర్మజా ! వృదసేవ వల్ల నీకు సకలధర్మాలూ తెలిశాయి. అజ్ఞానంతో నా కొడుకు నీకు కీడుచేశాడు. దీన్ని మరచిపో. సర్వధర్మాలూ తెలిసిన నీకు నేను వేరే చెప్పాలా? అని పై పద్యం చెపుతాడు.

ఇందులో ఉత్తముని ఉత్తమ లక్షణాలు చెపుతున్నాడు. ధృతరాష్ట్రుడు చెప్పడంలో స్వార్థం ఇమిడి ఉన్నా ఇది సార్వకాలిక మయిన సత్యమే. ఉత్తము డనిపించుకొనేందుకు మూడు లక్షణాలు కావాలి.

1. మనమున వేరమి దలపమి :-

మనసులో భేదభావం లేక పోవడం. అంటే. స్వపరభేదంలేక పోవడం. ( నీ-నా అనేభేదం ) ( నా పిల్లల్ని వేరుగా భావించవద్దని ధృతరాష్ట్రుని సూచన ) ఉత్తములయిన వారికి సర్వమానవ సౌభ్రాత్రం ఉంటుంది. ఉదార చరితు లయిన వారికి వసుధ అంతా ఒకే కుటుంబం. ( ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకమ్ ) వారికి జాతి, మత భేదాలు కాని, స్వపర భేదాలుకాని ఉండవు. వారి ఉత్తమత్వానికి అది నిదర్శనం. శత్రువుకు కూడా అపకారం తలపెట్టరట వారు. అసలు ధర్మ రాజుకు శత్రువులే లేరట. అతనికి అజాత శత్రు డని సార్థకమైన పేరు. మరి దుర్యో ధనుడు శత్రువు కాదా అంటే శత్రుత్వం దుర్యోధనునికి కాని ధర్మరాజుకు లేదు. అతనికి భేధభావం లేదు.

2. సక్షమ చిత్తు డగుట :

ఓర్పుకలవా డవడం రెండోలక్షణం ( ఇక్కడ ధర్మరాజును సహనం వహించమనడం. నా కొడుకు అపకారానికి ప్రతీకారం తలంచకు అని హితబోధ ) క్షమ అనేది కవచంతో సమానం. పరాక్రమవంతులకు అది ఒక అలంకారం. సమర్థు డయినా సైరణ వహించాలి. అందుకే "చెల్లియుండియు సైరణ సేయు నతడు .... పుణ్యపురుషు"డని విదురు డంటాడు. ఇదే భావాన్ని ప్రహ్లాద బలీంద్ర సంవాదం విన్న ధర్మరాజు ద్రౌపదితో అంటాడు.

క్షమ గల వానికిఁ బృథ్వీ
సమునకు నిత్యంబు విజయ సంసిద్ధి యగున్
క్షమి యైన వాని భుజవి
క్రమము కడున్ వెలయు సర్వకార్య క్షమమై 3-1-223

అంటాడు.

క్షమావంతుడు భూదేవితో సమానుడు. అతనికి నిత్యమూ విజయ పరంపరలు కల్గుతాయి. క్షమగలవాని భుజపరాక్రమం సకల కార్యాలు నిర్వహింపగల్గుతుంది.

ఇక్కడ ఒకటి గమనించాలి. క్షమ - పరాక్రమం ఈ రెండూ పరస్పర విరుద్ధ స్వభావాలు - ఈ రెండిటినీ ఇముడ్చుకొని ఏది ఎప్పుడు ప్రయోగించాలో తెలిసి ప్రయోగించాలి. ఎల్లప్పుడూ క్షమా పనికి రాదు. ఎల్లప్పుడూ పరాక్రమమూ పనిచేయదు. అందుకే ప్రహ్లాద బలీంద్ర సంవాదంలో ప్రహ్లాదుడు ఇట్లా అంటాడు.

క్షమయ తాల్చి యుండఁ జన దెల్లప్రొద్దుఁ దే
జంబ తాల్చి యుండఁ జనదు పతికి
సంతత క్షముండు సంతత తేజుండు
నగుట దోష మందు రనఘమతులు 3-1-217

3. గుణములు గైకొని దోషంబులు విడచుట :-

( ఇక్కడ దుర్యోధనుడు చేసిన దోషాన్ని విడిచిపెట్టుమని ధర్మరాజుకు సూచన ) ఇది మహాత్ముల గుణం. ఎదుటి వానిలోని సద్గుణాలను మాత్రమే గ్రహించి స్తుతించడం.

మనసి వచసి కాయే పుణ్యపీయూష పూర్ణాః
త్రిభువన ముపకార శ్రేణిభిః ప్రీణయన్తః
పరగుణ పరమాణూన్ పర్వతీకృత్య నిత్యమ్
నిజహృది వికసన్తః సన్తి సన్తః కియన్తః

భర్తృహరి నీతిశతకము.

మహాత్ములు మనసులో మాటల్లో, చేతల్లో, పుణ్యమనే అమృతంతో నిండి ఉంటారు. మూడులోకాలనూ, ఉపకారాలతో తృప్తిపరుస్తూ ఉంటారు. ఇతరుల గుణ లేశాలనుకూడా కొండంత చేసి మెచ్చుకుంటారు.

శత్రువు నుండి అయినా సద్గుణాన్ని గ్రహించ మన్నాడు. ఆ గుణానికి అతన్ని స్తుతించాలి కూడ. ఆ మెచ్చుకోలువల్ల అతని సద్గుణం విస్తరిస్తుంది. ప్రజలకు శుభప్రద మవుతుంది. అందుచేత సద్గుణాన్ని శ్లాఘించడం చాలా అవసరం.

దోషాలను ఉగ్గడించరాదు. అంతేకాదు. విడిచి పెట్టాలికూడ. హంస పాలు త్రాగి నీరు వదలి వేస్తుందట. దీన్ని క్షీరనీర న్యాయం అంటారు. అట్లాగే గుణాలను గ్రహించి దోషాలను విడిచి పెట్టడం సజ్జన లక్షణం. ***

శోక భయ స్థానంబు ల
నేకంబులు గలిగినను విహీన వివేకుం
డా కులతఁ బొందునట్లు వి
వేకము గలవాఁడు బుద్ధివికలుం డగునే 3_1_20

శోకానికీ, భయానికీ ఆస్పదమయిన సంఘటనలు ఎన్నికలిగినా వివేకం లేనివాడు ఆకులత పొందినట్లుగా పండితుడు విచారం పొందడు. వ్యాకుల పడడు.

అరణ్యాలకు వెళ్లిన పాండవులతో విప్రులంతా వెళ్ళారు దుర్యోధనుడి దగ్గర ఉండలేమంటూ-వాళ్ళను ధర్మజుడు ఎంత వారించినా వాళ్ళు వినలేదు. అపుడు ధర్మరాజు ఇట్లా అనుకుంటాడు. ఇదివరకు వీరంతా మృష్టాన్నం తిని బ్రతుకుతూ ఉన్నవాళ్ళు, ఇపుడు కందమూల ఫలాలు తింటూ ఉంటే ఎట్లా చూడగలను ? అనుకొని శోకంతో మూర్ఛపోయాడు ధర్మరాజు-అతణ్ణి ఓదార్చి శౌనకుడనే బ్రహ్మర్షి ఈ విషయాలు అన్నీ చెపుతాడు.

ఆధ్యాత్మిక ధర్మప్రబోధం భారతం అంతటా కనిపిస్తూ ఉన్నా ఆరణ్య పర్వం, శాంతి పర్వం- అనుశాసనిక పర్వం ప్రధానమయినవి-అందులో అరణ్యపర్వం మొదట్లో ఈ ప్రబోధం కనిపిస్తుంది. పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం చేయవలసిన పాండవులకు మానసికంగా ధైర్యం అవసరం. అందుకు కావలసినంత మోతాదులో ఈ ప్రబోధం చేస్తాడు.

మూలంలో చాలా ప్రసిద్ధ మయిన శ్లోకం ఇది. విష్ణుశర్మ ఇటువంటి శ్లోకా లెన్నిటినో సొంతం చేసుకున్నాడు.

శోకస్థాన సహస్రాణి భయస్థాన శతాని చ
దివసే దివసే మూఢ మావిశన్తి న పండితమ్

శోకకారణం కానీ, భయ కారణం కానీ కలిగితే అవివేకి వికలు డయి క్రుంగిపోతాడు. కాని పండితుడు దాన్ని మనసులో పట్టించుకోడు. వికలుడు కాడు. అందుకే అతడు వివేకి. విపత్కాలంలో భయపడడం, విస్మయపడడం ఇవి కాపురుష లక్షణాలు. దుఃఖంలో క్రుంగి పోకుండా, సుఖాలమీద కోరిక లేకుండా, ( పొంగిపోకుండా ) దేనివల్లా భయపడకుండా, దేనిమీదా కోపం కానీ, అనురాగం కానీ లేకుండా ఉన్న వాడే స్థితప్రజ్ఞుడని భగవద్గీత బోధిస్తుంది.

దుఃఖే ష్వనుద్విగ్న మనాః సుఖేషు విగతస్పృహః
వీతరాగ భయక్రోధః స్థితధీర్ముని రుచ్యతే

ఇక్కడ ధర్మరాజుకు శోకకారణం ఏర్పడింది. దానికి వివేకి అయిన ధర్మరాజు అంతగా పరితపించరాదని శౌనకుడు సూచిస్తున్నాడు.

“ విపది ధైర్య మథాభ్యుదయే క్షమా ” అంటాడు భర్తృహరి - ఆపద లలో ధైర్యం ఉండాలట- ధైర్యానికి భర్తృహరి అగ్నిహోత్రుణ్ణి ఉదాహరిస్తాడు. అగ్నిని ఎంత తలక్రిందులు చేసినా దాని జ్వాలా పైకే పోతుండట - మానవుడు ఆపదలో అట్లాఉండాలి. కష్టాల్లో హృదయం రాయిలాగా ఉంచుకోవాలి. ***

శారీర మానస మహా
దారుణ దుఃఖములఁ జేసి తఱిగి శరీరుల్
క్రూర తర బాధఁ బొందుదు
రా రెంటిని జెఱుతు రాప్తు లమలిన బుద్ధిన్ 3-1-21

దుఃఖాలు రెండు విధాలు శారీరకం-మానసికం- ఈ రెండు విధాల దుఃఖాం తోనూ మానవులు కృశించిపోతూ ఎంతో బాధ పడుతూ ఉంటారు. పండితులయినవారు నిర్మల బుద్ధితో ఈ రెంటినీ శమింప జేసుకుంటారు.

శారీరక మయిన దుఃఖాలు నాలుగు విధాల ఏర్పడతాయి. వ్యాధివల్లనూ, శ్రమవల్లనూ, [1] ఇష్టం కానిదాన్ని స్పృశించడం వల్లనూ, ఇష్ట మయిన దాన్ని విడవడంవల్లనూ ఏర్పడతాయి. వెనువెంటనే చేసే ఉపచారాలవల్ల ఇవి ఉపశమిస్తాయి. ( ఆశు క్రియాది ప్రతియోగంబుల )

మానసిక దుఃఖం శారీరకదుఃఖం కంటె చాలా తీవ్ర మయింది. ఇది మనోవ్యాధి. మనోవ్యాధికి మందు లేదంటారు. పైకి ఏ మందూ లేదు. నిజమే-కాని వ్యాసులవారు మనస్సుకే మందు వేస్తున్నారు.

మానసిక దుఃఖానికి మూలం స్నేహం. అనగా attachment ఆసక్తి-మమకారం- ఈ స్నేహం వల్లనే దుఃఖమూ-భయమూ- శోకమూ - హర్షమూ-ఆయాసమూ - ఒకటేమిటి ? అన్నీ పుట్టుకొస్తాయి. స్నేహం అనేది (మమకారం ) ఒక సముద్రం లాంటిది. సముద్రంలో క్షణక్షణమూ ఎన్నో కెరటాలు లేచి పడుతూ ఉంటాయి. అట్లాగే స్నేహం వల్ల ఎన్నోభావాలు ఉద్భవిస్తూ ఉంటాయి. వాటివల్ల తుదిగా దుఃఖమే సంభవిస్తుంది.

స్నేహార్ణవ మగ్నుండయి
దేహి మహాదుఃఖముల నధృతిఁ బొందును దుః
ఖాహతుఁడు శోక తాప వి
మోహి యగున్ స్నేహమూలములు రాగాదుల్ 3—1—23.

రాగమూ, ద్వేషమూ, శోకమూ- మోహమూ అన్నీ స్నేహం వల్లనే కలుగుతాయి. ఈ మానసిక దఃఖం వల్ల శరీరం కూడ ఉడికి పోతుంది. కాలిన ఇనుప గుండును నీటి కుండలోవేస్తే నీళ్ళు కుతకుత ఉడుకుతాయి. అట్లాగే మానసిక దుఃఖంవల్ల శరీరం ఉడికిపోతుంది. ఈ దుఃఖానికి కారణం స్నేహం. కనుక ముందుగాస్నేహం స్నేహాన్ని విడిచి పెట్టాలి. ( ధనేషణ - దారేషణ - పుత్రేషణ ఈ మూడూ ఈషణ త్రయం అంటారు ) ఈ త్యాగానికి జ్ఞానం అవసరం. జ్ఞాని అయినవాడు స్నేహాన్ని

---

[1] ఇష్టంకాని దాన్ని స్పృశించడం అంటే అగ్ని మొ॥ వాటిని ముట్టుకోవడం ప్రమాద వశాత్తు శరీరావయవాలు పోవడం - తద్వారా దుఃఖం కలగడం - దీన్ని ఇష్టమయిన దాన్ని వర్జించడంగా పేర్కొనవచ్చు.

త్యజిస్తాడు. ప్రపంచంలో ప్రవర్తిస్తున్నా తామరాకు మీది నీటిబొట్టులా ఏమీ అంటదు అతడికి. వాడె స్థితప్రజ్ఞుడని భగవద్గీత.

యస్సర్వత్రానభిస్నేహ స్తత్త త్ప్రాప్య శుభాశుభమ్
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా

అంతటా మమతారహితుడై ఉంటూ శుభానికి సంతోషమూ-అశుభానికి దుఃఖమూ లేని వాని ప్రతిజ్ఞ స్థిరమైనది. అతడె స్థితప్రజ్ఞుడు.

అరణ్యపర్వంలో ధర్మరాజుకు క్లుప్తంగానూ-భీష్మ పర్వంలో అర్జునుడికి వివరంగానూ - వారి వారి అధికారి తారతమ్యాలను బట్టి బోధింపబడింది.

అది సర్వదోషముల కా
స్పద మరి దురిత క్రియాను బంధంబునకున్
మొదట నిరంతర దుఃఖ
ప్రదమని మదిఁ దలఁచి తృష్ణఁ బాతురు సుమతుల్ 3—1—25

తృష్ణ ( కోరిక-ఆశ ) సకల దోషాలకూ నిలయం. పాపకార్యాలకు ప్రారంభం- పైగా నిరంతరమూ దుఃఖాన్ని కలిగిస్తుంది. అందుచేత బుద్ధిమంతులు తృష్ణను విడిచి పెడతారు.

మమతను బట్టి కోరిక ఏర్పడుతుంది. అదే తృష్ణగా వృద్ధిచెందుతుంది. ఈ తృష్ణకు ఆదీ, అంతమూ ఉండవు. అగ్నిసదృశ మయింది ఈ తృష్ణ - మన స్సును చివరికి దహించి వేస్తుంది. " ఆశా పాశము తా కడు న్నిడుపు " అన్నారు పోతన్నగారు. తృష్ణతో యాచన మనిషికి చిన్నతనాన్ని కలిగిస్తుంది. బలిచక్రవర్తి అడగటానికి వెళ్ళే విష్ణుమూర్తికి కూడ వామనత్వం సంక్రమించింది.

లోకమంతా ఆశకు దాస్యంచేస్తోంది. ఆశకు దాసుడయితే వాడు అందరికీ దాసుడే. ఆశను విడిచిపెడితే వాడికి లోకం అంతా దాస్యం చేస్తుంది. ఆశను వీడి నైరాశ్యం అవలంబించిన వాడు సర్వ ధర్మాలు అనుష్ఠించినట్లే. లోకంలో తృష్ణ

ఒక్కటే నశిస్తే ధనికదారిద్ర్య భేదమే లేదు. తృష్ణాక్షయం వల్ల అనిర్వాచ్య మయిన సుఖం కలుగుతుంది. ఈ లోకంలో పొందే కామసుఖంగానీ. పరలోకంలో పొందే దివ్యసుఖంగానీ తృష్ణాక్షయం వల్ల కలిగే సుఖంలో పదహారో వంతుకూడా కావు.

యత్ర కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్
తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్

తృష్ణ పోతే మానవుని మనస్సు నిత్యమూ సంతోషంతో నిండిపోతుంది. అప్పు డతడికి సర్వసంపదలూ చేకూరినట్లే అన్ని సంపదలూ సంపాదించేందుకు ఎన్నో యాతనలు పడటం కంటె ఒక్క సంతుష్టిని అలవరచుకుంటే మేలు. దానితో సర్వసంపదలూ చేకూరుతాయి. భూమి అంతా ముళ్ళతో నిండి ఉంటే ఆ ముళ్ళన్నీ తీసుకుంటూ నడవటం కంటె తన కాలికి చెప్పులు వేసుకోవటం మేలు. అప్పుతడనికి భూమి అంతా చర్మావృతమైనట్లు మెత్తగా ఉన్నట్లు అనిపిస్తుంది.

సర్వాః సంపత్తయ స్తస్య సంతుష్టం యస్య మానసమ్
ఉపానద్గూఢ పాదస్య నను చర్మావృతేవ భూః ***

జలములందు మత్స్యంబులు చదలఁ బక్షు
లామిషం బెట్లు భుజియించు నట్లు దివిరి
యెల్ల వారును జేరి యనేక విధుల
ననుదినంబును భక్షింతు రర్థవంతు 3-1-27

అర్థము యనర్థమూలం
బర్థమ మాయావిమోహా నావహాము నరుం
డర్థార్జన దుఃఖమున న
పార్థకృత జన్ముఁడగుట పరమార్థమిలన్ 3-1-28

నీటిలో చేపలూ, ఆకాశంలో పక్షులూ మాంసాన్ని భక్షించినట్లుగా ధనవంతుణ్ణి అందరూ అనేక విధాల భక్షిస్తారు.

ధనమే అన్ని అనర్థాలకు హేతువు. ధనమే మాయనూ, మోహాన్ని సృష్టిస్తుంది. మానవుడు ధన సంపాదనకోసం దుఃఖిస్తూ జన్మను అపార్థం చేసుకుం టున్నాడు.

"ధనమూలం మిదం జగత్" అనే భావంతో ధనాన్ని ప్రజలంతా అభిలషిస్తారు. బెల్లం ఉన్నచోటికే చీమలు చేరుతాయి. అట్లాగే ధనవంతుడి దగ్గరకు ప్రజలు చేరుతారు. ఆ ధనాన్ని ఏ విధంగా గ్రహించాలా అని శతవిధాల ప్రయత్నిస్తారు. అయితే బెల్లం చీమలకు ఆహారం. మానవులకు ధనం ఆహారం కాదు కదా అనవచ్చు. మానవులకు ధనం ఉంటేనే చాలు పుష్టినిస్తుంది. ఉన్నది పుష్టి మానవులకు - పశువులకు తిన్నది పుష్టి. అందుచేత మానవులకు ధనంకూడా ఆహారంతో సమానమే.

ధనవంతుణ్ణి అందరూ ఆశ్రయిస్తారు. ఈ ఆశ్రయం ధనాశతోనే. ఆకాశంలో పక్షులు మాంసాన్ని ఎగరేసుకు పోయినట్లు- దొరికితే చాలు- మానవులు ధనాన్ని అట్లా ఎగరేసుకుపోతారు. నీటిలో చేపలు కన్పడకుండా మాంసాన్ని తినేస్తాయి. అట్లాగే కొంతమంది ఏమాత్రమూ అనకుండా ధనం హరిస్తారు.

అందుకే అర్థం అనర్థహేతువు - ధనవంతుడికి నిద్రకూడా సరిగాపట్టదు. ధనం రక్షించుకోవాలనే తపనతో - డబ్బుతో మదమూ, మోహమూ కలుగుతాయి. దానితో కలవాడు జన్మను సార్థకం చేసుకోలేడు. అందుకే అసలు ధనమే దుఃఖ భాజనం అంటాడు.

అర్థానా మార్జనే దుఃఖ మార్జితానాంతు రక్షణే
ఆయే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థం దుఃఖభాజనమ్

ధనాన్ని సంపాదించేందుకు ఎన్నో యాతనలు పడాలి. ఆ యాతన లన్నీ పడి డబ్బు సంపాదిస్తే దాన్ని రక్షించుకోవడం మరో కష్టం. అది ఖర్చయి పోతూ ఉంటే ఎంతో దుఃఖమూ బాధా కలుగుతాయి. సంపాదనలో దుఃఖం-రక్షణలో దుఃఖం - ఖర్చులో దుఃఖం. అసలీ ధనమే మొత్తానికి దుఃఖప్రదం- అయినా యీ ధనం చుట్టూ లోకం గిరగిరా తిరుగుతోంది. దాని ఆకర్షణశక్తి అటువంటిది. దాని ప్రభావంలోంచి తప్పించుకోవడం సులభ సాధ్యంకాదు.

అసలు నరజన్మ ఎత్తినందుకు ముందు మానవుడు సంతోషించాలి. ఏ పశువుగానో పుట్టకుండా. ఈ జన్మ సార్థకం చేసుకోవాలంటే తురీయ పురుషార్థం, అంటే ముక్తి కోసం ప్రయత్నించాలి. కాని మానవుడు తన జీవితం అంతా ధన సంపాదన కోసమే వ్యర్థం చేస్తున్నాడు. జీవితాన్ని అపార్థం చేస్తున్నాడు.

అయితే ఇక్కడ ధనసంపాదనం ధర్మనిర్వహణకోసం అనవచ్చు. నిజమే కాని అపుడు అతిగా సంచయం చేయకూడదు. దీనికి మరోసమాధానంకూడా ఉంది. ప్రజల్ని తృప్తిపరచడంకోసమో లేక ధర్మ నిర్వహణ కోసమో, ధనాన్ని సంపాదిస్తున్నాననుకోవడం, సమాధాన పడటం సమంజసంకాదు. కాళ్ళు కావాలని బురద చేసుకుని తర్వాత కడుక్కొనే కంటే అసలు బురద చేసుకోక పోవడంమేలు.

ధర్మార్థం యస్య విత్తేహా వరంతస్య నిరీహతా
ప్రక్షాళనాద్ధి పంకస్య శ్రేయో న స్పర్శనం నృణామ్

ఆరణ్య పర్వ - 2–49

ధర్మంకోసం డబ్బు సంపాదించడం కంటె కోరిక లేకుండా నిరీహతతో ఊరుకోవడం మేలు. నిరీహత అలవరచుకుంటే అతనికి ఏమీ అంటవు. కర్మఫలాలు కూడా అంటవు. తామరాకుమీద నీటి బొట్టులా ఉంటాడు. ప్రపంచంలో ఉన్నా తనకేమి పట్టదు. అట్లాగే కర్మఫలాలున్నూ. తద్వారా మోక్షం కలుగుతుంది కర్మ సంక్షయం అయి.

అందుచేత నిరీహత్వం - మమతా రాహిత్యం ముక్తికి సోపానాలు. *

హారి విషయాభిలాషము
గాలణముగ నెంత యెఱుక గలవారును దు
ర్వార వికారముఁ బొందెదు
వారు, నిజేంద్రియము లవి యవశ్యము లగుటన్ 3–1–32

విషయ సుఖాలమీది అభిలాషవల్ల ఎంత జ్ఞాని లయినా ఆపుకోలేని వికారాన్ని పొందుతారు. అవి మనస్సును హరిస్తాయి. వారికి ఇంద్రియాలు వశంలో ఉండవు. విచ్చల విడిగా తిరుగుతాయి.

మానవుని ఇంద్రియాలు చాలా బలవంతము లయినవి. మానవుని వశంలో ఉండవు. ఇంద్రియాలు వాటి యిష్టం వచ్చినట్లు మానవుణ్ణి నడిపిస్తాయి. అసమర్థుడయిన రౌతు దుష్టమయిన గుఱ్ఱాన్ని అదుపులో పెట్టలేడు. అట్లాగే మానవుడు ఇంద్రియాలను వశంలో ఉంచుకోలేడు. ఎంత జ్ఞానం ఉన్నవారయినా ఒక్కొక్కప్పుడు ఇంద్రియాల వలలో చిక్కుకుంటారు. అందుకే "బలవానింద్రియ గ్రామో

విద్వాంస మపి కర్షతి " అన్నాడు మనువు. విషయ సుఖాల్లో దృష్టినిలిపే వానికి లోభం ఏర్పడుతుంది. అది అగ్ని వంటిది. అందులో అతడు మిడతలాగా పడతాడు. లోభం నుండి మోహం పుడుతుంది. విషయ సుఖాల్లో చిక్కుకుని సంసార పతితులయిన వారి మనస్సు రథచక్రం లాగా అవిద్యలోనే తిరుగాడుతూ ఉంటుంది. అందు చేత అభిమానంతో ఆసక్తితో దేనిమీద ప్రవర్తించకూడదు. నిరీహమైన సత్కర్మానుష్ఠానంతో జీవితం గడిపితే సంసారచక్రంనుండి మానవుడు విడివడి ముక్తిని పొందుతాడు. ***

ఎల్ల నెయ్యములకుఁ దల్లిదండ్రులయందు
సుతుల వలని నెయ్య మతిశయంబు
ధనము లెంత గలిగినను సుతరహితుల
కెమ్మెయిని మనఃప్రియమ్ము లేదు. 3—1—81

అన్ని స్నేహాలకంటె ( మమకారాలకంటె ) తల్లిదండ్రులకు కొడుకుల మీద స్నేహమూ, వ్యామోహమూ ఎక్కువగా ఉంటాయి. ఎంత డబ్బు ఉన్నా ఎన్ని సంపదలున్నా పుత్రులు లేని వారి మనస్సుకు ప్రీతి, సంతోషమూ ఉండవు.

పాండవులు అరణ్యవాసం చేస్తున్నారు. అప్పుడు దుర్యోధనుడికి ఓ దుర్బుద్ధి పుట్టింది. పాండవులిప్పుడు దుర్బలులు. వాళ్ళమీదికి చతురంగ బలాలతో దండెత్తి వెళ్ళి సంహరిస్తే బాగుంటుంది అని. ఈ ఊహతో సమరసన్నాహం చేస్తున్నాడు. వ్యాసు డీ విషయం దివ్యదృష్టితో తెలుసుకున్నాడు. వెంటనే వచ్చాడు. " ఇది ధర్మం కాదు. ఈ ప్రయత్నం మాను " మని దుర్యోధనుణ్ణి వారించాడు. తర్వాత ధృతరాష్ట్రుడితో" నీవూ, నేనూ, భీష్ముడూ, విదురుడూ ఉండగా ఇటువంటి అధర్మాన్ని ఉపేక్షించవచ్చా ? అన్నాడు. అపుడు ధృతరాష్ట్రుడు జూదమే నాకూ ఇష్టంలే దసలు. నాకే కాదు గాంధారికీ, భీష్మ విదురులకూ కృపద్రోణులకూ ఇష్టం లేదు. అయినా దుర్యోధనుణ్ణి పుత్రవ్యామోహంతో విడువలేకున్నాను. ఏంచెయ్యను? అంటాడు. దానికి సమాధానంగా వ్యాసు డింద్రసురభి సంవాదం చెప్పబోతూ ఈ మాట లంటాడు.

తల్లిదండ్రులకు కొడుకు మీద మమకారం ఎక్కువగా ఉంటుంది. తన నీడను తాను నీళ్ళలో చూచి సంతోషించి నట్లుగా పుత్రుణ్ణి చూచి తల్లిదండ్రులు సంతోషిస్తారు. దానికి కారణం భవభూతి కమ్మగా ఇట్లా చెపుతాడు.

అంతః కరణ తత్త్వస్య దంపత్యోః స్నేహ సంశ్రయాత్
ఆనందగ్రంథి రేకో௨ య మపత్య మితి కథ్యతే-

ఉత్తరరామచరిత్ర - 3-12

పరస్పరానురాగంతో కూడిన దంపతుల అంతః కరణాలకు ఆనందగ్రంథి అపత్యం అంటాడు. "ఆత్మా వై పుత్రనామాసి" అని వేదం చెపుతోంది. తానే మళ్ళీ పుత్రుడుగా పుడుతున్నాడని. ఒక దీపం నుండి మరో దీపం ముట్టించి నట్లుగా తండ్రి నుండి పుత్రుడు పుడుతున్నాడు- అందుకే తన ప్రతిరూపం వంటికొడుకును చూచి తండ్రి ఎంతో సంతోషిస్తాడట.

అయితే ఈ ఆనందం అంతా కొడుకు సన్మార్గు డైతేనే. దుర్మార్గు డయితే అంత దుఃఖం మరేది లేదు. ఉదాహరణం ఈ దుర్యోధనుడే- ధృతరాష్ట్రిడి కొడుకు కులవి షమయ్యాడు దుర్మార్గుడై-సన్మార్గు డయిన కొడుకు కొన్నితరాల వారిని తరింప జేస్తాడు-ధర్మరాజులాగా- ***

అధిక దుఃఖ రోగార్తున కౌషధంబు
సురుచిరంబుగ భార్యయ చూవె యెందు
నొనర భార్యాసమేతుఁడై యున్నవాని
కెంత లయ్యును నాపద లెఱుక పడవు 3_2_74

అలసి నెడ డస్సి నెడ నాఁ
కలి దప్పియు నైన యెడలఁ గడుకొని ధరణీ
తలనాథ ! పురుషునకు ని
మ్ముల భార్యయ పాచుఁ జిత్తమున దుఃఖంబుల్ 3_2_75

దుఃఖార్తుడికి భార్యయే ఔషధం. భార్యాసమేతు డయినవానికి ఎంతటి ఆపద లయినా తెలియవు.

నిర్వేదం కలిగినా, శ్రమ కలిగినా, అలసిపోయినా, ఆకలి దప్పులయినా ఆ దుఃఖాలన్నీ భార్యయే పోగొడుతుంది.

జూదంలో రాజ్యం పోగొట్టుకొని నలుడు అడవులకు వెళ్లాడు. అక్కడ దమయంతితో "నువ్వు నీ బంధువుల దగ్గరకు పో" అంటాడు. ఇద్దరం విడర్భకు

వెడదాం అంటుంది దమయంతి. సర్వస్వం పోగొట్టుకొని నేను రాలేను విదర్భట అంటాడు ( విదర్భ అత్తవారిల్లు ) నలుడు. అపుడు దమయంతి నలుడితో పైమాకు లంటుంది. తన్నుకూడ నలుడితో వచ్చేందుకు అనుమతించమంటూ.

"న భార్యాయాః పరం సుఖమ్" భార్యను మించిన సుఖంలేదు అని ఆర్యు లంటారు. పురుషుణ్ణి అన్నివిధాలా, అన్నివేళలా సుఖపెట్టేది భార్యయే. భారతీయ ధర్మంలో భార్యకు గురుతర మయిన బాధ్యతాలు గౌరవమూ ఉన్నాయి. భార్యను సహధర్మచారిణి అంటారు. అన్నిటా భర్తతోకూడి ధర్మం ఆచరిస్తుంది. ఆచరింపజేస్తుంది. భార్య పురుషునిలో సగం అని భారతం చెపుతుంది. అందుకే అర్ధాంగి అనే పేరు వచ్చింది. అనగా తనువూ - మనమూ - ఈ రెండింటిలోనూ ఐకమత్యం ఉండాలి భార్యాభర్తలకు - అందుకే పుత్రపౌత్రాదు లెంతమంది ఉన్నా భార్యలేని గృహం శూన్యం అంటారు.

పుత్రపౌత్ర వధూ భృత్యైః సంపూర్ణ మపి సర్వదా
భార్యాహీన గృహస్థస్య శూన్యమేవ గృహం మతమ్

కష్టాల్లో భార్య ఆదుకుంటుంది. పాలు పంచుకొని దుఃఖతీవ్రతను తగ్గిస్తుంది. ఎటువంటి ఆపదల్లో చిక్కుకున్నా తన భార్యాపుత్రుల్ని చూడగల్గిన వారికి దుఃఖాలన్నీ తొలగిపోతాయి. ధర్మార్థ కామాల్ని సాధించడానికి భార్య ఉప కరణం- వంశం నిలబెట్టడానికి ఆధారం భార్య- పురుషుడి గౌరవాగౌరవాలకు కూడా స్త్రీయే కారణం. అందుచేత ఉన్నతగుణాలకు నిలయమై భార్య భర్తకు ప్రియంగా ఉంటుంది. అందుకే వ్యాసులవారు "నాస్తి భార్యా సమం మిత్రమ్" అని తేల్చి చెప్పారు.

భార్యకు కూడ భర్తను మించిన గురువు లేడు. భర్తయే భార్యకు అలంకారం- ముక్కుతిమ్మన "పతి ప్రాణసదృశబంధువు, పతి దైవం, బేడుగడయు" అంటాడు. పతిభక్తి సతికి అలంకారప్రాయ మైనదట.

అనపహార్యంబు తేజోమయంబు సర్వ
గుణములకు నలంకారంబు గురుతరంబు
భామలకుఁ బతిభక్తియ పరమమైన
భూషణంబిట్టివే పెర భూషణమ్ములు 3-2-143

పతిభక్తి అపహసింపరానిది. తేజస్వంతము - అన్నిగుణాలకూ అలంకారం గౌరవప్రదం - ఏ నగలూ పతిభక్తితో సాటిరావు-

"పతి రేకో గురు స్త్రీణాం" అన్నారు పెద్దలు "భూషణం చ పతిః స్త్రీణాం" అని కూడా అన్నారు. సంసారపు బండికి ఆలుమగలు రెండు చక్రాల వంటివారు. ఒకరి కొకరు అనుకూలంగా అనురక్తులై మెలగాలి - అపుడే యిరువురి జీవితం సుఖప్రదమవుతుంది. **

అలయక యేండ్లు గడుం బె
క్కులు జీవించుట, నర గలుగుటయుఁ దగు వృ
ద్ధుల లక్షణమే జ్ఞానము
గలఁడేనిన్ బాలుఁడయినఁ గడువృద్ధు మహిన్ 3—3—248

ఎక్కువ ఏళ్ళు జీవించడం - తల నెఱవడం - ఇవికాదు వృద్ధుల లక్షణాలు. జ్ఞానం ఒక్కటే వృద్ధలక్షణం - జ్ఞానం ఉంటే బాలు డయినా వృద్ధుడే.

అష్టావక్రుడూ, శ్వేతకేతుడూ జనకమహారాజు యజ్ఞానికి వెళ్లారు. అక్కడ ద్వారికుని చేత అడ్డగింపబడ్డారు. వృద్ధ విద్వాంసులూ, యాజ్ఞికులూ మాత్రమే ప్రవేశించటానికి అర్హమైన దీ సభ. చిన్నపిల్లలయిన మీరు ప్రవేశింపరాదు ద్వారికుడు-అపుడు వారిరువురూ అంటారు ఈ మాటలు.

వృద్ధత్వం అంటే తల నెఱవడమూ కాదు. వయస్సు మళ్ళడమూ కాదు. అది కేవలం వయోవృద్ధత్వం మాత్రమే. అది సరి అయినది కాదు. జ్ఞాన వృద్ధత్వమే వృద్ధత్వం. చిన్నవాడయినా జ్ఞానం ఉంటే వృద్ధుడు గానే పరిగణించాలి. - ఉత్తమ జ్ఞాన వృద్ధునా నుంచె నేని ; బాలుడయ్యును పూజ్యుండు.... అంటారు నన్నయ గారు. మనుస్మృతికూడా ఇదే భావం వ్యక్తీకరించింది.

న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః
యో వై యువా ప్యధీయానస్తం దేవాః స్థవిరం విదుః 2—156

అయితే జ్ఞానమూ, ధర్మమూ మొదలయినవి తెలిస్తే చాలదు, ఆచరించాలి. ఆచరణలో ఉంచాలి,

సత్యం తపోజ్ఞాన మహింసతా చ
విద్వత్ప్రణామం చ సుశీలతా చ
ఏతాని యో ధారయతే స విద్వాన్
న కేవలం యః పఠతే స విద్వాన్

సత్యమూ - తపమూ - జ్ఞానమూ - అహింసా - విద్వాంసులకు ప్రణామమూ - సుశీలమూ ఇవి ఆచరించినవాడే పండితుడు. వృద్ధుడు. కేవలం చదివిన వాడుకాదు. అందుకే "ఎఱిగిన దానిని మఱవకనుష్ఠించినది" అని హితవు చెప్పారు నన్నయ యయాతిరూపంలో. * *

కార్య సిద్ధి పొందు కాలంబు దేశంబు
నెఱిగి బుద్ధిమంతు లెల్ల ప్రొద్దు
సాహసంబు విడిచి సామాద్యుపాయ ప్ర
యుక్తి చేయుదురు యథోచితముగ 3_3_348

కార్యం సిద్ధించాలంటే దేశకాలాలు తెలుసుకొని బుద్ధిమంతులు సాహసం విడిచి సామము మొ॥ ఉపాయాలతో తగినట్లు ప్రవర్తించాలి.

భీష్ముడు సౌగంధిక కమలం తెచ్చేందుకు వెళ్ళాడు. మధ్యలో హనుమంతుని కలిశాడు. అపుడు హనుమంతుడు భీముడికి ఉపదేశం చేస్తున్నాడు. దేవతలు భక్తిసాధ్యులు కానీ సాహస క్రియా సాధ్యులుకారు, అంటూ ఈ మాటలు చెపుతాడు.

ఎల్లప్పుడూ సాహసం పనికిరాదు. ఒక్కొక్కప్పుడు ఉపాయం కావాలి. ఆ ఉపాయాలు నాలుగు - సామ, దాన, భేద, దండ - ఉపాయాలు - కార్యసాధనకూ శత్రుజయానికి ఈ నాల్గూ ఉపాయాలు - సౌమ్యంగా హితంచేసి అతణ్ణి తృప్తిపరచి కార్యసాధన చేయడం సామోపాయం - ఎదుటివానికి దానంచేసి అతణ్ణి తృప్తిపరచి కార్యం సానుకూల పరచుకోవడం దానోపాయం - అదీ కుదరకపోతే భేదోపాయం - ప్రతికూలంగా ఉన్న ఇద్దరు స్నేహితులకు భేదంపెట్టి వారిద్దరికీ కలహంపెట్టి కార్యం సాధించుకోవడం భేదోపాయం - ఇదీ కుదరక పోతే అపుడు దండోపాయం - ఇది యుద్ధమే. దీనితో అటో ఇటో తేలిపోతుంది.

ఉపాయాలు ప్రయోగించేటప్పుడు కూడా దేశకాలాలు తెలియాలి. ఎల్లప్పుడూ సాహసం పనికిరాదు. ఉపాయంతో సాధించగలిగినపుడు సాహసం ప్రకటించడం గోటితో పోయేదానికి గొడ్డలి ప్రయోగించడం వంటిది. సాహసం పనికి రానపుడుకూడా ఉపాయం పనికి వస్తుంది. దానికి ఉదాహరణం ఈ ఘట్టమే. **

ధీరమతి యుక్తిఁ జేసి వి
చారింపగ నిక్కువంబు సర్వజన స్వ
ర్గా రోహణ సోపానం
బారఁగ ధర్మంబ చూవె యతి రమ్యంబై 3—1—229

ధీరులు బుద్ధితో ఆలోచించి చూస్తే అందరికీ స్వర్గారోహణానికి మెట్టు ధర్మమని తోస్తుంది.

అరణ్యంలో ద్రౌపది ధర్మరాజుతో మాట్లాడుతూ తమకష్టాలు గుర్తుచేసి "మీ ధర్మం మిమ్మల్ని ఏం రక్షించింది?" అని ధర్మాన్నీ విధాతనూ ఆక్షేపిస్తుంది. అపుడు ధర్మరాజు" ధర్మాన్ని తప్పకుండా ఆచరిస్తూ ఉన్న వ్యాసవసిష్ఠ నారదుల్ని చూస్తున్నాం కదా! ధర్మపరుణ్ణని పేరుపొందిన నేను ఇతరు లన్యాయం చేశారని అధర్మానికి ఒడిగడతానా?" అంటూ ఈమాట అంటాడు.

మానవులందరికీ ధర్మాచరణం ప్రధమకర్తవ్యం- "ధర్మో రక్షతి రక్షితః" అనికదా! అగీ గాక భగవంతుడు కూడా "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" ధర్మ సంస్థాపనం కోసం ప్రతి యుగంలోనూ పుడతాను, అని చెప్పు కున్నాడు. అందుకే స్వధర్మాచరణం ప్రతి మానవునికీ ఉత్తమ గతిని ప్రసాదిస్తుంది.

ధర్మరాజుకు కూడ ధర్మాచరణమే ఉత్తమగతిని ప్రసాదించింది. ధర్మంతో (ధర్మదేవతతో) స్వర్గాన్ని చేరాడు చివరకు- దాన్నికూడా నన్నయ ఇందులో సూచిస్తున్నాడు.

రథి కిమ్ము గాని యెడ సా
రథి ధృతి మెయిఁ గావ వలయు రథియును వత్సా
రథిఁ గావవలయు రథి సా
రథులు పరస్పరశరీరరక్షకు లగుటన్ 3_1_173

రథికుడికి వీలుకానప్పుడు సారథి ధైర్యంతో రథికుణ్ణి కాపాడాలి. అట్లాగా రథికుడు కూడ సారథిని రక్షించాలి. రథికుడూ, సారథీ ఒకరి శరీరాన్ని మరొకరు రక్షిస్తూండాలి.

ప్రద్యుమ్నుడు సాల్వుడితో పోరాడుతూ మూర్ఛపోతాడు. అపుడు రథాన్ని దూరంగా తీసుక పోతాడు సారథి (దారుకుని కొడుకు) (కృష్ణుడికి సారథి దారకుడు. కృష్ణుడి కొడు కయిన ప్రద్యుమ్నుడికి దారుకుని కొడుకు సారథి). కొంత సేపటికి ప్రద్యుమ్నుడు తేరుకుంటాడు. ఎందుకీ తగదని పనిచేశావు. ఇది తప్పు సాల్వుని మీదికి రథం పోనియ్యి" మంటాడు. అప్పుడు సారథి అన్నమాటలివి.

రథి, సారథి అన్నపదాలూ, వాటిస్థితి యుద్ధనీతికి సంబంధించినవి. యుద్ధరంగంలో సారథి ప్రతికూలుడయితే రథికుడు చాలా దయనీయమైన స్థితికి లోనవుతాడు. శల్యుణ్ణి సారథిగా చేసుకొని కర్ణుడు అనుభవించినస్థితి అందరికీ తెలిసిందే. శల్యసారథ్యం చేయటం అన్నమాట ఈ నాటికీ తెలుగు వారినోట నాను తూనేవుంది.

ఇది యథార్థానికి రాజనీతి అయినా రథి సారథి పదాలను నడచేవాడు, నడిపించేవాడూ అన్న సాధారణభావంతో స్వీకరిస్తేఇది నిత్యజీవనరీతి అవుతుంది. వర్త మానసమాజంలోనడచేవాడూ, నడిపించేవాడూ;పాలకుడూ,పాలితుడూ;కర్త, కారయితా మొదలయిన వారంతా నిజానికి అన్యోన్యాశ్రయం కల వారైనా ఆవిషయాన్ని గుర్తించ లేక— గుర్తించక — ఎవరి మట్టుకు వారే పరిపూర్ణుల మనుకునే దుస్థితి వుంది. ప్రాథమిక పాఠశాలల మొదలు భారీ పరిశ్రమల వరకుకూడా ఈ వైమనస్యం, వైషమ్యం తొలగటం లేదు. "పరస్పరశరీర సంరక్షకులు" అన్న నన్నయ పదాన్ని అవగతం చేసుకొని ఆచరించగలస్థాయికి సమాజం పెరగవలసిన అవసరం ఎంతైనా వుంది. అధికార వ్యామోహాల కంటే కర్తవ్యతా పాలనలు ప్రధాన మన్న భావం హృదయాల్లో పొడసూపిననాడు నడచేవాడూ, నడిపించేవాడూ ఇద్దరు కూడా పదార్థ పరిపూర్ణతను సాధించటంలో భాగస్వాములన్న సత్యం జాతిజీవనంతో పెనవేసుకపోతుంది ***

తమ తమ కనియెడు తఱి జీ
తము గానక నవయు భటుల దౌర్గత్య విషా
దము లేలిన వాని కవ
శ్యము నెగ్గొనరించు నతఁడు శక్రుండయినన్ 2—1—38

జీతం లేకుండా కృశించే భటుల దుర్గతీ, విషాదమూ రాజుకు అవశ్యం కీడుకలిగిస్తాయి. ఆ రాజు ఇంద్రసమానుడైనా సరే ! ఇది తప్పదు.

రాజసూయం నిర్వహించమని ప్రేరణ చేసేందుకు నారదుడు ధర్మరాజు దగ్గరకు వచ్చి రాజ్యపాలనలోని విశేషాంశాలను కనుక్కుంటూ ధర్మరాజుకు చెప్పిన మాటలివి.

ఆధునికులలో చాలా మంది భావించే సామాజిక స్పృహలేని వ్యాసుడు వ్రాసిన మాటల కిది అనువాదం. ఈవిషయాన్ని నన్నయకన్న వ్యాసుడింకా సూటిగా స్పష్టంగా చెప్పాడేమో అనిపిస్తోంది. మూలంలోని శ్లోకాలను చూడండి —

కచ్చిద్బలస్య భక్తంచ వేతనం చ యథోచితమ్ ॥
సంప్రాప్తకాలం దాతవ్యం దదాసి న వికర్షసి ॥
కాలాతిక్రమణా ద్ధ్యేతే భక్తవేతనయోర్భృతాః
భర్తుః కుప్యంతి దౌర్గత్యాత్ సోఽనర్థః సుమహాన్స్మృతః ॥

సభాపర్వం 5 - 38, 39

వ్యాసుడు జీతంతో పాటు భత్యాన్ని కూడా పేర్కొన్నాడు. నన్నయ జీతాన్ని మాత్రమే ఉటంకించాడు. ఇది ఆయా కాలాలలో వచ్చిన మార్పేమో పరిశీలించాలి. అయితే నేటికి "జీతం భత్యం లేని ఉద్యోగ" మన్న నానుడి బాగానే స్థిరపడివుంది. జీతం భత్యం అనుకున్న కాలానికి ఇచ్చితీరాలి. కాలాతిక్రమణ మయితే భృత్యులు కోపించే అవకాశముంది.

జీతం, భత్యం రెండూ ఉన్న కాలంలోనే ఏపాటిజాప్యమూ లేకుండా ఇచ్చి తీరాలన్నాడు వ్యాసుడు. మరి జీతం మాత్రమే వున్న ఈ రోజుల్లో దానిని క్షణ మైనా ఆలస్యం చేయకుండా ఇవ్వాలన్న ఆలోచన ఆ స్థితిలో వున్నవారికి రాకపోవటం దురదృష్టం. నెలల తరబడి, సంవత్సరాల తరబడి జీతాలు లేక బాధ పడ్తున్నవాళ్ళెం దరో. అయితే వ్యాసుడు చెప్పిన కోపం వారికి వచ్చినా నిరాహారదీక్ష తప్ప మరేమీ

చేయలేని నిస్సహాయత వారిలో వుంది. ప్రజలు కష్టా లనుభవిస్తున్నారంటే తప్పు తనలోనే ఉండి తీరాలి అని పాలకులు అనుకునే రామరాజ్యం కాదుగదా ఇది. అందుకే అటువంటి నిస్సహాయతా దశలో సుమతీశతకం సూచించిన దారి చూడండి.

అడిగిన జీతం బియ్యని
మిడిమేలపు దొరను గొలిచి మిడుగుట కంటెన్
వడిగల యెద్దుల కట్టుక
మడి దున్నక బ్రతుక వచ్చు మహిలో సుమతీ !

ఇదే భావాన్ని మహిష శతకం కూడా సూచిస్తోంది. కాని మడిదున్నక బ్రతికే అవకాశమే వుంటే ఈ పాట్లెందుకు అనే ప్రజల సంఖ్యే ఎక్కువ. **

వార్తయందు జగము వర్తిల్లుచున్నది
యదియు లేని నాడ యఖిల జనులు
నంధకార మగ్నులగుదురు గావున
వార్త నిర్వహింపవలయు బతికి 2–1–51

వార్తయందే సమస్తం నిలిచివుంటుంది. ఆ వార్తయే లేకపోతే ప్రజ లంతా చీకట్లో చిక్కుకున్నట్లే. కాబట్టి రాజు వార్తానిర్వహణాన్ని తప్పనిసరిగా చేయాలి.

ఇదికూడా నారదుడు ధర్మరాజుతో పలికిన పలుకే. రాజనీతికి సంబంధించిన విద్యలు నాలుగు. అన్వీక్షకి - త్రయి - వార్త - దండనీతి అనునవి. సమస్త విజ్ఞానాన్ని తెలియజేసేది అన్వీక్షకి. ధర్మాధర్మవివేకాన్ని కల్గించేది త్రయి. అర్థాలర్థములు తెలిపేది వార్త. నయానయములను బోధించేది దండనీతి, ఈ చతుర్విద్యలలో ఒకటైన వార్తను నిర్వహించుచునే వున్నావు గదా అని నారదుడి ప్రశ్న.

ఈ చతుర్విద్యలలోను ప్రయత్నం యొక్క అర్థానర్థాలను తెలియజేసేది కాబట్టి వార్త ప్రధానమైన దనవచ్చును. జ్ఞానమైనా, ధర్మాధర్మాలైనా, నయనయాలైనా అర్థకారులా, అనర్థకారులా అన్న అంశాన్ని స్పష్టంగా తెలుసుకున్న తర్వాతనే ముందడుగు వేయాలి గదా!

ఈ అర్థానర్థ వివేచన మెట్లా చేయాలో నన్నయ తన పద్యంలో ప్రతిపాదించలేదు, కాని వ్యాసుడు (సాధుభి: జనై: ) సజ్జలతో కూడి వార్తను అనుష్ఠించుచునే ఉన్నావు గదా! అని కొంచెం వివరించాడు. అంటే అర్థానర్థనిర్ణయంలో రాజు తగిన వారితో కలసి చర్చించి నిర్ణయించాలే గానీ తన ఆలోచనమే సమగ్రమన్న భావంతో వ్యవహరించకూడదు. ఆ విధమైన ప్రవృత్తి అర్థకారి కాకపోగా అనర్థాలను కల్గించే అవకాశం ఎక్కువ. కాబట్టి సలహా సంఘాల వంటివాటిని పాలకులు ఏర్పరచుకొని వారి సూచనల మేరకు కార్యాకార్యాలు తెలుసుకొని నడచుకోవటం ఉత్తమం.

నన్నయ భారతభాగంలో ప్రసిద్ధ మయిన సూక్తి రత్నాలు, వాటి వెలుగులూ ప్రదర్శింపబడ్డాయి. ఇంకా ఎన్నో పద్యాలు, పద్యభాగాలు, వచన భాగాలు ఉన్నాయి. వాటిని పాఠకుల ఆలోచనకూ అవగాహనకూ వదలుతున్నాము. అయినా పూర్తిగా విడవటం సంభావ్యం కాదనే ఊహతో వాటిని ఇక్కడ పొందుపరుస్తున్నాం. ఇంత వరకూ చదివిన వాటి మీదా, ఇకముందు చదివే వాటి మీదా కలిగే ఊహలు నన్నయ భారతాన్ని చదివేందుకు ప్రేరణ నిస్తాయని విశ్వాసం.

# పద్యాలు

వేద విహిత విధుల నాదరించుట యూర్ధ్వ
గతికిఁ దెరువు ; విధులఁ గడచి యెందు
నాఁగఁబడిన వాని లోఁగక చేయుట
యధమగతికి మార్గ మనిరి బుధులు 1-3-220

మానాగ్నిహోత్రమును మఱి
మానాధ్యయనమును, మానమౌనంబు, నవి
జ్ఞానమున మానయజ్ఞము
నా నయథార్థంబు లివియు నాలుగు నుర్విన్ 1-3-222

కులముగలవాఁడు, శౌర్యము
గలవాఁడును, నధికసేన గలవాఁడును భూ
తలమున రాజను నామము
విలసిల్లఁగఁ దాల్చు మూఁడు విధముల పేర్మిన్ 1-6-47

విను బేల! యెట్టి కష్టుఁడు
దన పురుష గుణంబు సెడఁగఁ దల్లినిఁదోఁబు
ట్టిన వారి విడచి రాగం
బునఁ జపల స్త్రీ సుఖంబు పొందునె చెప్పుమా! 1-6-197

వధకు సన్నద్ధుఁడై వచ్చిన వానిఁ జంపి
తప్పెంగు ధర్మమన; యిది చాల నిజము: దీని
కలుగఁ జన; దాత్మరక్షకు నగ్గలంబు
ధర్మరక్షయ యుత్తమ ధార్మికులకు 1-6-220

పితృ సంకల్పము సేయఁగ
సుతుల కవశ్యమును వలయు; సుతజన్మఫలం
బతి ముదమునఁ బితృవరులకు
హిత మొనరించుటయ కాదె యెంతయు భక్తిన్ 2-1-94

పూజితుల తృప్తులగుదురు
భూజనులారు; లచ్యుతుండు పూజితుఁడగుడుం
దేజమున జగత్త్రితయముఁ
బూజితవయి తృప్తిఁ బొందుఁ బుణ్యసమృద్ధిన్ 2-2-28

అన్యకీర్తనంబు నన్యనిందయుఁ దన్నుఁ
బరగఁ బొగడికోలుఁ బ్రబ్బికోలు
నాపగా తనూజ! యోగ్యవృత్తములు గా
వనిరి వీని నార్యులయిన మునులు 2-2-49

పరమ సుఖోపాయంబునఁ
బరసంపద చేకొనంగఁ బడునేని నరే
శ్వర! యంతకంటె మిక్కిలి
పురుషార్థం బెద్ది యుండు భూనాథులకున్ 2-2-142

[illegible]ల మార్గులయిన కుత్సిత కితవుల
తోడఁ గడఁగి జూద మాడఁ జనదు
దానఁ జేసి యుక్తధర్మ వివర్జితు
లగుదు రెట్టి వారు జగము లోన 2-2-167

మదమలిన మనస్కుఁడవుం
తుదుఁడు నృశంసుఁడనఁ బరగు దుష్టునకు సం
పద లెడలయ్యును నాతని
మొదలిటి సంపదలతో సమూలంబు చెడున్ 2-2-202

అహితుల నెల్ల విధంబుల
విహతులగాఁ జేయునది వివేకమని మహా
న్మహితుండు చెప్పె నిది మును
బృహస్పతి సురేశ్వరునకుఁ బ్రియహిత బుద్ధిన్ 2-2-271

తిలలును నీళ్ళును వస్త్రం
బులుఁ బుష్ప సుగంధ వాసమున సౌరభముం
బొలుపెసఁగఁ దాల్చుఁ గావున
నలయక సత్సంగమమున నగు సద్గుణముల్ 3-1-6

బలము గలవానిఁ బలువురు బలవిహీను
లొక్కటైకూడి నిర్జింతు రుత్సహించి
మధువుఁగొన నుత్సహించిన మనుజుఁ బట్టి
కుట్టి నిర్జించు మధుకర కులము పట్లు 3-1-251

అంతకుండు జనుల కాసన్నుఁడై యుండ
నిమిష మాత్రమేని నిశ్చయింపఁ
దగని జీవనంబు దద్ద సుస్థిరముగాఁ
జేసి కార్యమెడయ్యుఁ జేయఁదగునె 3-1-261

వగవఁగ సాంగోపాంగము
లగు నాలుగు వేదములయు నధ్యయనము పో
ల్పఁగ నొక సత్యముతో నెన
య్యగునె తుల్పియును బోలవలె సత్యంబున్ 3-2-83

పురుషు నందు దోష పుంజంబు గల్గిన
నెఱిఁగి యెద సహించునేని, భార్య
పురుషు నం దభీష్ట భోగంబు; దేహాంత
రంబు నందు ధర్మరతియుఁ బడయు 3-2-160

తిల గో సువర్ణ దానం
బులు నుపవాసములుఁ దీర్థముల సేవయు ని
మ్ములఁ జేయని వారు దరి
ద్రులు రోగులు నగదు రాత్మదోషము పేర్మిన్ 3-2-242

క్రతు ఫలములు వడయఁగ దు
ర్గతులకు దొరకొనదు; తీర్థ గమనంబునఁద
త్క్రతు ఫలము లందుదురు దు
ర్గతులును నిది మునుల మతము కౌరవ వృషభా! 3-2-243

ధర్మజ్ఞులైన పురుషులు
ధర్మువునకు బాధసేయు ధర్మువునైనన్
ధర్మముగా మదిఁ దలఁపరు
ధర్మువు సర్వంబునకు హితంబుగ వలయున్ 3-3-230

గురు ముఖమునఁ బడయక దు
ష్కర తపమునఁ జేసి పడయగాఁ బడు విద్యల్
పరమార్థము మదమును ను
త్సరమును గావించు నెట్టి సాధులకైనన్ 3-3-256

గురుశుశ్రూష యొనర్చుచుఁ
బరమ క్లేశమునఁ జేసి పడసిన విద్యల్
స్ఫురియించుగాక గురుముఖ
విరహితముగఁ బడసి నవియు వెలయునె యెందున్ 3-3-282

జనులు నిగ్రహానుగ్రహశక్తు లైన
రాజు శాసనమునఁ జేసి రమణతోడ
నోలిఁ దమతమ మర్యాద లొక్కనాఁడుఁ
దప్ప నోడుదు రిమ్మహీతలమునందు 3-3-350

ఉత్తమ క్షత్త్రియుండేల యొరుల నడిగి
వేఁడు వాఁడగుఁ ? దన భుజ విక్రమమున
నన్యధనము లుపార్జించి యర్థిజనుల
కిచ్చి కీర్తి దిక్కుల వెలయించుఁగాక 3-3-365

కడుకొని కడు దుఃఖములై
నెడ నుచితమె యాత్మనింద యెయ్యెడల మనం
బెడలక యే కాకృతి నె
వ్వడు నుండుట సూవె పురుషు పురుషార్థమిలన్ 3-4-113

వృత్తవంతుండు వెండియు వివిధగతుల
వృత్తవంతుండు గానేర్చు; వృత్తహీనుఁ
డైనవాడు విహీనుండ యండ్రు గాన
విత్తరతుకుఁ గడుమేలు వృత్తరతు 3-4-129

# పద్య భాగాలు

1 గురు కార్య నిరతులగు స
త్పురుషుల కగుటరుదె యధిక పుణ్యఫలంబుల్ 1-1-119

2. ప్రల్లదుఁడైన యొక్క కులపాంసను చేసిన దాన తత్కులం
బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము ? 1-1-124

3. తీర్ప రా దనృతాభి
భాషణముననైన పాపభయము 1-1-129

4. పరనిందయు నాత్మ గుణో
త్కర పరికీర్తనముఁజేయగా నుచితమె? స
త్పురుషులకైనను 1-2-112

5. ధర్మవు నుచితంబుఁ దప్పని వారల
సదమలాచారుల, నుదిత సత్య
రతుల, నఖిలలోక హిత మహారంభుల
భూరి గుణుల నిర్జితాలి వర్గు
లై వెలుంగు వారి దైవంబు రక్షించు,
దురిత విధుల నెపుడుఁ బొరయకుండ 1-3-14

6. గురులకు శిష్యులు పుత్రులు 1-3-131

7. పతిఁబడసి సుతులఁ బడయగ
నతివలు గోరుదురు 1-3-170

8. ............ అల్పమయ్యు: ద
ర్పము బహుకాల సంచిత తపః ఫల హాని యొనర్పకుండునే 1-3-117

9. ............ ముగ్ధు లధిపులు
మఱవరె! బహు కార్యభారమగ్నులు కారే ! 1-4-69

10. ............ నమ్మియుండగా
వలవదు బుద్ధిమంతులు నవప్రియులైన ధరాధి నాథులన్ 1-4-70

11. ఏనకాని దీని నెఱుగ రిందొరులని
తప్పఁ బలుక నగునె ధార్మికులకు 1-4-79

12. కామికి నయంబున నొందు దఱంపఁబోలునే 1-4-215

13. పతియ లేక జీవించు నస్యుతివకైన
జీవనము కంటె దానికిఁ జావలగ్గు 1-5-81

14. లలితాంగి! యెల్ల లోకం
బులు ధర్మువునంద నిలుచు 1-5-92

15. ధనమున విద్యను సంతతి
దనిసిన వారెందుఁ గలరె? 1-5-119

16. ధనములలో నత్యుత్తమ
ధనములు శస్త్రాస్త్రములు 1-5-201

17. ఎయ్యెడల దుర్జనుల నేమఱి నమ్మఁగఁ బోలునే 1-6-230

18. ఎప్పుడు నుచితమె? యొరుల యిండ్ల పొత్తున నుండన్ 1-7-29

19. కూతులఁ గన్నఫలము దగిన
వరులకు సద్ధర్మ చరితులకీఁ గాన్పుకాదె 1-7-87

20. గురులలోనఁ బరమ గురువు తల్లియ, యట్టి
తల్లి వచనమును, విధాతృ కృతము
నన్యథాకరింప నలవియే 1-7-254

21. సౌ, మ్యాకృతులు గాని వారల
వాకులు శిక్షలు నుపద్రవంబుల కావే 1-8-41

22. ఇంతుల నిమిత్తమున ధృతి
మంతులుఁ బొందుదురు భేదమతి 1-8-114

23. భూజన పరివాదం బ
వ్యాజంబునఁ బరిహరింప వలయును 1-8-123

24. కరుణను శరణాగతులగు
పురుషుల రక్షించు నంత పుణ్యము కలదే 1-8-291

25. ......................పెద్దల
చరితం బల్పులకు నెఱుఁగశక్యమె యెందున్ 2-2-19

26. పాపవృత్తంబు జూదంబు పార్థివులకు 2-2-166

27. సాధులకు నసాధుసహవాసమునఁ బాప
సంప్రయోగమగుట సందియంబె 3-1-5

28. సుజనుల సహవాసంబునఁ
గుజనులు సద్ధర్మమతులగుట నిక్కము 3-1-88

29. దేవతల కప్రియంబులు
గావించు మనుష్యు లధమగతు లగుదు రిలన్ 3-2-50

30. ఎంతయోటువడిన నంతియ జూదంబు
నందుఁ దగులుఁ జలము నతిశయిల్లు 3-2-63

31. ఎల్లవారు నెఱుఁగ రెల్లవారిని, భిన్న
విషయు లెల్లవారు విద్యలందు 3-2-174

32. దర్పితు, లైన వారి పేర్మి యధ్రువంబు 3-3-59

33. విలా, సినుల సహాలాప సహా
సహయానమును బంధసమములు కావే ! 3-3-111

34. ఆశ్రితత్యాగమిది ధర్మవగునె ? 3-3-232

# వచన భాగాలు

1. కొడుకులు సమర్థులైనం దల్లిదండ్రుల
యిడుమలు వాయుట యెందునుంగలయది 1—2—52

2. బుద్ధిగలవారికిఁ గ్రోధంబు కొనియాడందగదు 1—3—148

3. సర్వప్రాణులకు సామాన్యంబయ్యును మనోజ
రాగంబు వనితల కసహ్యంబయి విశేషం
బయి యుండు 1—6—222

4. ప్రాణ వియోగంబు సేసి యయినను
భార్య, పతికి హితంబు సేయవలయు 1—3—255

5. ఫలార్థియయినవాడు తత్ఫలానుబంధం
బులయిన దోషంబులు పరికింపండు 1—7—12

6. పెద్దవాఁడుండఁ గొండుకవానికి
వివాహంబగుట ధర్మవిరుద్ధంబు 1—7—212

7. కీర్తియు నపకీర్తియు జనులకు
స్వర్గ నరక నిమిత్తంబులు 1—8—33

8. సర్వదాన ధర్మక్రియలును బ్రాణ
దానంబుతో సమానంబులు గావు 1—8—134

9. జూదంబును వేటయుఁ బానంబును
బహుభక్షణాసక్తి నను నాలుగు
దుర్వ్యసనంబుల దగిలిన పురుషుండు
ధర్మువుందప్పి వర్తిల్లు — 2—2—227

10. దుష్కృత్యంబుల యందనారంభులయ్యును
జనులు దుర్జన దర్శనస్పర్శన సంభాషణ
సహాసనంబులం జేసి ధర్మవిహీను లగుదురు 3—1—7

11\. తపస్సిద్ధులయినవారు దమదలంచిన
దానిన క్రమంబునం బడయుదురు 3—185

12\. ప్రజానురాగంబు లేనివానికి రాజ్యంబు
సుస్థిరంబు గానేరదు 3— —207

13\. యథాకాల కల్పిత క్షమాతేజుండయిన
వానికి నుభయలోక సిద్ధి యగు 3—1—2,8

14\. తపస్స్వాధ్యాయ యజ్ఞకర్తలయు
బ్రహ్మవిదులయుం బడయు పుణ్యగతులు
క్షమావంతులు వడయుదురు 3—1—224

15\. ఎఱుకగలవారికిఁ గర్మంబు కర్తవ్యంబు...
...దైవమానుషంబులు కర్మఫలప్రాప్తికి
నిమిత్తంబులు- పురుషుండు మనంబున
నర్థసిద్ధి నిశ్చయించి కర్మంబునందుఁ
గృతోత్సాహుండు గావలయు నట్టి
వానికి దైవంబు సహాయంబయి కర్మ ధ
గావించు 3—1—233

16\. శిష్టచరితంబయిన ధర్మువు నధిక్షేపించుచున్న
దుర్మతికిం బ్రాయశ్చిత్తంబు లేదు 3—1—328

17\. నికృతిపరులయందు నికృతియు వలయు 3—'—246

18\. రాజ్యంబులు ; బుత్రులును ధనంబును
యశంబును సత్యంబునకు సమంబులుగావు 3—1—[illegible]

19\. మహాకార్యంబు సాహసక్రియాసాధ్యంబు
గాదు. సువిచారితంబై సిద్ధిబొందు.
విచారపూర్వారబ్ధకార్యంబునకు దైవంబును
ననుకూలంబగు 3-1-268

20. ఒక్కచోటన పెద్దకాలం బునికి యెవ్వరికిఁ
ప్రీతిజనకంబుగాదు 3-1-276

21. తీర్థగమనఫలం బెల్ల పుణ్యంబులకు విశేషంబు 3-

22. అధర్మవర్తులయందు దర్పంబు పుట్టు -
దర్పంబువలన మానంబుపుట్టు - మానంబు
వలనఁ గ్రోధంబుపుట్టుఁ గ్రోధంబువలనిం
జేసి లజ్జయు వృత్తంబును చెడు - నష్ట
లజ్జావృత్తులయినవారి నుపశమంబును
లక్ష్మియు విడుచు 3-2-213

23. విద్యాతపోయుక్తులై ధర్మచరిత్రు లయిన
వారి కారణంబున జగంబు లపాయంబు
నొందక సుఖంబున్నయవి 3-3-10

24. అతిసుగంధులయిన కుసుమంబులు
మునులకు వర్జనీయంబులు 3-3-110

25. దేవతలు బలిహోమ నమస్కారంబులం
జేసి భక్తిసాధ్యులు గాని సాహసక్రియా
సాధ్యులు గారు 3-3-347

26. సర్వకార్యంబులు మంత్రమూలంబులు- గావున
విద్వాంసులై ప్రబుద్ధులైనవారలతో మంత్రంబుఁ
జేయునది. బాలకులయు, నధికశ్రీదర్పి
తులయు, లుబ్ధులయు, లఘుజనంబుల
యుందోడ మంత్రంబు సేయవలదు 3-3-349

37. విశ్వసించిన వారికిం, గుడువంబెట్టినవారికి
నెగ్గుసేయుట కడుంబాపంబు 3-3-

# ఉపసంహారము

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం" అని కీర్తించారు మహాభారతాన్ని సంస్కృతంలో. అటువంటి మహాభారతం మొదటగా తెలుగువారికి విందు చేసిన నన్నయ సుకృతాత్ముడు. నన్నయ భారత భాగంలో ప్రసక్తమైన నీతి, ధర్మ ప్రబోధకాలయిన పద్యాలను చాలా వరకూ క్రోడీకరించి వాటిలో నన్నయ నిక్షేపించిన రుచిరార్థాలను వివరించేందుకు ప్రయత్నించాము. ఇది కేవలం చాపలం కావచ్చు. అయినా మా యీ చాపలం సమర్థులకు ప్రేరణనిస్తే సంతోషం.

జాతిని ఉత్తేజపరిచే భారతసంస్కృతినీ, సంప్రదాయాన్నీ, పూర్తిగా కాక పోయినా రేఖామాత్రంగా నయినా ఒకసారి ప్రదర్శించాలనే తపన సహృదయులు గ్రహింపకపోరని విశ్వాసం. మహత్తరమైన, బరువైన భావాలకు నిలయం భారతం. అసలు మహాభారతం అనే పదానికి అదే అర్థం చెపుతారు. వాటిని రమణీయంగా రుచిరంగా తీర్చిదిద్దాడు నన్నయ. వాటిలో చాలా ఇక్కడ వివరించాము. మిగిలినవి కొన్ని పేర్కొన్నాము. పాఠకుల అవగాహనకూ—
ఆలోచనకూ——

# పద్యముల అకారాది పట్టిక

* * * * *